# సంపూర్ణరామాయణము


గ్రంథకర్త:

అయినాపురపు సోమేశ్వరరావు.



ప్రకాశకులు:

వసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, రాజమండ్రి.





కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

1926.




వెల 1-4-0

# భోజరాజచరిత్రము

నూతనము. వెల రు 1-0-0 నవరసభరితము,
అపూర్వము. ముక్తి దాయకము.

శ్రీ అయినాపురపు సోమేశ్వరరాయకవి విరచితము.

ఇంతవరకు ఆంధ్రదేశమున భోజనామము విన్నవారేకాని ఆమహారాజు చరిత్ర తెలిసినవారు లేరు. ఆలోప మీగ్రంథము వలన దీరినదని నిశ్చయముగ చెప్పగలము. భోజుని ఆస్థానమందు కవిచక్రవరుల కవితావిలాసములు, కాళిదాసు ప్రభృతి పండితుల చర్యలు, భోజుని ఔదార్యము, వేశ్యాంగనా వర్ణనాది చిత్రవిచిత్ర చమత్కారబంధుర సుందరకథావల్లరి నవరసభరితమై, ఆహ్లాదజనకమై మనోహరమై చదువువారి చవులూరజేయుచుండును. భోజుని జీవితమందలి గభీర విషయముల చదివి యాహా యనని వారుండరు. బహుప్రయాసమున పలుస్థలములనుండి వివిధ విషయములసేకరించి వ్రాసిన యీగ్రంథము ప్రతి యక్షరాస్యుని కరము నలంకరింపతగినది. చక్కని ముద్రణము. 140 పేజీలు.

# ప్రమదామనోహరము

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వర రావుగారిచే" రచియింపఁబడిన 7 అంకముల నూతననాటకము. ఈనాటకము పలుమారు బలువురిచే బ్రదర్శింపఁబడి వన్నెకెక్కియున్నది. ఇందు ధూమ్రకేతు, విజయసేనుని ప్రతిజ్ఞావాక్యములు మిగుల భయానక రసంబును, వీరరసమును తగవులేకుండ జేయుటకై విక్రమార్కుని నీతిబోధయు, చదివి యానందించవలసినదే గాని వర్ణించుటవలన లాభము లేదు. కథానాయికయగు "ప్రమద" సమయానుగుణ్యముగా జూపించు శోక, ధైర్యస్థైర్యములు లోకమావు చదివిచూచిన "సెబాస్" అని యనకుండ నెవ్వరైన నుండగలరా? చంద్రకేతుని సాహసౌదార్యములు గాంచి భళీయనవలసినదే. విజయసేనుని ప్రతిజ్ఞానిర్వాహణము గాంచి శిరఃకంపన మొనరింపవలసినదే. ధూమ్రకేతుని దుష్ప్రవర్తనఁ గాంచి ఛీ ఛీ యని తీరుదురు. వేయేల నాటకము గాంచినచో మాకు వ్రాసిన దానియందలి యాథార్థ్యము మీకే బోధపడును. ద్వితీయముద్రణ మిప్పుడే వెలువడినది. త్వరపడకున్నచో ప్రతులు లభింపవు.

వెల రు 0-10-0

కసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు, ఇన్నీస్‌పేట, రాజమండ్రి.

# సౌర్ణరామాయణము.



ఇది

...కీ-అనసూయ, విచిత్రచిత్రమాల, ప్రమదామనోహరము,

...చ-దేవయాని, ప్రహ్లాద, పుండరీక మొదలగు నాట

కములు రచించిన

...నాపురపు సోమేశ్వరరాయకవిచే

రచియింపఁబడియె.



పబ్లిషర్సు.

...లేటి వేంకట్రామయ్య అండు బ్రదర్సు,

రాజమండ్రి.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కా.. నాడ:

...టమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1926

...వ్య సంకలితము.] [వెల రు 1-4-0

# పీఠిక.



భాషాభిమానులారా!

లోకారాధ్యుండగు శ్రీరాముని దివ్యచారిత్ర మెందరెన్నివిధములుగా నెన్నెన్నిమారులు వ్రాసినను దనివి తీరునదిగాదు. ఈదివ్యచారిత్రమునం దట్టిమహామహిమ మున్నది. సర్వజనాదరణీయమై, పూజనీయమై, పతితపావనమై యలరారు నీమహాచారిత్రమును వ్రాయవలయునను నుత్సాహంబుతో దీనిని వ్రాసి ముగించితిని. ప్రదర్శనానుయోగ్యముగా నిట్టిమహాచారిత్రమును వ్రాయుట మిగులఁ గష్టతమము. నాయసమర్థత నంతఁగాఁ బాటింపక నాభక్తారాధ్యుండగు శ్రీరాముని మీఁదనే భారముంచి వ్రాయఁగడంగితిని. భక్తాభీష్ట మొనగూర్చుటాలోకారాధ్యుని విహితధర్మమే గదా?

ప్రధానవిషయంబులకు లోపము రాకుండ, కథకుంటుపడకుండ సాధ్యమైనంతవఱకు జాగ్రతగా రచియించితి ననియే నాయభిప్రాయము. లోపములున్నచోఁ బ్రాజ్ఞులు చూపించిన ద్వితీయముద్రణమున సవరించుకొందును. కొన్ని భాస్కరరామాయణములోని పద్యములే యుపయోగించితిని. వానికి * మార్కు నుంచితిని.

ఇట్లు,<br>
విన్నవించు సజ్జనవిధేయుఁడు,<br>
అయినాపురపు సోమేశ్వరరావు.



# ఈనాటకమునందు వచ్చు ముఖ్యపాత్రములు.

| పురుషులు. | | స్త్రీలు. |
| --- | --- | --- |
| విష్ణువు. | జటాయువు. | సీత. |
| సప్తమహాఋషులు. | హనుమంతుఁడు. | కౌసల్య. |
| దశరథుఁడు. | సుగ్రీవుఁడు. | కైక. |
| సుమంత్రుఁడు. | వాలి. | సుమిత్ర. |
| వసిష్ఠుఁడు. | అంగదుఁడు. | మంథర. |
| విశ్వామిత్రుఁడు. | జాంబవంతుఁడు. | లంఖిణి. |
| రాముఁడు. | సుషేణుఁడు. | అహల్య. |
| లక్ష్మణుఁడు. | గజుఁడు. | మండోదరి. |
| మారీచుఁడు. | అక్షయుఁడు. | తాటకి. |
| సుబాహుఁడు. | ఇంద్రజిత్తు. | ఏకజట. |
| జనకుఁడు. | విభీషణుఁడు. | హావిర్జట. |
| మంత్రి. | అగ్ని. | త్రిజట. |
| పరశురాముఁడు. | బ్రహ్మ. | శూర్పణఖ. |
| భరతుఁడు. | శివుఁడు. | |
| శత్రుఘ్నుఁడు. | ఇంద్రుఁడు. | |
| రావణుఁడు. | | |

వ రా:—ఇంకను సందర్భానుసారము మునులు, సేవకులు, పురజనులు, కబంధుఁడు, విరాధుఁడు మొదలగువారు వత్తురు.



శ్రీరామచంద్ర.

# సంపూర్ణరామాయణము.



## పూర్వరంగము.



స్థలము:—పాలసముద్రము.

[మహేంద్రుఁడు, కుబేరుఁడు, నారదుఁడు, జాబాలి, గౌతముఁడు, కణ్వుఁడు మొదలగు మునులుండఁగాఁ దెర లేచును.]

అందఱు—(చేతులు మోడ్చి)

తోడి రాగము—ఆదితాళము.

కమలా మనోహరా! కాపాడ రావు- కారిన్యమేల ?॥ కమ॥
నీ- ప్రాపుఁ జేరి- నిను వేఁడుచున్న
గా- పాడకున్న- దిక్కెవ్వరులున్న॥ కమ॥
దే- వా- ధీ- శా !-
పడుచున్న బాధ- వచియింప లేము-
గతిలేదు మొఱ్ఱ- నాలింపకున్న॥ కమ॥
శ్రీశా!- ఈశా!- పోషా!-
క్రూర రాక్షసుల- దారుణంబులను-
బాధలోర్చి మని- యుండ లేము॥ కమ॥
శ్రీధవా!- మాధవా!
మాదు కష్టముల- రూపుమాపి దయ-
జగము లేలి- కరుణింపుమయ్యా॥ కమ॥

కరివరదా!-

లోకరక్షకా- ప్రకటముగ నీ-

దానవాధముల- పొగరడగింపుము॥ కమ॥

[తెర లేచును.]

[శేషపాన్పుపై శ్రీమహావిష్ణువు పరుండియుండ లక్ష్మి పాదము లొత్తుచుండును.]

శ్రీవి—సురపుంగవులారా! మౌనిచంద్రులారా! మీరేటి కిట్లరుదెంచితిరి?

నార—శ్రీమన్నారాయణా! సనకసనందనాదులు జయవిజయుల కొసంగిన శాపమే మమ్మిట్లు త్రిప్పిత్రిప్పి కొట్టుచున్నది.

మహేం—లక్ష్మీనారాయణా!

సీ. మత్స్యావతారివై । మహిత వేదంబు ల
సురుల పాల్గాకుండఁ । జూచినావు
కూర్మావతారివై । గోత్రిభారము మోచి
మొనలేసిసుధను మా । కిచ్చినావు
ధరను వరాహావ । తారివై కనకాక్షు
మ్రందించి లోకముల్ । మనిచినావు
నారసింహుఁడవయి । క్రూరహిరణ్యక
శ్యపుఁ ద్రుంచి జగములన్ । సాఁకినావు
వామనావతారుఁడవయి । బలి నడంచి
పరశురాముండవై లోక । భార ముడిపి
లోకరక్షకబిరుదు సు । శ్లోకమతిని
నిలుపుకొని నేఁడు రక్షింపఁ । దలఁప వేల?

కుబే—రమామనోహరా!

తే. గీ. ధర్మసంస్థాపనార్థమై । ధరణి యుగయు

గంబునందున నీవు జ । న్మంబు గాంచి
శిష్టులను బ్రోచి శిక్షించి । దుష్టమతుల
నేడు మాటాడకుండుటే । నీతి దేవ.

శ్రీవి—సురలారా! మఱల లోకకంటకుం డెవ్వఁడైన నుద్భవించెనా?

జాబా—పుండరీకాక్షా! నీద్వారపాలకులగు జయవిజయులు శాప దగ్ధులైనప్పుడు త్రిజన్మంబులవఱకు నీతో బద్ధవైరులై యుంపుట కనుమతించిరి గదా? వారు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులై జన్మించుటయు నీచే హతులగుటయు నైనది. తిరిగి వారిప్పుడు రావణ, కుంభకర్ణులై జన్మించి లోకముల లయింపుచున్నారు.

సీసమాలిక. పలలాశనులు మమ్ము । పరిపరివిధముల
బాధించుచుండిరో । పరమపురుష!

కణ్వ—పుణ్యకార్యంబుల । పొంతఁ బోయెడివారి
కడ్డమై నిల్చు న । హర్నిశంబు

గౌత—వేవేగవచ్చిహ । విర్భాగములు మాకుఁ
గొనసరక నిక్కడంచుఁ । గొట్టుచుండు

నార—జన్నంబు లొనరింప । సాహసించితిరె నా
యనుమతి గొనకుండ । ననుచు గనలు

మహేం—కామితార్థము లిచ్చు । కల్పభూరుహము మీ
కేల మాకిడుడని । యెదరు సామి

కుబే—యజ్ఞయాగాదుల । నన్నియు క్షణములో
ధ్వంసంబు గావించి । తరలుచుండు

మహేం—పీయూష మర్పించి । వేవిధంబులఁ మమ్ముఁ
గాపాడుడని వేడఁ । గాతుమంచు

జాబా—మిమ్మొప్పు రక్షించు । మేటిదేవుఁ డెవఁడో
గలఁడందు చూపింప । వలయుననును

నార — చెప్పవలసినదేమి ల । క్ష్మీసనాథ
మిమ్ము గెల్వంగవలెనను । మేటికోర్కె
గల్గియుంటఁ దపమొనర్చి । కడకమేయ
వరములను బొందియుండి రా । వణ్ణరక్ష.

శ్రీవి — (శిరఃకంపనమాచరించుచు) నారదా! ఆదుష్టరాక్షసు లేయే వరములను బొందియుండిరో విశదీకరింపుము.

నార — మహానుభావా! వారిలో పెద్దవాఁడగు రావణుఁడు నరవానరులచే గాక శక్తిన నెవ్వరిచేతను మరణము లేకుండునట్లు వరములబొందెను. నరవానరులను వాఁడు మరచిపోయె నేగాని లేకున్న నవియును గోరెడివాఁడే. వానిసోదరుండగు కుంభకర్ణుఁడు 'నిర్దయ' కావలయునని గోరం దలంచుకొని తొందరలో 'నిద్దుర' కావలయునని కోరుకొనెను. ఆకారణంబున వానికెల్లప్పుడును నిద్దురయే. అందుచే రావణుఁడు మారీచుని దనకు సాహాయ్యంబుగాఁ దీసికొని లోకముల నేచుచున్నాఁడు.

శ్రీవి — సరే. సురలారా! మునిచంద్రులారా! వారివారి పాపసంచయమే వారిచే నట్లు గోరించినది. అయోధ్యాపురాధీశ్వరుండగు దశరథుఁడు, కౌశల్య సుమిత్రాకైకలను ముగ్వురుభార్యలతోఁగూడ పుత్రకామేష్టిఁ జేయుచున్నాఁడు. నే నాతని పెద్దభార్యయగు కౌశల్యగర్భంబున రాముండను పేరితో నుద్భవించెదను. ఈ శేషుఁడే లక్ష్మణుఁడుగా సుమిత్ర కుద్భవించును. శంఖచక్రంబులు భరత, శత్రుఘ్నులగా కైకా సుమిత్రల కుద్భవింతురు. దేవతలెల్లరును వానరులై కిష్కింధాపురంబున జన్మించి నాకొఱకై నిరీక్షించియుండుఁడు. లక్ష్మి మిధిలాపురాధినాథునింట 'సీత' యను నామముతో బెరుగుచుండును. అప్పుడే సీతాపహరణవ్యాజంబున నాక్రూరరాక్షసులఁదుదముట్టింతును.

మీరు వగపు దక్క బొండు. రావణ సంహారమున కెదురు జూచుచుండుడు. (అంతర్ధానుఁడగుచు.)

కాఫీరాగము:—అటతాళము.

అందఱు:—

ప॥ ఆనందమాయె- మాకు- మిగుల॥ ఆనం॥

అ॥ ప॥ ఆనందమాయె- బ్రహ్మానందమాయె। ఆనం॥

చ॥ స్పష్టముగా మొఱవిని - కష్టము దొలగింపఁగా
నిష్టపడె శ్రీహరి - యీమాట వినుటచె మిగు॥ నానం॥

2. కరిరాజవరదుఁడు - కాపాడదలచెనూ
దురితాత్ములను - గృంపగదలఁచెను మిగుల॥ నానం॥

(అందఱు నిష్క్రమింతురు)

ఇది పూర్వరంగము.






# సంపూర్ణ రామాయణము



## ప్రథమాంకము.



### పరశురామ గర్వభంగము.

ప్రథమరంగము :—దశరథుని దర్బారు.

[వసిష్ఠుఁడు, దశరథుఁడు, సుమంత్రుఁడు గూర్చుండియుండఁగాఁ తెర లేచును]

వసి— 1 వ. అనుబాధము.

దశరథావనీశా ! నీబిడ్డలు సామాన్యమానవులని దలంచుచుంటివేమో ? నీపెద్దకుమారుండగు శ్రీరాముఁడా శ్రీహరియే గాని మనుజమాత్రుఁడుగాఁడు. లక్ష్మణుఁడామహామహుని శేషశాయి. భరతశత్రుఘ్నులాలోకారాధ్యుని శంఖుచక్రములు. ఆపరంధాముఁడు నీకుఁ గుమారుఁడై జన్మించి లోకములు రక్షించునని శ్రీవాల్మీకిమహర్షి వ్రాసియుండెను. అయ్యది గాంచియే యేనాఁటికైన యామహామహుని- యాభక్తజనమందారుని- యాభక్తజనసులభుని- సేవఁ జేసి యాతనికి గురువునై- యాతని సమక్షమమునుండి తరింపవచ్చునని యే నీయిక్ష్వాకువంశమునకుఁ బురోహితుఁడనై యుంటిని. నేఁటికి నాజన్మ ఫలించినది. నాతపస్సు ధన్యమైనది. ఎవ్వారికిని

దొరకని మహాఫలితము నాకు దొరకినది జగద్గురునకు గురువు నగుటకంటె నాకింకఁ గావలసినదేమున్నది ? ఆభక్తవత్స లును నిండారుభక్తితో నిరంతరమును ధ్యానించుచు, ననవర త మామూర్తినిఁ గన్నులఁగనుచు, ప్రతినిమేషం బాతనితోఁ బ్రసంగించుచు, ననుక్షణ మాతని మృదుమధురవాక్యజాల ముల వినుచుండెడి భాగ్యమెంతటివారికి లభించును. నాయదృ ష్టము మంచిదగుటచే నాకట్టిభాగ్యము లభించినది.

2 వ అనుబంధము.

భటు—(ప్రవేశించి) దేవా! జయము. జయము. విశ్వామిత్ర మహ ర్షులవారరుదెంచియున్నారు. దేవా! ఏమిసెలవు?

దశ—ఓరీ! వారిప్రవేశము శీఘ్రగతినను పుము.

భటు—చిత్తము. (అని నిష్క్రమించును.)

[విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

దశ—(ఎదురుగాఁజని) మునికులతిలకా! నమస్కారము. ఈయాసన మధిష్ఠింపుఁడు.

విశ్వా—సుఖీభవ! (అనికూర్చుండి) దశరథా!

కం. శుభముగ నుండిరె మీరలు
సభవారును బాంధుకోటి ! సతిసుతులును, యె
ట్టిభయము లేకుండఁగ మీ
యుభయంబున బ్రజలకెల్ల ! నతిసౌఖ్యంబే.

దశ—కౌశికఋషిచంద్రమా! తమయాశీర్వచనకటాక్షవీక్షణము వలన మేమందఱమును క్షేమముగానున్నారము. మహాత్ములూరక రారు. మీరాకకుంగల్గిన విశేషకారణం బెద్దియోయని యెఱుంగు టకు నామనం బుత్సహించుచున్నది. దయచేసి కారణం బెఱిం గింప గలందులకు గోరుచున్నాను.

విశ్వా—పంక్తిరథా! చక్కఁగాఁ గనిపెట్టితివి. ఒక విశేష కార్యముండి యే నీసమక్షమున కిప్పుడు రావలసివచ్చినది. నా కార్యసానుకూల మొనరించెదనని వాగ్దాన మొసంగితి వేని నారాకకుం గల్గిన కారణం బెఱింగించెదను.

వసి—(తనలో) ఎందులకో ముందరికాలునకు బంధము వైచుచున్నాఁడు.

దశ—

చం. అలఘుతపోనిదాన! తమ । యంతటివారలె యిట్లు నాయెడం
గలిగినప్రేమతో నెదియొ । గావలె దీర్చెదఁబో యటన్న, కే
వల మది విన్నమాత్రమున । భాగ్యమటంచు వచింపఁబోక, నా
వలనను గాదు పొమ్మనుచు । బల్కెడివాఁడ నటంచు నెంచిరే.

మునిచంద్రమా! నా యెడల మీ కట్టి సంశయ మెందులకు గల్గినదో యూహింపఁ జాలకున్నాను. నా యెడ మీ కట్టి సంశయముండవలసిన పనిలేదు. మీ యభిమత మెద్దియైనను సరియే దీర్చెదను. మీ యభీష్టం బెద్దియో యెఱింగించి నన్ను ననుగ్రహింపుడు.

విశ్వా—అట్లయిన నో సత్యవాక్పరిపాలకా! మదభీష్టము వినుము.

మ. దశరాత్రంబుల యజ్ఞ మొక్కటియె చి । త్తంబందు నూహించి నే
గుశలత్వంబున జేయఁగాఁగడఁగఁగా । క్షుద్రాత్ములౌ దానవుల్
నిశరాత్రిం జనుదెంచి యాగమునె పే । ర్చి ధ్వంసముం జేయ నెంచి, సదా వేదికరక్త మాంసములతో । నిండింపుచున్నారయో.

నేను యాగదీక్షబూనిన పుడెల్ల రాత్రించరు లరుదెంచి దానికి విఘ్నమాపాదించుచునే యున్నారు. నోటనుడువుటకైనను వీలులేని క్షుద్రకార్యము లొనరించి జన్నమునకు విఘ్నం బొనరించుచున్నారు. ఆ పాపాత్ముల మర్దించి నా క్రతువును నిర్విఘ్నముగా జేయింపఁగలవాఁడు నీ పెద్దకుమారుండగు రఘురాముఁ డొక్కడే సమర్థుఁడు. కావున వానిని నా వెంటబంపుము.

దశ—మునిసార్వభౌమా! మా రాముఁడు—

సీ. బాలుఁ డింకను ముక్కు । పచ్చలారనివాఁడు
కదనరంగమున నిల్వఁ । గఁ గలండె?
పసివాఁడు, క్రూరరా । క్షస మాయ లెఱుఁగని
యజ్ఞాని వైరుల । నణపఁగలఁడే?
విల్లమ్ములనుబట్టు । విధమంత బాగుగాఁ
దెలియని సుకుమారి । గెలువఁగలఁడె?
కనుగందు గృహమెప్డు । కదలిపోవనివాఁడు
కాననములఁ దిరు । గాడఁ గలఁడె?
పరుల నిజశక్తు లెఱుఁగఁడు, । గురుతరంపు
టస్త్రశస్త్ర ప్రయోగంబు । లసలెఱుంగఁ
డట్టివాఁ డెట్లు శత్రుల । మట్టుఁబెట్టు
కట్టవాఁ డేమి జయముఁచే । కూర్చు మీకు?

స్వామీ! ఆ బాలునివలన మీయాశయము దీరదు. రణ ప్రవీణ్యులైన నా సైనికుల నెల్లర బంపించెదను. వారెల్లరు రాత్రించరుల నుక్కడగించి మీక్రతు విధ్వంసం బొనరింపకుండ గాపాడఁగలరు. అంతియేగాని పసివాఁడగు రాముం డేమిచేయఁగలఁడు? అట్టి పనికి వానిని బంపించుటకు నామనం బెట్లంగీకరించును.

విశ్వా—దశరథా! నేను తెలివివిహీనుఁడనై శ్రీరాముని గోరితినను కొంటివా? ఆక్రూరరాక్షసులిట్టి తుచ్ఛసైన్యంబుచే మడియు వారని తలంచితివా? వారెవ్వరో తెలిపెదను వినుము.

తే. గీ. వారు సుందోప సుందుల । వారిసుతులు
ప్రబలబలశాలులైన రా । వణుని హితులు
కదనమున వారి గెల్వఁగాఁ । గలుఁగువాఁడు
రాముఁడొకఁడె పరులకు । దుర్జయులు వారు.

నీగర్భము నందుద్భవించినంత మాత్రమున నా శ్రీరాముని మానవ మాత్రుండని యెంచకుము. అతఁ డవతారపురుషుండు. ఇట్టి ముక్కిడిరక్కసాధముల బరిమార్చుటకే యా శ్రీహరి యీ యవతార మెత్తెను. సంశయింపకుము. రామలక్ష్మణుల నావెంటఁ బంపించుము. దానివలన నీకు మిక్కిలి శుభంబగును. నీగురుండగు నీవసిష్ఠుండు శ్రీరాముని జన్మరహస్యము నీకెఱింగించియేయుండును. కావున సంశయము విడచి రాగల శుభంబులకెదురుచూచుచు వారిరువురను బంపుము.

దశ—(తనలో) అక్కటా! ఈఋషిపుంగవుఁడు పట్టినపట్టు విడువకుండ నున్నాఁడు. దురాగ్రహాయత్త చిత్తుండగు నీనితో నేమనిన నేమిప్రమాదము వచ్చునోయని భయముగానున్నది. కానిమ్ము; మరల నిట్లు చెప్పెదఁగాక. (ప్రకాశముగా) సంయమీంద్రా! క్షమింపుము. అఱువేలయేండ్లు సంతానములేక తపించి- తపించి- క్రియకు బుత్రకామేష్టి యొనరించి యీసుతులఁ బడసితిని. వీరిని గనుఱెప్పలలో బెట్టి పెంచుకొనుచుంటిని. కావున నన్ను మన్నింపుము.

తే గీ పదియునైదేండ్లె గలిగిన । వయసువాఁడు
వాఁడె నాకులదీపమై । బరగువాఁడు
రాము నెడబాసి క్షణమైన । బ్రదుకఁజాల
గాన ననుఁగొనిపొండు రా । క్షసుల ద్రుంతు.

మీ కేమియు సంశయమువలదు. మీ యాగము నిర్విఘ్నంబుగా నెఱవేరునట్లు నే నొనరింపఁగలుగుదును. వలయునేని నా సైన్యముంతటితోడను వచ్చెదను. రణ మొనర్చెదను. ఆదుష్టరాక్షసుల బిల్కుమార్చెదను.

ఆ. వె. వయసు ముదిరినట్టి । వాఁడేను! రణ మేమి?
చేయు టేమి? యని నా । సింహకయ్య
ప్రియము మెచ్చుకొలఁది । రణకౌశలము హెచ్చె
చెట్టు ముదిరి చేవ । జెందినట్లు.

కావున రాక్షసులతోఁ బోరొనరించుటకు నన్ను దోడ్కొనిపొండు. పసి వాఁడగు రాముని విడచి పెట్టుఁడు.

3 వ అనుబాధము

విశ్వా—(కోపముతో) దశరథా! ఇదియేనా నీ సత్యవ్రతము? చాలు చాలు మారీచసుబాహులు నీచేతను-నీచేతను గూలువారు గారు. నీ సత్యవ్రతము నీవు నిలుపుకొనదలంచితివేని రామలక్ష్మణుల నా వెంటఁ బంపించుము. లేదంటివా!—

వసి—మునిశ్రేష్ఠా! దశరథుని నే నొప్పించెద. తమ రలుగకుఁడు. దశరథా! నామాట వినుము. గశుని తనయులు భృశాశ్వపత్నులలో జయ యను నామెవలనఁ గామరూపులును, సత్త్వసంపన్నులును, ననానాస్త్రరూపులునునైన నేఁబండ్రు సుతులను, సుప్రభయను నామెవలన శస్త్రరూపులై భాసిల్లు నేఁబండ్రు సుతులను బడసెను. ఈ గాధినందనుఁడు రాజుగా నున్నప్పు డానూటి శస్త్రాస్త్రవితతినిఁ బొందెను. అవిగాక యింకను గ్రొత్తశస్త్రంబులు సృష్టించుటకే గాధినందనుఁడు సమర్థుఁడు. ఈతఁడు నీకు మేలొనగూర్పఁగలఁడు. ఈతఁడెఱుఁగని శస్త్రాస్త్రంబు లేమియు లేవు. సంశయింపకుము. నీ వాగ్దానమును నీవు నిలువఁబెట్టుకొనుము. రామలక్ష్మణుల నీ మహానుభావుని వెంటఁ బంపించుము.

దశ—మునిచంద్రమా! మా శ్రీరాముని విడచి నే బ్రదుకఁజాలను.

వసి—దశరథా! రాముఁ డవతారపురుషుఁడు. ఇట్టి దుష్ట రాక్షసులను

సంహరించుటకై యీ యవతారమెత్తెనుగాని నీయింకపీఠిపై గూర్చుండుటకే యవతారమెత్తలేదు ఈతండు శివకేశవు లొక్కటియే యని భక్తకోటికి నిరూపించుటకును లోకద్రోహుల మట్టుబెట్టుటకును నీ యవతారమెత్తెను. ఈతని నామార్థ మిప్పుడు చెప్పుచుంటిని వినుము. 'నారాయణాయ' అను పంచాక్షరీమంత్రములో రెండవ యక్షరమగు 'రా' అగ్నిబీజాక్షరము. 'నమశ్శివాయ' అను శివపంచాక్షరీమంత్రములో 'మ" యను రెండవయక్షరము చంద్రబీజాక్షరము ఇప్పుడా రెండక్షరములునే 'రామ' నామమైనవి తొలియక్షరమైన 'రా' వలనఁ బాపులపాపములన్నియు భస్మీపటలమైపోవును. రెండవయక్షరమగు 'మ' వలన ధర్మము పోషింపఁబడును. ఈ నామమునందింతమాహాత్మ్యమున్నది. నామమునందే యింత మాహాత్మ్యమున్నప్పుడా మూర్తి యెట్టిదో గ్రహింపఁగలవా? నీ పూర్వపుణ్యవిశేషంబునఁ గాంచెదవు నీకుఁ గుమారుండయ్యెను. కావున సంశయింపక రామలక్ష్మణులను నీ మునిచంద్రుని వెంట బంపించుము.

దశ—చిత్తము. తమ యాజ్ఞాప్రకారమట్లనే బంపించెదను. (విశ్వామిత్రునితో) స్వామీ! దయచేయుఁడు రామలక్ష్మణులను మీ వెంట బంపించెదను (భటునితో) ఓరీ! నీ వరిగి రామలక్ష్మణులఁ దోడ్కొనిరమ్ము

భటు—చిత్తము. (అని నిష్క్రమించును)

[రామలక్ష్మణులు ప్రవేశింతురు]

రామ-లక్ష్మ—గురువరులారా! నమస్కారములు

దశ-వసి—దీర్ఘాయుష్మాన్ భవ. తనయులారా! ఇటగూర్చుండుడు.

రామ-లక్ష్మ—(కూర్చుందురు)

దశ—తనయులారా! గాధినందనునకు నమస్కారము లాచరింపుడు.

రామ-లక్ష్మ—కౌశికఋషివర్యులారా! రామలక్ష్మణులిదే యభివందన మాచరింపుచున్నారు.

విశ్వా—అవతారపురుషుల కనంతకల్యాణములగుఁగాక.

దశ—చిరంజీవులారా! మిమ్మీ కౌశికఋషివెంట బంపుటకు నిశ్చయించితిని. నాయనలారా! మీరీ మహానుభావుని వెంట వెడలి,

చం. క్రతువొనరింపఁగాఁ గడగు । కాలమునందున మేటిరక్కసుల్
క్షతజము మాంసఖండము ల । ఖండముగాఁ బడవైచి యజ్ఞభూ
క్షితి నెఱ వేఱకుండునటు । జేయుచు నుండెడి వారిజంపి యా
క్రతువు జయంబుగా జఱపి । గాధితనూజున కిందుమోదమున్.

రామ-లక్ష్మ—జనకా! మీయాజ్ఞ శిరసావహించితిమి.

దశ—సంయమివరా! మీ కోరికపై నా తనూజుల మీ వెంటఁ బంపించుచున్నాను. వారివలన మీయభీష్టములు నెఱవేర్చుకొనుఁడు.

విశ్వా—దశరథా! నీకు శుభంబగుఁగాక. పోయివచ్చెద. (అని రామలక్ష్మణులతో వెడలును.)

(తెర వ్రాలును.)



ద్వితీయరంగము

---

అరణ్యము.

[ప్రవేశము: విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో]

విశ్వా—కుమారులారా! ఇచ్చటికి కర్ధయోజనదూరములో తాటకి యను నొక రాక్షసాంగన మారీచుని జననిగలదు. మునుముందు దానిని బరిమార్పవలయును. రామా! మన మిప్పుడు నడచు

చున్నది సరయూనది దక్షిణతీరము. నీ వా నీరంబులచేత కరిగి శుచివైరమ్ము. నీకు బలయు, నతిబలయు నను విద్యలొసంగెదను.

రాము—మహాప్రసాదము. (అని నిమ్కృమించి శుచియై మఱల జనుదెంచి) మునివరా! శిష్యుని కేమియాజ్ఞ?

విశ్వా—రామా! ఇటురమ్ము. (అని చెవిలో మంత్రముజెప్పి) రామా! ఈ మంత్రపునశ్చరణ గావించుకొమ్ము. ఈ మంత్రబలంబువలన నీవు సుషుప్తుండవైయున్నను సరియే-ప్రమత్తచిత్తుండవైయున్నను సరియే-నీకు రాక్షసులవలన బ్రమాద ముదయింపదు. మఱియు నీ కీ మంత్రమాహాత్మ్యంబువలన సౌభాగ్యమును-బలమును-భుజశౌర్యమును-నెఱుకయు-గలుగును. ఈ మంత్రబలమువలన నీకు దిగ్విజయము గలుగును.

రాము—స్వామీ! అనుగ్రహింపఁబడితిని.

(అందఱును నడచుచుందురు.)

[తెరలో]

ఓరోరి మానవాధములారా! నిలువుఁడు నిలువుఁడు.

విశ్వా—రామా! రామా! చూడుము చూడుము. అదిగో! తాటకియను రక్కసి

*చ. ఉరుతరపాదఘట్టనల । నుర్వి చలింపఁగ మేనిగాలి నుద్ధురతరరేణువుల్ నెఱయ । ధూళిశిలాతరువృష్టు లుద్ధతింగురియుచు బాడబజ్వాలన । ఘోరతరక్త నిషిక్త వక్త్రగహ్వరమెసఁగన్ దిశల్ వగుల । నార్చుచు నుగ్రత నేఁగుదెంచెడిన్.

రామా! ఈ దుష్టరాక్షసియు నీమె కుమారుండగు మారీచుండును, మలదకరూశములు రెండును స్వరూపనాశనం బొనరించివైచిరి. అదిగో! అదిగో! రామా! రామా! అంతకంతకు మీదిమీ

డికి వచ్చుచున్నది. శీఘ్రమే దానిని సంహరింపుము. ఆడుది యని యెంతమాత్రమును సంశయింపకుము.

రాము—గురువరా ! నన్ను క్షమింపుడు.

తే. గీ. వనితలనుదుంప పాపమం । చనరి బుధులు
నదియుఁగాకుండ తొలిబాణ । మతివమీద
విడువఁజాలను దీనికి । య్యెడల బుద్ధి
వచ్చునట్టుల శిక్షించి । పంపివేతు.

ఇందులకు నన్ననుగ్రహింపుడు.

విశ్వా—రామా !

తే. గీ. పేరునకు మాత్రమే యది । నారి గాని,
నారిగా దది నిజము మ । హామారిగాని,
దానిఁ జంపిన పుణ్యమే । గాని నీకు
లేదు లేదిందు లవమైన । లేదు భవము.

తొలిబాణమని సంశయింపకుము. దీనికి మాటలతో బుద్ధివచ్చునని యనుకొనకుము. వేవేగ గిటడంచుము.

తాట—(భీకరాకారముతోఁ బ్రవేశించి) ఓరోరి మానవాధములారా! నిర్భయంబుగా నే నుండు వనంబునకే జనుదెంచితిరా ? ఇంకెం దుబోయెదరురా నరాధములారా !

కవిరాజవిరాజితము.

వడివడిబోవక నిల్వఁడు మీదగు । ప్రాణములఁ దగఁ దీయుచునే
వడియముల్లుగ వక్కుల రీతిని । బట్టి గుటుక్కున మ్రింగెదరా !

రాము—

పడతివటంచు చెడ భావన జేయుచు । బాణముదీయక నూరకయే
విడువఁగఁ జూచితి ప్రేలుటమాని వి । వేకముతో శరణన్న యెడన్.

తాట—ఓరీ దుర్మదాంధా !

ఉత్సాహ. వ్రేలికణువు డంతలేవు । వేడుకొన్న బోర్తువే
చాలు నీ ప్రతాపవాక్య । సరణికెంతొ మెచ్చితిన్
బాలురంచు నెంచి మిమ్ము । బట్టనైతి సంశయం
బేల నిల్వుడింక మిమ్ము । దేశుణాన మ్రింగెదన్.

రాము—

ఉత్సాహసుగంధి. వ్రేలిరీ ! యిటేలకూతు । వే, భయంబులేదటే
బాలురన్న సంశయంబు । బాసిరమ్ము మీదికిన్
జాలమేల నిన్నుఁబట్టి । సంహరింతు నిప్పుడే
వ్రేలబోక నిల్వుమల్లె । వీడుచుంటి బాణముల్.
(అని బాణము విడుచుచున్నాఁడు)

తాట—(గుండెలలో గ్రుచ్చుకొనిన బాణమును బట్టుకొని బాధ నభిన యించుచు) మా-రీ-చా (అని క్రిందఁబడి ప్రాణములువిడుచును.)

విశ్వా—లోకరక్షకా ! లోకానందమే నీ కానందమయమగుఁగాక. నిమిషములో తాటకిని సంహరించితివి. చాలసంతోషము. రండుపోవుదము. (నిష్క్రమింతురు )



విశ్వామిత్రుని యాశ్రమము.

[రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాడు.]

విశ్వా—రామలక్ష్మణులారా ! ఇదే నాయాశ్రమంబునకు వచ్చితిమి. రామా ! నీ వొనర్చిన మహాకార్యమునకే చతుర్దశభువనంబులును సంతోషాంబుధిఁ దేలి యాడుచున్నవి. నా హృదయానందమును వెలిబుచ్చజాలకున్నాను. నా చెంతనున్న యస్త్రశస్త్రంబులన్నియు నీ కిచ్చుచుంటిఁ గైకొనుము. ఈ యస్త్రశస్త్రంబులవలన సురాసురగంధర్వయక్షరాక్షసకిన్నరకింపురుషాదులం గెలువవచ్చును. ఇందుఁ గొన్ని దివ్యభాస్వరదేహంబులు. కొన్ని మూర్తిమంతంబులు. కొన్ని శుభప్రదంబులు.

కొన్ని యంగారసదృశంబులు. కొన్ని ధూమసదృశంబులు. కొన్ని చంద్రార్కసదృశంబులు. వీనివలన నీకు మిక్కిలి మేల య్యెడి. సంతోషపూర్వకముగా నే నిచ్చుచుంటిని గైకొనుము. (అని యుపదేశముచేయుచున్నాడు)

రాము—ధన్యోస్మి. ధన్యోస్మి. స్వామీ! అనుగ్రహింపఁబడితిని.

విశ్వా—రామలక్ష్మణులారా! మీరిచట శస్త్రాస్త్రంబులతో మిక్కిలి జాగరూకతగా నుండుడు. నేను యాగదీక్షలో నుండెదను. రాక్షసులు కామరూపులు. యజ్ఞమును ధ్వంసమొనర్పుటకై వారనేక మాయలొనరింతురు. వారిఁ బరిమార్చి నాయాగము నిర్విఘ్నముగా నెఱవేర్చెడిభారము మీయదియే.

(సమక్రమించును.)

లక్ష్మ—అగ్రజా! అదిగో! సీతిహోత్రుఁడు జ్వాజ్వల్యమానుఁడై ప్రకాశించుచున్నాఁడు ఈ ధూమశిఖలఁగాంచియే రాక్షసులరుదెంతురు గాఁబోలును.

రాము—సోదరా! అగును ఆదుర్మార్గులు రక్తమాంసములు వేదికపై బడవేయకుండ నమ్మూలతో దిట్టముగ పంజరము నిర్మించెద. (అని బాణపంజరము గట్టుచున్నాఁడు)

[తెర లేచును.]

(బాణపంజరములోపల విశ్వామిత్రుని యజ్ఞముగాన్పించును.)

లక్ష్మ—అగ్రజా! అదిగో! రక్తమాంసములు బడుచున్నవి.

రాము—తమ్ముఁడా! చూచుచున్నాను. (అని బాణమును విడుచుచున్నాఁడు.

(రివ్వురివ్వుమను శబ్దముతో బాణము మారీచుని దరుముకొనిపోవును.)

రాము—సోదరా! చూచితివా! నాచే విడువంబడిన బాణము రాక్షసాధముని నెట్లు తరుముచున్నదియో?

లక్ష్మ—అగ్రజా! చూచుచుంటిని. ఇఁకను రక్తమాంసములు పడుచున్న వే. రాక్షసుల కింకను బుద్ధి రాలేనట్లున్నది.

రాము—రాక్షసుల కంత్యకాలమునందే బుద్ధివచ్చును. (అని యింకొక బాణమువిడుచును.)

(సుబాహుఁడు చచ్చి పడిపోవును.)

లక్ష్మ—అన్నా! చూడుము. చూడుము. ఈచచ్చినవాని పాటుజూచి వీని యనుచరులంద రెట్లు పారిపోవుచున్నారో! అన్నా! ఈ చచ్చినవాని పేరెయ్యదియో?

విశ్వా—(యాగసమాప్తి జేసికొని యీవలకువచ్చి) వీఁడా?—వీని పేరు సుబాహుఁడు. మారీచునే నీబాణము వెన్నంటినది.

(తెరలో కర్ణపుటభేదనమగు ధ్వని)

రాము—గురువరా! ఎక్కడిదీధ్వని?

విశ్వా—(ఆలోచించి) నీచే విడువంబడిన బాణమా మారీచుని గొంటుకొని పోయి పోయి యొకత్రోయధిలోఁ గూలఁద్రోసినది. అదియే యీధ్వని. రామలక్ష్మణులారా! నాయాగము నిర్విఘ్నముగా నెఱవేరినది. కుమారులారా!

తే. గీ. అరయ మిథిలాపురాధీశుఁ । డౌ జనకుఁడు
జన్న మొక్కటి గావింపు । చున్నవాఁడు
దానిఁ గాంచఁగ మునులెల్ల । ద్వరితగతిని
బోవుచుఁరుగాన మనమును । బోదమటకు.

ఆక్రితుసందర్భంబునఁ దనకుమారీమణియగు సీత వివాహముగూడ గావింపనున్నాఁడు. ఆతనిచెంత మిక్కిలి పురాతనమైన శివచాప మొకటున్నయది. దానిని సురగరుడోరగయక్షరాక్షస కిన్నరకింపురుషాదులైనను నెక్కుపెట్టలేరనుట యతిశయోక్తిగానప్పు డింక మానవమాత్రులమాట వచించు టెందులకు?

ఇప్పు డీక్రతుసందర్భంబున నావిల్లెక్కుపెట్టినవారి కాసీతనిచ్చి వివాహ మొనరింతునని వెల్లడిజేసియున్నాఁడు ఆకారణమున సమస్త దేశాధీశ్వరులునుఁ గూడ జనుదెంతురు. మనముగూడ వెడలుదము రండు.

రాము—చిత్తము. అట్లనే వెడలుదము.

(నిష్క్రమించి రెండవవైపునుండి మఱల బ్రవేశింతురు.)

రాము—గురువరా! ఇది యేప్రాంతము?

విశ్వా—రఘుకులతిలకా! ఇది గౌతముని యాశ్రమప్రాంతము. కొన్ని కారణాంతరములచే నాతనియాశ్రమ మిప్పుడు హిమ వన్నగమునకు మార్చుకొనెను. ఇక్కడకు మిథిలానగర మర్ధ యోజన దూరమునందున్నది. త్వరితగతి నడువుడు.

రాము—(నడచుచుండఁగా ఱాయి పాదములకు దగులును. అహల్య గామారిపోవును.)

అహ—(చేతులుజోడించి) 4 వ అనుబంధము.

పతితపావనా! ఎఱుంగక నే నొనర్చిన తప్పిదమునకు నా ప్రాణేశ్వరుఁడు నన్నీ ఱాయివై పొమ్మని ఘోరముగా శపించెను. నే నా మహానుభావుని శాపవిమోచనమునకై బ్రార్థింపఁగా—

మ. ఘనమౌ లోకములెల్ల బ్రోచుటకు సం। కల్పించి శ్రీనాధుఁడే
యినవంశోత్తముఁడైన పంక్తిరథ స్వ। న్వాధుపుత్రుండుగా
జనియించున్ రఘురాము నామమున నీ। శాపంబుఁబోగొట్టునం
చన నామూర్తివినీవె నీమహామహిమ సా। ధ్యంబా నెవర్ణింపఁగా.

సీ. నీరూపమేగదా? । నిఖిలలోకంబులు
నీదివ్యపల్కు ల। న్నియును శ్రుతులు
నీకన్నులేగదా? । నిక్కంబుగా సూర్య
చంద్రులై భాసిల్లు । జగములందు

నీహస్తములె దెసల్ । నీపదంబులె ధర
యరయ నీమస్తక । మాకసంబు
నీనిమేషము సము । న్మేషంబులేగదా
రాత్రింబవళులయి । గ్రాలుచుండు
నీయనుగ్రహంబె । నిజసుధాంభోరాశి
విశ్వమీవె యీవె । విశ్వమరయ
నిన్నుఁ బొగడ తరమె । నిన్నుఁగాంచ తరమె
మానిసికైన జ్ఞాని । కైనఁ గాని.

(అని నమస్కరించుచున్నది.)

రాము—(అహల్యను లేవనెత్తి) అహల్యా! నేటితో నీశాపము దీరి పోయినది. నీప్రాణేశ్వరుఁడు హిమవన్నగంబున దపం బొనరించుచున్నాఁడు. నీవచ్చోటునకుబోయి తొంటియట్ల సుఖంబుండుము.

అహ—లోకరక్షకా! మహాప్రసాదము. (నిష్క్రమించును.)

విశ్వా—రామలక్ష్మణులారా! మనముఁగూడ బోవుదము రండు.

(అందరు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.



## తృతీయరంగము.

మిథిలాపురము:—జనకుని కొలువుకూటము.

[జనకుఁడు, మంత్రి, కొందఱుమునులు, వివిధదేశాధీశులును నుచితాసనములపై నుండఁగాఁ దెర లేచును.]

జన—(అపవారించి మంత్రితో) అమాత్యశేఖరా!

మ. మునులున్ జ్ఞానులు, సర్వపూజ్యులును, సం। పూర్ణ ప్రమోదంబుతో.
మనుజాధీశ్వరులున్, బుధాళియును సం। బాధుల్, హితుల్, మిత్రులున్

గనవిచ్చేసి మదీయయాగము సా । కల్యంబుగాఁ జేసి యిం
దున నున్నారత వీరిమొల్ల నెనరిం । తుఁ బెండ్లి మాసీతకుఁ.

కావున మాసీతను వేవేగ నలంకరించి దోడ్కొని రావలసినదిగా
శీఘ్రమే పరిచారికచే నంతఃపురంబునకు వార్త బంపించుము.
తరువాత శివవిల్లు దెచ్చి యీసభారంగమున నుంచునట్లుభటుల
కాజ్ఞాపింపుము.

మంత్రి—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

జన—(లేచి)

మ తమరెల్లఁ జనుదెంచి యజ్ఞము సాం । తంబొప్పఁగాఁ జేయునా
కమితోత్సాహముగల్గె జానకి వివా । హంబిప్డు గావింతు జూ
చి, మహాత్ముల్ దమరెల్ల దంపతుల వా । శీర్వాదము ల్జేసి ప్రే
మముతో వారి కభీష్టసిద్ధులిడి సః । మన్నింపరే సద్దయః.

[భటులు శివవిల్లుఁగొనరా వెంట మంత్రి ప్రవేశించి]

మంత్రి—భటులారా! భద్రముగా నాశంకరచాపం బటనుంచి
మీరు పొండు. (భటులు నిష్క్రమింతురు)

మంత్రి—రాజేంద్రా! విల్లుదెప్పించితిని.

జన—మంచిది. (అని విల్లును సమీపించి సభాసదులకుఁ జూపు
చుండఁగా)

భటు—(శీఘ్రముగాఁ బ్రవేశించి) రాజచంద్రమా! దివ్య తేజంబున
వెలుంగొందు నిర్వురు రాజకుమారులను వెంటఁ బెట్టుకొని
విశ్వామిత్ర మహర్షులవారరుదెంచుచున్నారు.

జన—ఓరీ! వారిని శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

భటు—చిత్తము. (నిష్క్రమించును.)

[రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

జన—(ఎదురేగి నమస్కరించి) మునిసార్వభౌమా! ఈ యాసనం

బధిష్ఠింపుఁడు. (రామలక్ష్మణులతో) సుకుమారులారా! మీరా యాసనంబు లధిష్ఠింపుఁడు. (అందఱుఁ గూర్చుందురు.)

జన—(విశ్వామిత్రుని యర్ఘ్యపాద్యాదులతో బూజించి)

మ. మునినాథా! తమవంటిపూజ్యతములే । మోదంబుతో యజ్ఞముం
గనవిచ్చేయుట నాదుభాగ్యమని ప । ల్కన్ వచ్చు నీయజ్ఞ సం
జనితంబైన ఫలంబునక్కు తమ వె । న్టన్వచ్చి యున్నట్టి నం
దను లెవ్వారు? చరిత్రమేమి? వచియిం । పఁగ వేడెదన్ మిమ్ములన్.

విశ్వా—జనకరాజర్షి చంద్రమా! ఈసుకుమార సుందరాకారు లా యయోధ్యాపురాధినాథుఁడగు దశరథేశ్వరుని వంశోద్ధారకులు. ఆతని పట్టమహిషియగు కౌసల్యానందనుఁ డీరఘురాముఁడు; లోకత్రాణపరాయణుఁడు. ఈతఁడు సుమిత్రాసుతుండగు లక్ష్మణుఁడు. ఈతని యనుజుండగు శత్రుఘ్నుండును, కైకేయీనందనుండగు భరతుండును నయోధ్యయందే యున్నవారు. నాయాగవిధ్వంసం బొనరించుచున్న క్రూరరాక్షసుల సంహరించుటకై మహానుభావుల దెచ్చితిని. ఈ యుజేయుండును నావెంట వచ్చి—

మ. ఒకబాణంబునఁ దాటకిన్ దునిమె బా । హుస్ఫూర్తి జూపింపవే
ఱొక బాణాన సుబాహుకున్ గెడపె నిం । కొక్కమ్ముచే జగా
చక మారీచుని బారద్రోలె మఱియున్ । శాపంబహల్యాయహా
ల్యకు దప్పించినరామచంద్రుఁడితఁడ । య్యా! జూడవచ్చెన్ మిమున్.

తే. గీ. జనకరాజేంద్ర! నీకు య । జ్ఞమును గాంచి
నీదు గృహమున నున్నట్టి । నీలగళుని
గొప్ప చాపంబు నెక్కిడు । కోర్కెతోడ
నరగజనుదెంచె నవతార । పురుషుఁ డిటకు.

జన—ధన్యోస్మి! ధన్యోస్మి! అవతారపురుష సందర్శనభాగ్య మొద

పుటచే నాజన్మము ధన్యమైనది. నాకులము పావనమైనది. (సభాసదులతో) సభాసదులారా! ఇదియే శంకరునిచాపము. ఇయ్యది మామూలపురుషుండైన నిమి కాఱవతరమువాఁడగు దేవరాతుఁ డాశంకరునిచే నిల్లడముఁగాఁ బడసిన ధనువు. నాఁటినుండియు నిమ్మహాకార్ముకము మాచెంతనే యున్నది. నేను సీతాకళ్యాణము జాటించితినిగదా? నేను గ్రతువొనరించుటకై నాగటితో భూమి దున్నుచుండఁగా నానాగటిచాలునందున నీమె దొరకినది. ఆకారణంబున నీమెకు 'సీత' యని నామకరణముఁ జేసితిని. ఇప్పు డీ శివకార్ముక మెక్కిడిన బలశాలి కా మహీజాత నిచ్చి కళ్యాణం బొనరింతును. ఇష్టమున్నవారు బ్రయత్నింపవచ్చును. పరాజితులు పోరాటమునకు సిద్ధపడరాదు. (కూర్చుండును.)

[వెంటనే రాజమండలములో నుండి యిరువురు మువ్వు రాధనువు చెంతకరిగి, దానిని యెత్తఁజాలక విఫలమనోరథులై విన్న వదనంబులతో వచ్చి యథాప్రకారముగా గూర్చుందురు.]

విశ్వా—రామచంద్రా! నీవేటి కట్లుజూచెదవు? కేవలము మానవ మాత్రులగు వీ రాకార్ముకమును గన్నెత్తి యైనను జూడం గలరా? నీ వరిగి—

మ. జనకుం డచ్చెరువొందఁ మానులెలమిన్ । సంతోషము న్దూప యీ మనుజాధీశ్వరులెల్ల మ్రాన్పడఁగ రా।మా! నీవు బొమ్మింక నా ధనువుద్యద్గతి నెక్కువెట్ట నిపుడే। దద్ఘోరం ఘోషంబుగాఁ ఘనసిర్ఘాత నిపాతజాతి నినదో। గ్రధ్వానమై మ్రోవఁగన్.

రాము—(లేచి చేతులు జోడించి)

మ. అనఘా! మీ హితవాక్యముల్ వినిన నా। కత్యంతమైనట్టి శో భనముల్ జేకురుగాన మీ యనుమతిన్ । బాలింపఁగాఁబోదుఁగా

వున దీవించి యనుగ్రహించి నను సమ్మోదంబుతో బంపినఁ
ధనువుద్యద్గతి నెక్కు బెట్టెదను నా దర్పంబు జూపించెదఁ.
విశ్వా—కల్యాణసిద్ధిరస్తు. నాయనా! దిగ్విజయము గాంచుము.
[ఒకప్రక్కగా స్త్రీజనము ప్రవేశింతురు. సీత, ఊర్మిళ, మాళవి, శ్రుతకీర్తియను నల్వురు చెల్లెండ్రు జనకుని చెంత నిల్తురు.]
రాము—(ధనువు చెంత కరిగి ప్రదక్షిణ నమస్కారంబు లొనరించి)

తే. గీ భక్తజన పారిజాత! యో ప్రకాశ !!
ధనువు నెక్కిడఁబోవు నా దండ నిలిచి
జయము జేకూర్చుమయ్య యీశా! గిరీశ!!
నీలగళ! భర్గ! మహాదేవ! నిన్నుఁ గొలుతు.

(అని ధనువు నెత్తి నారి బిగింపఁబోవుచుండ ఫెళక్కున విఱిగిపోవును. దేవదుందుభులు మ్రోగును. పుష్పవృష్టి గురియును. సీత రాముని కంఠమున బూలహారము వేయును. రాజులు వెడలుదురు.)
ముని—(స్తవము చేయుదురు.)

5 వ. అనుబంధము.

జన—(సంతోషముతో) సచివోత్తమా! ఈ శ్రీరామచంద్రుని బల శౌర్యంబు లగ్గడించుచు దశరథమహారాజు గారికి శుభ లేఖ వ్రాయుము. అందు భూమిజను శ్రీరామచంద్రునకును- నా కన్నకుమారియగు నూర్మిళను లక్ష్మణునకును, కైకేయీ పుత్రుండగు భరతునకు మత్సహోదరుండగు కుశధ్వజుని పుత్రికయగు మాండవిని, సుమిత్రాదేవి ద్వితీయ పుత్రుండగు శత్రుఘ్నునకు, నాసోదరుని ద్వితీయపుత్రిక యగు శ్రుతకీర్తిని నిచ్చి చైత్రశుద్ధ నవమీ భానువాసరంబున బగలు బదునాలు గు ఘడియలమీద పూర్వ ఫల్గునీనక్షత్రయుక్త మిధునలగ్న మున శ్రీరామ వివాహంబును, తరువాత శుభముహూర్తం

బున దక్షిణ వివాహంబులును జరుపుటకు పెద్దలు నిశ్చయిం చినారు గాన నేతచ్ఛుభముహూర్తమునకుఁ దమరు మిత్రా మాత్య పరివార బంధుసహితంబుగా మిధిలాపురంబునకు విచ్చేసి పరిణయాదికక్రియలు నెఱపి నన్నానందింపఁజేయఁ గోరుచున్నాను. అని వ్రాసి వెంటనే యాశుభలేఖ నయోధ్యా పురికి బంపించుము.

మంత్రి—దేవా! తమయాజ్ఞాప్రకార మట్లనే గావించెదను.

జన—ఋషిచంద్రులారా! తమరెల్లరును గల్యాణమంటపమునకుఁ జనుదెంచి వధూవరుల నాశీర్వదించి వెడలగలందులకుఁ గోరు చున్నాను.

ఋషులు—అవశ్య మట్లనే యొనరింతుము.

(అందఱును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

తృ తీ య రం గ ము.

స్థలము:—బాటసుధ్య.

[వసిష్ఠ, విశ్వామిత్ర, దశరథ, సీత, రామ, లక్ష్మణు లుండఁగా తెర లేచును.]

దశ—గాధినందనా! నీయనుగ్రహకటాక్షవీక్షణముల నే నెంత యో యానందించుచున్నాఁడ.

తే. గీ. వాఁడు తమవెంట బిడ్డల ( నంపువాఁడ
యెట్టికష్టము వచ్చునో ( యేమొ? యనుచు
మిగుల బెగడొందితిని గాని ( మేటి శుభము
లిట్లొదవునని కలనైన ( నెఱుఁగనైతి.

నాఁడు రామలక్ష్మణులను మీ వెంట బంపించుట కించుక సంశయించి
నందులకు నన్ను మన్నింపుఁడు.

[తెరలో]

ఉ. తాటకి జంపితిన్ బ్రబల । దర్పముఁజూపి సుబాహుకున్ వడిన్
గీటడగించితిన్ మిగుల । కీర్తిగడించి తహల్యశాప ము
చ్చాటనజేసి ప్రీతదగు । శంకరుచాపము రెండుఁజేసి య
ప్పాటున సీతఁ గొంటినని । ప్రజ్ఞలు బల్కెడి రాముఁ డేడకో.

దశ—వసిష్ఠసంయమీంద్రా! కౌశికఋషివరా! కాపాడుడు. కా
పాడుడు.

మ. ప్రళయాదిత్య విధంబుగాఁ దలప నీ । బ్రహ్మాండభాండంబహో
తలక్రిందుల్ దగఁజేయువాని గతి రౌద్రస్ఫూర్తి జూపించుచున్
విలయజ్వాల విశాలకీలి కరణిన్ । భీభత్స రూపంబుతో
బొలియింపన్ మము, వచ్చెడిన్ బరశురాముండింక గాపాడరే.

పరశు—(ప్రవేశించి క్రోధముతో నిటునటుఁ జూచి) ఓ వసిష్ఠా!

ఉ. కూరిమితోడ నాజనని । కోరినయట్టుల భూధవాళినే
నారసి యిర్వదొక్క పరిమాయములన్ వధియించి వేయపో
గా, రహినాదు పేరువిని । గాజులు దాల్చిన పేనిపుత్రుఁడే
నా రఘురాముడంట? సరి । యాతని కింతటివాఁడు పుట్టెనే?

(రఘురామునివైపు దిరిగి) ఓరీ బాలకా!

సీ. ఆఁడుదానిని జంపు । టదియొక్క ఘనముగాఁ
దలపోసి మదిలోనఁ । గులుకకింక
దుర్బలుఁడై నట్టి । దుష్టరాక్షస కీట
కమును జంపితినని । గర్వపడకు
శాపవిమోచన । సాధనం బటులుండె
నది నీదు మహిమయే । యని తలఁపకు

ప్రీతదై యొకమూలఁ । బడి తుప్పుఁబట్టిన
విల్లు విఱచుట దిగ్విజయ మనకు
సాహసంబున్న బలమున్న । శౌర్యమున్న
పరశురాముండ నైన నా । పైకి రార!
కీర్తిగ్రాకోర — లేకున్నఁ । గేలు మొగిచి
పాదములుబట్టి వేడు నీ । బాబుపగిది.

దశ—(పరశురామునిఁ బ్రతిమలాడుచు) మహానుభావా! మిమ్ము దాఁకుట కీపసివాఁ డెంతటివాఁడు. దేవా! అనుగ్రహింపుఁ డనుగ్రహింపుడు.

సీ. జమదగ్ని సుతుఁడవు । స్వాధ్యాయ వేత్తవు
బాహుబలస్ఫూర్తి । భాసురుఁడవు
సవనకాలమునఁ గ । శ్యపమహీసురులకు
భూదాన మిడినట్టి । పుణ్యమతివి
క్షత్రియహింసను । జాలింపుడను వింధ్రి
నభిమత మీడేర్చి । నట్టి ఘనుఁడ
వత్యంతనియతి శో । నడవి లో మునివృత్తి
నరగదాల్చిన మేటి । శాంతనిధివి

మిగుల పసిబాలుఁ డీరాము । మీఁద మీర
లలుగ గాఁ నీమె దయజూడ । వలయునయ్య
పృథ్వి నిక్ష్వాకుకుల ముద్ధరింపుఁ డయ్య
భవ్యగుణధామ భృగురామ । పరశురామ.

రేణుకాత్మజా! దయఁజూడుము. (శ్రీ) రాముఁడు పెండ్లికుమారుఁడై యున్నవాఁడు. అట్టివానిపై మీ రాగ్రహింపఁదగునా? నాకు బుత్రదానమిండు.

పరశు—దశరథా ! ప్రత్యక్షముగా నా కపకారం బొనరించినను నేను క్షత్రియులజోలికి బోనని మహేంద్రముని చెంత శపథ మొన ర్చితిని. నేను నాశపథమునకు విరుద్ధముగా నడువఁదలంచుకొొన లేదు గాని- నా గురువరేణ్యుండగు శంకర భగవానున కవమా నము గూర్చిన వానిని నే నెల్లు విడువఁగలను. నా గురుద్రో హిని నేను మట్టుబెట్టక మానను.

రాము—అయ్యా ! జమదగ్నిసుతా !

తే. గీ. ముని సుతుఁడవు, తపోనిధి। వనఘుఁడవగు
కతమునను నీకు నిదె నమ।స్కారమయ్య !
వృద్ధుఁడవు నీవు- అదిగాక। విప్రవరుఁడ
వెందు కీపోరు తపమున।కే సనుమ్య.

పరశు—రామా ! పరుగిడలేక నేదియో యనినట్లు నాతో దురము నరింపలేక యీ నెపంబునఁ దప్పింపఁ జూచుకొనుచుంటివా ? నిన్నింత మాత్రంబున విడచిపెట్టను. ఇదిగో ! నాచాపము. ఇయ్యది శ్రీమహావిష్ణువుది. ఆయన నాతండ్రియగు జమదగ్ని కొసంగె. నాజనకుఁడు నాకొసంగె. ఈ కార్ముకమును నీవు విఱిచిన శివవిల్లునుఁగూడ విశ్వకర్మ నిర్మితములే. జనకుని చెంత నున్న విల్లు పనిలేక తుప్పుపట్టినది. అది విఱుచుటలో ఘనము లేదు. చేవదీఱియున్న నీ విష్ణుచాప మెక్కిడుము.

రాము—ఇటు తెమ్ము. (అని దానిని గైకొనునప్పుడు పరశు రామునిలో నుండి యొక దివ్యతేజము రామునిలో గలసిపోవును. పరశు రాముఁడు దుర్బలుఁడగును.)

రాము—(విల్లు నెక్కిడి బాణమును సంధించుచున్నాఁడు.)

పరశు—(రాముఁడు మానవమాత్రుఁడు గాడని గ్రహించి చేతులు మోడ్చి)

ఉ. ఈవు జగత్త్రయంబును నేలెడి కర్తవు, సర్వదేవతా
దేవుఁడవైన శ్రీహరివి తెల్లము నీవిజయాంక నాదిమే
యీవును నేను నొక్కటిమె యెంచగను భేదములేదు దేవతా
దేవుని చిత్రలీలలివి తీవ్రశరంబున విప్రు నేతువే.

రాము—అయ్యా! నీవు బ్రాహ్మణుఁడవు ఈ బాణంబున నిన్నేయ రాదంటివి. ఎక్కుబెట్టిన బాణ మూరక విడువరాదు. నన్నిప్పు డేమి చేయమందువు?

పరశు—శ్రీరామభద్రా! ధరిత్రీమండలంబెల్ల గశ్యపునకు నేను దానంబిచ్చిన పిమ్మటరాత్రి డీభూమిపై నిలువవలదని నాకు శాసించెను అందుచే నే నియ్యెడ నిలువరాదు. నాతపోబలంబు నీవు గైకొంటివి. నేను మహేంద్రాద్రికి బోయెదను. నీ బాణ మూరక విడవకున్నచో దానిచే నా పుణ్యలోకంబునకుఁ బంపి నన్ననుగ్రహింపుము.

రాము—చిత్తము (అని బాణమును విడుచును. పరశురాముడు నిష్క్రమించును)

(సంతోష ముతో నందఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.






# సంపూర్ణ రామాయణము.



## ద్వితీయాంకము.



### పట్టభంగ రాఘవము.

మిశ్రవిష్కంభకము:—అయోధ్యానగరవీధి.

[మంథర ప్రవేశించి యిటునటుఁ జూచిజూచి.]

6 వ అనుబంధము.

మంథ—నాకేమియు నర్థముగాకుండ నున్నయది. ఈభజనలేమి? ఈ యుత్సవములేమి? ఈఘుమఘుములేమి? ఈదడదడలేమి? ఈయట్టహాసమేమి? దీనికేదియో యొకవిశేషకారణముండియుండును. (ముందునకుఁజూచి) అదిగో! భద్రుఁడు వచ్చుచున్నాఁడు. ఈ యుత్సవము లొనర్చుట కేమికారణమో వీని నడిగి తెలిసికొందుఁగాక.

[అప్పుడు భద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భద్ర—(సంతోషముతో)

మ. ధరణీభారమడంచి దుష్టజనులన్ । దైత్యాళులన్ ద్రుంచి స
త్వరమే శిష్టులఁ బ్రోచి ధర్మమును సం । స్థాపింపఁగా నెంచి శ్రీ
హరియే మానవజన్మమెత్తి యిపుడా । హా రాముఁడన్ బేర భూ
వరుఁడౌనంట యికేమిగావలయు మా । భాగ్యంబు సామాన్యమే.

ఓహోహాహో ! తెల్లవారినచో బట్టాభిషేకమహోత్సవము నిర్వర్తింపఁబడును. దశరథేశ్వరుని కాలముననే యెట్టికష్టంబులును యెఱుంగని మీ మాయవతార పురుషుని పరిపాలనలో ఇంకను నెట్టి సౌఖ్యము లనుభవింతుమో వర్ణించుకొనుటకైన నవకాశము లేకుండనుండెను. పట్టాభిషేకమహోత్సవమును జూచుటకై జనసం బుత్సహించుచున్నది అంతుల కెట్టియేర్పాటులు గావించిరో తెల్పెదననిన కుశీలవుం డింకను రాలేదేమి చెపుమా? (అని యిటునటు జూచి) అదిగో! మంథర! కైకమ్మగారిచేటి. ఒరుల యానందమునుజూచి యోర్వలేనిముండ. ఇదియనవరతమును "ఎవరికొంపదీయుదు" నను నష్టాక్షరీమంత్రజపంబొనరించుచునే యుండును. దీనినిజూచినవారెల్ల పిశాచమును జూచినట్లు భయపడుచునేయుందురు

సీ. ఎదురుగావచ్చెనా? । యెపుడుబోయిన నష్ట
కానున్న పని గంగ । గలసిపోవు
మాటాడఁజూచెనా? । మరుసిమేమమునందె
యెదుటవానిని బుద్ధి । హీనుఁ జేయు
మదిలోనఁ దలఁచెనా? । కుదురైన సంసార
మిట్టెనేర్పనఁ జెడ । గొట్టివైచు
కనువిప్పిచూచెనా? । కల్పభూరుహమైన
నేలమట్టంబగు । కూలిపోవు
ఒరుల సుఖసంపదలుజూచి । యోర్వలేదు
వీరికిని వారికిని తంపి । పెట్టుచుండు
యెట్టికార్యంబునైనను । సిట్టెజెరచు
జగతిఁ బనిచెరుపుల దొర । సాని యిదియె.

ఈపని చెరుపులదొరసాని నాకెన్నరైన దేమిచెపుమా?

మంథ—(సమీపించి) నాయనా! భద్రా! ఈగడబిడలన్నియు నెం దులకో యెఱుంగుదువా? ఈయుత్సవము లెందులకో నీకేమైనఁ దెలియునా?

భద్రు—ఇంక నేమి? నీదృష్టి దీనిమీదఁ గూడ బడినదా? దీనికేదియో యొకఫలితము రేపు తప్పకగాన్పించునుగాఁబోలు

మంథ—అట్లందు వేమినాయనా! నేనంతచూపోపనిదాననా? పట్టణ మెందులకు శృంగారించుచుండిరో యెఱింగినచో చెప్పరాదా?

భద్రు—అంతఃపురదాసివగు నీకు తెలియునే తెలియదా?

మంథ—నాకేమియు దెలియదు.

భద్రు—రేపుదయమున శ్రీరామచంద్రునకు అయోధ్యాపురి పట్టము గట్టుదురు

మంథ—నాయనా! ముసలిముండతో వేళాకూళము లెందుకు? సత్య ముచెప్పరాదా?

భద్ర—సత్యమే చెప్పితిని. రాముఁడు పట్టాభిషిక్తుఁడు కాదగఁడా? దశ రథమహారాజుగారు విశ్రామము దీసికొనఁ గూడదా?

మంథ—అదియంతయు సత్యమేగాని- ఇట్టి మహోత్సవసందర్భమున బంధుగులెల్లరును రాకున్నమానె- భరతశత్రుఘ్నులైనను తాతగారింటినుండి తిరిగిరావలదా? వారినైనను రావలసినదిగా వర్తమానమంపలేదుగదా? అట్టి పట్టాభిషేకమెట్లుచేయుదురు. దునమ్ముటకు నేనంత వెఱ్ఱిముండనా?

భద్ర—(తనలో) నీవు వెఱ్ఱిముండవుగాదు. నిన్నుఁ బుట్టించినవాఁడు వెఱ్ఱిముండకొడుకు. కాకున్న నిన్నుఁబోలు తలతిక్కముండ నెం దుకు సృష్టించును.

(ప్రకాశముగా) మంథరా! రేపటిమహార్తమును బోలు మహార్త ము దిరిగి వైదాఱువత్సరములవఱకును రాదట ఆకారణమున

రేపు పట్టాభిషేకమహోత్సవము నెఱపెదరు. వారువచ్చిన తరువాత మహోత్సవము లోఁగరింతురు.

[తెరలో] భద్రా!

భద్ర—(విని) ఆఁ. వచ్చుచున్నాను. (నిష్క్రమించును)

మంథ—(ఇటునటుఁజూచి) ఏమిది? నిజముగా రామునకే - పట్టాభిషేకమే- ఇంకేమైననున్నదియా? గూనిదాననని నన్నధిక్షేపించి నట్టులానాఁడా రాముఁడు బంతితో గొట్టిననాఁటినుండియు నా కాతనిపై మిక్కుటంబగు కోపముదయించుచున్నది. ఇప్పుడొక చక్కనియుక్తి బన్ని........యుక్తియా? ఏయుక్తిఁబన్నవలయును? (ఆలోచించి) ఆఁ, అగును. భరతుఁడు లేకుండఁ జూచిగదా యీపట్టాభిషేకము జరుగుచున్నది? దీని నాధారముగాఁగొని కైకకుఁ బురియెక్కించి...(సందేహముతో) ఊఁ. ఎక్కించి... చేయునదేమి? విఘ్నమూపాదింపఁగలనా? ఈపట్టాభిషేకము జూచి యోర్వఁగలనా?......ఎట్టులో కేకయరాజనందనచే యీ కార్యము సాధింపవలయును............

భళీ.. ...భళీ......యూ మంచిసమయము దొరకినది. తొల్లి శంబరునితో రణంబొనరించుచున్న కాలంబున మాకైక జేసిన యుక్తిప్రయుక్తులవలన నేగదా దశరథునకు జయముచేకూరినది. అప్పుడాతఁడు నీకిచ్చవచ్చిన వరంబులు రెండు కోరుకొమ్మనెనుగదా? నాకు గావలసినప్పుడు కోరుకొందునన్నది గదా? దాని నాధారముగాఁ గొని రామునిభరతము బట్టెద గాక!

(అని యుత్సాహముతో నిష్క్రమించెను.)

ఇది మిశ్రవిష్కంభము.



## ప్రథమ రంగము.

స్థలము:—కైకమందిరము.

[కైకయు, మంథరయు గూర్చుండఁగాఁ దెరలేచును.]

కైక—మంథరా! 7. వ అనుబంధము.

చ భరతునికంటె నాయెడల ♦ భక్తినిజూపును రాముఁ డేరునన్
భరతునికంటె రామునెడ ♦ బాయనిప్రేమను నిల్పియుంటి వా
రిరువురు నాకు నొక్కటియ ♦ యెందును భేదములేదు పాపమే
మెఱుఁగని రామచంద్రునకు ♦ నెట్లపకారము నెన్నర్తు మంథరా!

రాముఁడేనాఁడును నాకపకారము దలపెట్టఁడు. నాకేకా దేప్రాణి
కోటినిఁగూడ బాధించుట కంగీకరింపడు. ఆతఁ డవతారపురు
షుండని మునిజనంబులెల్ల స్తుతియించుచుండుట నీవు గూడ
వినియేయుందువు. అట్టి లోకత్రాణపరాయణుండగు రాముఁ
డు రాజగుచున్నప్పుడు మనయట్టివారము విచారించుట తగదు.
నామాటవినుము. వానిపై నలుగకుము

మంథ—మీా రామునిపై నాకేమి యలుకమ్మా! రాముఁడు మంచి
వాఁడుకాడని నేనంటినా? రాముఁ డవతారపురుషుఁడు
కాడని యంటినా? కాల మొక్కరీతిగా నడుచునని నేనంటినా?
రాజమాతకు సవతి మాత్సర్యముప్పు డుదయింపకూడదంటినా?
నీవు నీ కుమారునితో- రాజమాతతో- సీతాదేవితో- పాదము
లొత్తవలసిన దుస్థితి రాదంటినా?- కట్టకడపట నీవు నీసుతుని
తో వారికి దాస్యమొనర్చుచు.........వారియెంగిలి దినుచు...
ఛి...ఛీ...నా కెందు కీగోడవ......నీచిత్తము. ఎవ్వరైనను
మంచిమార్గ ముపదేశింపగలరుగాని- పట్టుబట్టి వారి నా మార్గ
ములోఁ బ్రవేశపెట్టగలరా? ఎవరికర్మ సూత్రమున కెవరు

కర్తలు. తొత్తుక్రిందపడి తొత్తనునట్లు నీవే దాసివి గాఁబోవు చుండ- నీకింకను దాసీజనమెందులకు ? వైభవములెందుకు ? నేను బోయెదను. (నిష్క్రమింపఁబోవును.)

కైక—(ఆపి) మంథరా ! కోపమువచ్చినదా ? కోపగించుకొనకుము. నీవిటఁ గూర్చుండి నేనట్లు దాసిని గావలసివచ్చునో యించు కుపదేశింపుము.

మంథ—(కూర్చుండకయే) రాజమాతననుగర్వము కౌసల్యకును- పట్టపుదేవి నైతిననుగర్వము భూజాతకును నుద్భవింపకపోదు. రాముఁడెంత సుగుణాభిరాముఁడైనను భార్యాదాసుఁడు గాక పోఁడు. అప్పుడు నీవు పినతల్లి వను మాట యాతనికి జ్ఞాపక ముండునా? అప్పుడు సవతి మత్సరము కౌసల్యకు- అధికార బలము సీతకు గలుగకుండునా ? పిల్లలపిడుగువోలె యాపదలు నిన్ను చుట్టుముట్టుకొనకపోవునా ! మీభరతుఁడు రామునకు- నీవు సీతకును నూడిగ మొనరింపక తప్పునా ? ఈ కన్నులకీ తిప్పలు దూరము గాకుండనున్నచో నామువ్చటయుఁ జూతు ను. మంథరమాటలు వినకపోయితినిగదా యని నీవేడ్చుటయు విందును. నాకు సెలవిమ్ము

కైక—మంథరా! నీవాక్యార్థము లిప్పుడు నాకు స్ఫురించినది అట్లు యిన నీవు జెప్పిన ట్లావరములు రెండును గోరకతప్పదందువా?

మంథ—తప్పదు. ముసలివాని మెడలు విరచి- కన్నీటిచుక్కలు జూపించి- వగచి- నీకు చేతనైనన్ని విధముల నాతని మానసరాజీవము గలంచి- యాతనికి వెట్టినెత్తించి- నీవరములు జెప్పి- వానినిఁ బొందుము. (చూచి) అదిగో! నీమగఁడు వచ్చుచున్నాఁడు. విశేషించి చెప్పుటకు వీలులేదు. నీవు కోపగృహమున కరిగి- ముసలివానిని బుట్టలోబెట్టి నీకోరిక లీడేర్చుకొనుము.

[ఇరుపురుషు నిష్క్రమింతురు. రెండవ వైపునుండి
దశరథుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దశ—(ఇటునటుఁజూచి) ఏమిది? నా జీవధన మేమైనది? ఈగృహ మిట్లంధకార బంధురమై యున్న దేమిచెప్పుమా? (ఇంచు కాలో చించి) ఎవరక్కడ? (అని పిల్చును. జవాబు లేదు) ఈమె వరుస జూడఁగా కోపగృహమున నున్నట్లున్నది. కాదేని యీమె యేమయి యుండును? (అని కోపగృహమును సమీపింపఁ బోవును. తెరలేచును. కైక మలినాంబరధారిణియై క్రిందఁ బరుండి కనఁబడును. దశరథుఁడు బిగ్గర చెంతకరిగి) కైకా! కైకా!

సీ. హంసతూలికతల్ప । మందు బరుండక
బండరానేల బ । రుండ నేల?
కనకాంబరము లీవు । గట్టక యీరీతి
మలినాంబరము దాల్చి । మరుగ నేల?
జాళువాభూషలఁ । జానరో! దిగవాడి
హేయరూపము దాల్చి । యేడ్చుటేల?
తపనీయగాత్రిరో! । నెపమేమి లేకుండఁ
పలుకక నీవిట్లు । లలుఁగ నేల?
నవతు లేమియనిరో? । చౌకఁజేసిరో భటుల్
దెలుపవేమి? యయ్యొ । పలుకవేమి?
యేలకోపమొదవె? । యెట్టులనదిపోవు?
తెలిపి ముదముఁగూర్పు । లలన నాకు.

కేకయరాజనందనా! నావలన నేమైన నేరంబున్నదియా? అయినను సరియే; సంశయింపక తెలుపుము. నాతప్పు నేను దిద్దు కొందును. నావలనఁ గాక పైవారివలన నీవు పరిభవింపఁ బడి

తివా? అట్టివా రెవ్వరో తెల్పుము. తత్క్షణము నీకన్నుల
యెదుట వారిని శిక్షించెదను. ప్రసన్నవుగమ్ము.

కైక—(దశరథుని ద్రోసివేసి)

మ. పనియేమున్నది యిచ్చువచ్చితివి? నీ । ప్రాణంబు కౌసల్య; యా
వనితారత్నము చెంతఁజేరి యిటులన్ । బ్రార్థింపు మింకీవిటుల్
ననువేడన్ దగదీవు నుట్టకు నుమో । నా సౌఖ్యముల్గాలెనో
జననాథాగ్రణి! పైమెఱుంగుసతికిన్ । సంతోషము న్గూర్చునే.

దశ—జీవితేశ్వరీ! ఇదియా నీయలుకకుఁ గలకారణము.

తే. గీ. పేరునకుమాత్రమే యామె । పెద్దభార్య
నీకు జరిపిన ముచ్చటల్ । నెఱపినాన
యామె కొక్కనాఁడైన నీ । వనఁగఁదలఁచి
యంటివేగాని సత్యమా । వరయలేవె?

కైక—ఈ వాక్యముల కేమిలెండు

దశ—పోనిమ్ము. ఇదివఱకు గతించిన విషయంబు లటుంచుము. ఇప్పు
డు పరీక్షింపరాదా?

కైక—పరీక్షల కేమిలోపము?

దశ—అట్లుగాదు. నీయభీష్ట మేదియో విశదీకరింపుము.

కైక—(కొంచెము సంతోషము జూపుచు) నాయభిమత మీడేర్చె
దరా?

దశ—త్రికరణశుద్ధిగా దీర్చెదను.

కైక—మాట దప్పరుగదా?

దశ—మాటయా? తప్పుటయా? అట్టి దెన్నఁడును లేదు.

కైక—ఏదీ శపథ మొనర్పుఁడు.

దశ—ఇంతమాత్రమునకే శపద మొనర్పవలయునా? కానిమ్ము. నీ
కోర్కె యేల గాదనవలెను.

ఉ. భానుఁడు చంద్రుఁడున్ గతులు। బాసి చరించిన లోకమాన్యలా
సూనులు నన్నువీడినను। సూరిబుధావళులెల్ల దూరినన్
మానుగ రాజ్యలక్ష్మి విడ। నాడిననున్ బెలు వానిజేరినన్
సూనృతవాక్య మెన్నఁడును। సుందరి తప్పను తప్ప నన్నడున్.
ఇప్పటితోనైన నా యెడల నీకు నమ్మకము గుదిరినదా? ఏదీ! నీయభి
మతమేమియో యిప్పుడెఱింగింపుము.

కైక—(లేచికూర్చుండి) సంతోషము (తనలో) క్షేమప్రియత్న మగ
త్యము లేకుండఁగనే కార్యసానుకూలమైనది. అదృష్టవంతురాలనై
డవలయును. (ప్రకాశముగా) నాథా! మున్ను శంబరునితో
రణం బొనరించుతఱి మీకు నేనొనర్చిన సహాయమునకు కలరి
రెండువరంబు లొసంగితిరి. అవి నాయిచ్చవచ్చినప్పుడు గోరు
కొందునని నేనంటిని. జ్ఞాపకమున్నదా?

దశ—ఉన్నది.

కైక—ఆవరద్వయం బిప్పుడు గోరుకొందును.

దశ—సరియే. నీయిచ్చవచ్చిన వరంబులు గోరుకొమ్ము. ఒసంగెదను.

కైక—సావధానచిత్తులరై వినుండు.

తే గీ ఈ యయోధ్యాపురంబున। కెలిమి భరతుఁ
బట్టభద్రునిగావింప। వలయు నొకటి
పదియు నాల్గేండ్లు రాముండు। వనములందు
ననఘ! మునివృత్తినుండ బో। వ్వనుట రెండు.

దశ—(విచారముతో) ఆఁ, ఆఁ, రాముఁడు-సుకుమారసుందరాకారుం
డగు రాముఁడు—యశోధనకాముఁడగు రాముఁడు—ప్రతాప
బలధాముండగు రాముఁడు—విసర్జితకాముండగు రాముఁడు—
భరతునికంటెను నిన్ను భక్తితో జూచెడి రాముఁడు—పితృవిధే
యుండగు రాముఁడు—కైకా!—అట్టి సుగుణాభిరాముఁడు—

యీ రేశబ్ధములు మునివృత్తిం గానలనుండవలయునా? కైకా!

కైకా !! ఇదేమివరమే?

కైక—నా కావరములే గావలయును.

దశ—కైకా! కొంచెమాలోచించవే. రాముఁడు సర్వజనసమ్మతుఁడే. అట్టివానిని సహస్రజన్మంబు లెత్తియైనను బడయలేమే. నీ కోరినయట్లు భరతునకే పట్టముఁగట్టెదనే రాముఁ డరణ్యావాసంబునకుఁ బోకుండఁ గాపాడవే.

కైక—నాసుతుఁడు రాజైనపిమ్మట నెవ్వరచ్చటనున్నను సరియేగాని రాముఁ డిచ్చటనే యున్నచో నానవతులును తక్కుంగల నీపుత్త్రులును వసిష్ఠాది మునులును ప్రజలను జేరి పెద్దకుమారుఁడవు నీవుండఁగా భరతుఁడు రాజ్య మేలఁగదని బోధించి బోధించి—

మ. భరతుం ద్రోసి యయోధ్య నేలుమనుచున్ ప్రార్థింతు రా రాముఁడీ
పురమందుండిన వాఁడు లేనియెడ నా పుత్త్రుండు మోదంబునన్
ధర యేలంగలఁ డంత్యనిష్ఠురము కన్నన్ మేలుగా నాది ని
ష్ఠురమే ధారుణి గాన రాముఁడిక పోవున్ వీడి బోగోరెదన్.

చెల్లినచో నా రెండువరములును జెల్లింపుమే తీరవలయును. లేదా? ఆ మాట నీవే దక్కించుకొనుఁడు.

దశ—(బ్రతిమాలుచు) కైకా! నన్నుఁ గాపాడుము. నామాటవినుము. నిన్నటి సభలో శ్రీరామపట్టాభిషేక మొనరింతునని పల్కితిని. ఇప్పు డరణ్యావాస మొనర్పఁ బొమ్మని గోరఁజాలను. నన్ను ననుగ్రహింపుము. ఇట్టివరము వేడకుము.

కైక—చెప్పితినిగాదా? నే గోరిన వరము లీయగలిగినచో నిండు. లేనిచో యసత్యవర్తనులని చిరస్థాయియగు నపకీర్తి గడించుకొనుఁడు. అంతియేగాని నాకీవరములు వలదని నేననను.

దశ—(శోకముతో)

మ త్తకోకిల.

ఓసి పాపి! మహాగ్నిభూతము! యోర్వలేకిటు రామునిన్
గాసిబెట్టదలంచితే ఘన కార్యమెంచెద నెంచితే
భాసురాంగి వటంబు నెంచి వివాహమాడితి నిన్ను నే
బ్రాసిముండవిధాన తుచ్ఛవరంబు గోరఁగ బాడియే.

కైక—ఇచ్చెదనని వరంబు లీయకున్నచో మీకుఁ జెల్లునుగాని, వెనుక మీరిచ్చెదనన్న వరములు నేనిప్పుడు గోరుకొంటదగదా? నాథా! మీరేటికి సత్యవర్తనులయ్యెదరు? నా వరంబులు నాకిండు.

దశ—హా! దైవమా! నాకిక నేమిగతి?

ఉ. పట్టినపట్టుపీడకయ భామపదింబది గోరుచుండె ని
ప్పట్టున సత్యమున్నిలిపి పంపుము రాముని కానకంచు, క
న్నట్టి కుమారునిన్ విడువఁ బ్రాణము లేగతిమేననుండు న
న్నిట్టి పరీక్ష సేయఁదగ నే? కరుణింపక పాపిదైవమా?

రామా! రామా!! నీ పట్టాభిషేకముహూర్త మీగతి పరిణమించినదా? రా—మా— యెట్లోర్తురా— రా—మా—

(అనిమూర్ఛిల్లును.)

కైక—(తెరవైపుజూచి) కనకలతా! నీవు కౌసల్యాంతఃపురమున కరిగి తండ్రిగారి యాజ్ఞయని దెల్పి మా రాముని దోడ్కొనిరమ్ము.

దశ—(మెల్లగా శిరమెత్తి) కైకా! ఏమందువు?

కైక—అనుటకేమున్నది వరములిమ్మందును.

దశ—నన్ను రక్షింపవా?

కైక—అసత్యవర్తనులయ్యెదరా?

దశ—హా! ఇఁక గతిలేదు. (మూర్ఛిల్లును.)

8 వ అనుబంధము.

రాము—(ప్రవేశించి) అమ్మా! నమస్కారము. జనకు లెచట ?

కైక—నాయనా! పుత్రు లనఁగ నెట్టివారు ?

రాము—మాతాపితృవిధేయులై యుండువారు.

కైక—మంచిది. నీతండ్రిగారు నాకు వెనుక రెండువరంబు లొసంగిరి. ఆవరంబు లిప్పుడు గోరితిని. భరతున కీ యయోధ్యాపురి పట్టము గట్టు టొకవరము. రెండవది పదునాలుగేండ్లు మునివృత్తి దాల్చి యరణ్యములలో నీవు కాలముగడుపుట. ఆ వరము లిచ్చితినని నీతో వచింపలేక సత్యవాక్పరిపాలకులైన నీతండ్రిగారు మూర్ఛిల్లియున్నా రదుగో! నాయనా! పితృవిధేయుఁడవు గమ్ము.

దశ—(లేచి) రామా!—రామా!—నీ కరణ్యము—హా! పోవలదు.

రాము—జనకా! ఇంతమాత్రమున కింతవిచార మేల ?

తే. గీ. నిత్య సత్యవ్రతుండవై । నెగడు నీవు
వరము లిడి యిప్డు కాదంట । వలనుగాదు
తల్లి కోరిన వరములు । చెల్లవలయు
నీవు సత్యవ్రతుండవై । నెగడవలయు.

అది దైవసమ్మతమైనమాట. కావున నా పోక ననుమతింపుడు. అమ్మా! కాననంబున కేగుటకై ప్రయాణమై వచ్చెదను. (అని నిష్క్రమించును)

తెర వ్రాలును.



ద్వితీయరంగము—కౌసల్యామందిరము.

[కౌసల్య పడియుండును. మునివేషమున రాముఁ డుండఁ దెర లేచును ]

రాము—అమ్మా! విచారించిన నేమిఫలము.

తే. గీ. వరము లడిగెను పినతల్లి । వరములీయ
సత్యసంధుండు నా తండ్రి । సమ్మతించె

నిట్టిమెడ కాన కేగ కే । నేమి సేతు
తండ్రి సత్యవ్రతము నిల్ప । దలఁపవలదె ?

అమ్మా! పదునాల్గేండ్లును బదునాల్గు క్షణికములట్లు ముగించివత్తు దను. నీ కోసముగూడ నా వెంట వచ్చెదననుటచే విధికి సమ్మతించితిని. తల్లీ ! ఆశీర్వదించి మమ్ము బంపుము.

కౌస—(రాముని కౌఁగిలించుకొని) నాయనా ! నాయనా ! నిర్భాగ్యురాలనగు నే నిపుడేమిచేయుదును ? మందదృష్టవంతురాలనగు నేను ని న్నెట్లాశీర్వదింపఁగలను ?

*శా. నాచేతం దొలుమేన నిష్ఠురగతిన్ । నానావిషాదోన్నమ
ద్వీచీకుస్తంభమైన పుత్రవిరహా । బ్ధిన్ దోర్విబద్ధారాం
ల్లీచందంబున నిప్పు డాఫలము నా । కీ పుట్టునం దప్పునే
వేచెన్ నేఁడు విధాత్రుఁ డేలబలుకున్ । వేయుం గురుకురోత్తమా!

లేకున్న నా యానాఁటి కోరిక లిట్లుడుగంటిపోవునా ? నా మనోరథంబిట్లు భగ్నమైపోవునా ? నా తండ్రీ ! ని న్నేమని కాన కంపుదునురా ?

9. అనుబంధము.

తండ్రీ ! నన్ను విడచిపోయెదవా ?

రాము—అమ్మా ! ఏటికిట్లు విచారించెదవు ?

తే. గీ. కాలకర్మవశంబునఁ । గలుగునట్టి
కష్టములు యిల్లుకట్టుక । కాపురంబు
జేయఁబోవమ్మ దుఃఖమ్ము । చెందకమ్మ
చీఁకటులవెన్క వెన్నెలల్ । సిద్ధమమ్మ !

కౌస—ఇంకేసుసుఖములు నాయనా ! నా పాడుమొగమున కింకా వైభవములేదు. పట్టాభిషేకమునకు ముందు నీ గురుండగు వసిష్ఠుండు దీవించి నుదుటఁగట్టిన యభిషేకపట్టముతో అరుంధతీ

దేవి మొదలగు మహాపతివ్రతలు దీవించి జల్లిన మంగళాక్ష తలతో లలితమంగళగీతారవములు దిక్కులుపిక్కటిల్ల నాకు నేత్రానందకరం బొనఁగూర్ప జనుదెంచి-నమస్కరించి-నన్నానందింపఁజేయుదువని తలంచుచుండ—కుమారా! ముని వేషమునవచ్చి యరణ్యంబులకు బోవుచుంటివి సెలవిమ్మని గోరుచుంటివా? అయ్యో!

తే. గీ. వినినయంతనె గుండియల్ । వ్రీలఁజేయు
పిడుగుఁబోలిన యీవార్త । వినినయంత
ప్రాణమే పోకయుండె నా । పాపమేమొ?
పాపజాతికి జావెట్లు । వచ్చుఁగట్టి!

లక్ష్మ—(రోషకషాయితాక్షుఁడై ప్రవేశించి) అన్నా!

*కం. జనకుఁడు నీతిజ్ఞుండై
పనిచిన పుత్రులకు నెన్ని । భంగులఁజేయం
జనుఁగాక తగవు దప్పిన
వినఁ నేటికి ధర్మమార్గ । విరళ విధంబుల్.

ముదుకండగుకతంబునను-మదనాతురుండగు కతంబునను నెన్నఁడో యిచ్చిన వరంబులు సత్యములగునా? సభారంగంబున వసిష్ఠాది సంయమీంద్రులయెదుట బల్కిన పల్కు లసత్యంబులగునా?

మ. మునులున్ సభ్యులు నెల్లవారు వినఁగా । మోదంబుతోఁ బల్కె నా
మనుజాధీశుఁడు రాజ్యమిత్తునని, యా । మాట ప్రకారంబుగా
జననో? రాజ్యము కైకకీదఁ జనో? । సంభావణఞ్జేసి యా
వెనుకన్ జేసెడి కార్యమేదో యదియే । నేజేసికొందం బిఁకన్.

భూపాలుం డధర్మవర్తనుండై ధరణీతలంబెల్ల కైకానందనునకీదలంచె
నేని—

తే గీ. కండకండలుగా మేను । జెండివైచి
కైక భరతుల ప్రాణముల్ । గంగఁగలిపి
రాజ్యరమ నీకు నొసఁగెద । రామచంద్ర
సరగ దీవించిపంపు సో । దరుని నన్ను.

రామ—(లక్ష్మణుని బట్టుకొని) సోదరా! ఏమి యీ దురాగ్రహము. దురాగ్రహాయత్తచిత్తుండగు వానికి యుక్తాయుక్తవివేచన ముండదుసుమా! తప్పు. తప్పు

మ. భరతుం డెవ్వనిగా దలంచితివి నా । ప్రాణంబులో బ్రాణ మా భరతుం డాతఁడయొ నీవు నంతె జుమి నా । పట్లన్ విచారింప; ఘో తరుణీరత్నము కైకఁజూడ మనకుం । దల్లేగదా? యట్టి సో దరునిం దల్లిని జంపఁజూచు టిదియే । ధర్మంబగుం సోదరా?

మన కులాచారగౌరవంబులును, నుత్తమశీలంబులును, విచారించి, నా చిత్తవృత్తి నెఱుంగక కిట్లసంగతముగా ని విష్వాడు పల్కినఁ బల్కితివిగాని యెన్నఁడిట్టియసంగతములాడకుము.

లక్ష్మ—అగ్రజా! తెలియక దుర్భాషలాడిన నీ యనుజుని క్షమించి నా కొక్క వరమిమ్ము

రాము—ఏ మది?

లక్ష్మ—ఇచ్చెదనని వాగ్దానమిచ్చినచో జెప్పెదను.

రాము—ధర్మవిరుద్ధముగానిపనియైనచో నట్లే యొసంగెదను.

లక్ష్మ—ధర్మవిరుద్ధముగాదు.

రాము—అట్లయిన నిచ్చెదను

లక్ష్మ—సంతోషము. సంతోషము. సత్యవాక్పరిపాలకా! అడవులకు మీ వెంట మా వదినగారు వచ్చుట కనుమతించినట్లే రెండవ యభ్యంతరము చెప్పకుండ నా రాకకుఁగూడ మీ రనుమతింపుడు

సుమి—(వడివడి ప్రవేశించి) నాయనా! లక్ష్మణా! నా గర్భమునం దుద్భవించినందుల కిప్పుడు నా కుమారుఁడ వనిపించుకొంటివి. నీవు తప్పక శ్రీరామునితోఁబా టరణ్యభూములకుఁ బోయి యాతని సేవకునిరీతిఁ బ్రవర్తింపుము.

తే. గీ. ధరణిజాతను తల్లిఁగాఁ । దలఁపుమన్న!
అన్నయగు రాముఁ దండ్రిఁగా । నెన్నుమన్న!
కూర్మితో వారి నెవ్వేళఁ । గొలువుమన్న!
ముదము గనుమన్న! శుభములు । బొందుమన్న!

కౌస—(విచారముతో) సోదరీ! సుమిత్రా! ఇదేమి పాప మమ్మా! రాముఁ డరణ్యములకు బోవుచున్నందులకే నేను గడుపుగిలి దుఃఖించుచుండ నీకుమారునిఁగూడ బంపించుచుంటివా? విధి లేక—(అర్థోక్తిలో)

సుమి—అక్కా! అట్లనకుము. సర్వజనపూజితుండగు శ్రీరాముఁడే యరణ్యములకుఁ బోవుచున్నప్పుఁ డిక లక్ష్మణుఁ డేపాటివాఁడు. వానిపోక కనుమతింపుము.

[తెరలో]

వాఁడేగాక. మన మందరమును బోవుదము

లక్ష్మ—అగ్రజా! అదిగో! వదినగారును కైకమ్మయు వెంట రా జనకు లిటే వచ్చుచున్నారు. అక్కటా! తండ్రిగా రెంతలో నెంతగా మారిపోయిరి.

కౌస—అయ్యో! ఏదియో ప్రళయము సంభవించున ట్లున్నది.

దశ—(తూలుచు తూలుచు కౌసల్య సమీపమున కరిగి) కౌసల్యా! కౌసల్యా!

సీ. నిర్దయాత్ముండనై । నీ కుమారుని కాన
పాలైసి నటువంటి । పాపుఁడనని

కులదీపమనఁ దగు । కొడుకంచు నెంచక
విడనాడుకొను నవి । వెఱ్ఱుఁడనని
కుటిలాత్మురాలు కైక । కొంగుబంగారంబె
నాకని మఱియు నజ్ఞానుఁడనని
కైకకై పాపిష్ఠి । కైకకై సుతు నెడ
బాటుకోర్చిన మంద । భాగ్యుఁడనని
కోపమును జూప కింక నో । కోమలాంగి
అస్త్రశస్త్రంబు లుడిగిన । యట్టివేళ
ప్రియమ భార్యయే దిక్కని । పల్కినటుల
వచ్చి యిప్పుడు నేను నీ । పాలఁబడితి.

కౌస—(విచారముతో దశరథునిఁ గూర్చుండఁబెట్టి) ప్రాణేశ్వరా! మన యదృష్టము లిట్లుండఁగా విచారించుటవలన నేమిలాభము?

కైక—రామా! ఇంకను నాలస్యం బెందులకు? నీవు నీయర్ధాంగిని గూడ వనవాసంబునకుఁ దోడ్కొని పోయెదనంటివఁట అందుచే నీమెయు గాషాయాంబరధారిణియై సిద్ధముగా నున్నది. త్వరితగతి ప్రయాణమును సాగింపుడు.

లక్ష్మ—(కోపముతో) ఆఁ, ఏమంటివి!

చ. అనుపమ ప్రేమఁ బెంచుకొను । నట్టి కుమారులు కాన కేగఁగా
దినములుబుచ్చు టె ట్లనుచు । దీరని దుఃఖము జెందియుంటచే
తను మఱి తల్లిదండ్రులకు । ధైర్యము జెప్పుచునున్న నమ్మిటుల్
వనముల కేగుడంచు బలవంతము చేయుదు గొడ్డురాలవే.

దశ—లక్ష్మణా! భరతు నీ యయోధ్యాపురమున నభిషిక్తుఁ జేయుటకును, రాముఁడు పదునాల్గేండ్లరణ్యావాసంబు జేయఁబోవుటకును నను నీదౌర్భాగ్యురాలి కోరికల కొడంబడితిని నాయనా! అట్లే కానిమ్ము. ఇదిగో!

*మ. తురగస్యందనమత్తసామజ భటశ్రేష్ఠంబులన్ మంత్రిల
వరకాంతాజనులం బురప్రజల సర్వస్వమ్ములం గొంచు "వే
గరఘూత్తంసముతోడఁ బోఁ బ్రదము యాశ్రిత కేయి మోదంబుతో"
భరతుం బట్టముగట్టి రిత్తయగు భూభాగంబు భోగింపఁగాన్.

లెమ్ము. శీఘ్రముగ లెమ్ము. నా యీ కోర్కె సుమంత్రునకు విశ
దీకరింపుము.

కైక—నాథా! మీకు నాపై నిట్టి యక్కసేల? మీరు వరములిచ్చి
తిరి. నాకు గావలసిన వరములు గోరుకొంటిని. నే గోరిన వర
ములు నాకిచ్చినచో నిండు. ఇష్టము లేకున్నచో మాని వేయుఁ
డు. సత్యవాగ్విభవులరని నేను మిమ్ము వరములఁ గోఁతిని
గాని- యిట్టివా రని తెలిసియుండెనేని నేను వెలితిబడుదునా?
మీకింత మనస్తాపము గలుగనిత్తునా? సత్యవాక్పరిపాలకు
లని యింతదనుక జగద్విఖ్యాతిబడసిన మీరింకమీద మృషా
వచనులరై మసియుండుఁడు. నాతోఁ డ్రవ నేను జూచుకొనెదను.

రాము—పిన్నీ! ఏటికిట్లు వేగిరపడియెదవు? తండ్రిగారి మనస్సేటికి
నొప్పించెదవు? నే నీ ధనకనకవస్తువాహనంబు లన్నియు దర
లించుకొనిపోయి యేమిచేసుకొందునని యనుకొనుచుంటివి?
నా కివియేమియు వలదు. కాషాయాంబరధరుండనై సీతా
లక్ష్మణులతో నడే విపినమార్గము లంటఁబోయెదను. అలస్య
మైనందులకు క్షమింపుము.

వసి—(ప్రవేశించి) దశరథరాజేంద్రా! గతించినదానికి విచారించుట
వలన లాభము లేదు. కన్నపుత్రులు కాన కేగుచుండిరని విచా
రింపకుము. ఈ రాముఁ డవతారపురుషుఁడు గాని కేవల మానవ
మాత్రుఁడు గాడని నీవ యెఱుంగుదువు. ఈతఁ డవతారమెత్తి
నది నీచెంతఁ గూర్చుండుటకుగాదు. క్రూరరాక్షసు లిప్పుడు

చెలరేగి మునిజనంబుల బాధించుచున్నారు వారిని సంహరించుటకే యా శ్రీహరి యీ యవతారమెత్తెను ఈతఁడు వనవాసంబున కేగకున్న నాకష్టములు మడియరు. ఇది యంతయు నాభగవంతుని సంకల్పము. లీలావినోదము. కావున విచారింపక యీ శ్రీరాముని పోక కనుమతింపుము సత్యవాక్పరిపాలకుండవు గమ్ము సంశయింపకుము.

కౌస—సంయమీంద్రా!

తే గీ చెలఁగి శ్రీరామ పట్టాభిషేకమునకుఁ
దమరు పెట్టిన నీ ముహూర్తంపు బలిమి
యెట్టిదో గాని- కానల కేగుచుండె
కన్నపుత్రుండు, మమ్ము దుఃఖాబ్ధిముంచి.

వసి—అమ్మా! కౌసల్యా! లోకకంటకులైన రావణవిరాధాది రాక్షసులం బరిమార్చి లోకంబులెల్ల నిష్కంటకముగా నొనర్చిన పిదప నీయయోధ్య కభిషిక్తుఁడు కావలయును గాని యూరక పట్టాభిషిక్తుఁడగుటవలన లాభము లేదు. ఇప్పుడు నే నుంచిన ముహూర్తంపు బలిమిచేతనే నీ యవతారపురుషుఁడు లోకకంటకులనెల్ల బరిమార్చి దిగ్విజయము గొనఁగలఁడు. విచారింపకుము.

దశ—సుమంత్రా! (వెక్కి వెక్కి యేడ్చుచు) కన్నకుమారు లరణ్యమునకుఁ బోవుదురు. రథము నాయత్తపరుపుము.

సుమ—చిత్తము. (అని నిష్క్రమించును.)

రాము—జననీజనకులారా! మాకనుమతియింము.

కౌస— 10 వ అనుబంధము.

దశ—నాయనా! మంచిది. నీసౌశీల్యము లే నిన్నుఁ గాపాడుఁగాక. (ఏడ్చుచు) కౌసల్యా! సుమిత్రా! మనవంశోద్ధారకుని గొంత

వజీరు సాగనంపుదమురండు.

వసి—మంచిది దయచేయుఁడు. (అందఱును నిష్క్రమింతురు.)



ద్వితీయరంగము.

దశరధుని శయనాగారము.

[దశరధుఁడు మంచముపైఁ బడియుండఁగాఁ దెర లేచును.]

దశ—(ఏడ్చుచు) 11 వ అనుబంధము.

సీ. రామ! సద్గుణధామ! । రఘురామ! నీతండ్రి
వెతలార్ప నెంచి రా । వేల తనయ!
నామీఁదఁ గోపమా? । నాతండ్రి దయరాదె?
ననుఁ బూర్ణమాతృభ_క్తి । గనఁగ రావె?
అయ్యయోపుత్ర! భా । ర్యాదాసుఁ డగువీని
దర్శింపరాదని । తలఁచినావె?
ధరణికే భారమా । దశరధు మోమింక
నీక్షింపరాదని । యెంచినావె?
తండ్రి యెంతదుర్మార్గవ । ర్తనుఁడునైన
సుతులు ద్వేషింపరాదను । సూ_క్తి వినవె
కొడుక, కొడుకా యటంచు నే । గోలవెట్ట
మోమునైన ననుజూపవే । ముద్దుపట్టి.

రామా!—రామా!!—నామాట వినవా? నన్నాదరింపవా? నాదుః ఖాగ్నిని జల్లార్పవా? నీప్రఫుల్లవదనమండలసందర్శనఁబీయవా? రావా? పుత్రగాత్రపరిష్వంగసౌఖ్యానందము వెండియు నాకుఁగలిగింపవా? రావా?—రావా?—రావా?—అమ్మా! జానకీ! నాయనా! లక్ష్మణా! ఆయవతారపురుషుని వెన్నంటిపోవుచు నాతనిసేవఁ జేసికొనుచున్న మీరే నిక్కముగా

ధన్యులు. నాకన్న తండ్రియెుా యింకఁ జూచెడిప్రాప్తి నాకు లేదు.

12 వ అనుబంధము.

లేదా?—నా-క-ట్టి-ప్రాప్త—ము-లేదా?—ఏల లేదు—(రాముఁడట్ట యెదుటనున్నట్లు భావించుచు) అదిగో! నాతండ్రిని కాననము నకుఁ దోడ్కొనిపోవుచున్న రథ మదిగో!—ఇంకను నాతండ్రి-నావంశోద్ధారకుఁడు- నాదృష్టిపథంబునుండి దాటిపో లేదు. (గుభీమని లేచి క్రిందికురికి) నేనుగూడ నాతని వెంటనే పోయెదఁ గాక

శా. రామా! నీదు వియోగవేదనకు నా । ప్రాణంబులే పోవునో యేమెూ చెప్పగజాల? నాకిచట ది । క్కెవ్వరున్నారు? శ్రీ రామా! యేనును నీదు వెంట వనికే । రానుంటిగానన్, బలో ద్భీమా! సారథితోడఁ జెప్పుము రథో । ద్వేగంబు తగ్గింపగాన్.

రా-మా రా-మా—(అని రెండడుగులువైచి గోడతగిలి పడిపోవును)

[వడివడిగా కౌసల్యాసుమిత్రలు ప్రవేశింతురు]

కౌస—నాథా! నాథా!! ఏమిది? ఇట్లేలపడిపోయితిరి (అని లేవదీసి మంచముపైఁ గూర్చుండబెట్టుదురు.)

సుమి—నాథా! మనప్రాప్తి కేమిచేయుదుము? దుఃఖించిన నేమి ప్రయోజనము?

దశ—కౌసల్యా! ఏమే యింకను నట్లుజూచెదవు? (రామునిరథమున్న ట్లు జూపుచు)

*చ. అదె రఘువీరుఁడున్నరథ । మల్లదె పోయెడిరాము తేరు పొ మ్మదె యదె పోయె నయ్యెంద । మక్కడఁదోఁచెఁ దదీయభూరజం బదియునడంగెఁ బొమ్మకట!। హా! గుణరత్నము! హా! కుమార! హా సదమలకీర్తిహార! నృప । సత్తమ! హా! ననుఁగూడ నీగదే.

హా! కుమారా! కుమారా!—(అని పడిపోవును)

చ. జనకుఁడు బిల్చుచు న్నడిగను ౹ సాహసవృత్తిఁ బోయినావె- ఆ
వనములఁ జేరినావె- వల ౹ వంతల తండ్రిని ముంచినావె- ఓ
తనయ! కుమార! పుత్ర!!! యని ౹ దైన్యముతో నిటులేడ్చుచుండ నా
ముని యిడినట్టి శాపమిక ౹ పూర్ణముగా ఫలియింపఁ జేసితే.

కౌస—మనోహరా! అడలకుఁడు విచారించిన నేమి ప్రయోజనము.

ఆ. వె. కర్మదేవత మన ౹ కైకేయిరూపాన
నిడుములిట్లుఁ గూర్చి ౹ విడచెనుగల
దాని ఫలము మనము ౹ తరువాయి లేకుండ
ననుభవింపవలదె ౹ యవనినాథ!

సుమి—నాథా! మునిశాపమంటిరే. అదియేమి?

దశ—కౌసల్యా! సుమిత్రా! వినుఁడు. నేను యౌవనమునోద్రేకంబున నొకనాఁడు వేటాడుటకై సరయూనదీతీరమున కరిగితిని. గాఢాంధకార సమయంబున నేనుఁగు నీరంబులఁ ద్రోలుచున్నట్లు 'బుడబుడ' మను శబ్దము వినంబడినది. వెంటనే శబ్దభేది బాణముతోఁ గొట్టితిని. నాకురదృష్టవశంబున నావిడచిన బాణమప్పుడే జలసంగ్రహణార్థమై చనుదెంచిన నొకముని బాలకునకుఁ దగులుటచే 'హా! నమశ్శివా!' యని యొక్క యఱపఱచి నేలకొఱగెను.

కౌస-సుమి—హా! ఎంతకష్ట మెంతకష్టము

దశ—తరువాత నాయమునిని వేఁటాతని చెంతకరిగి క్షమింపుమని కోరితిని. ఆతని తలిదండ్రులంధులనియు- వారికొఱకు జలంబుఁ గొనిపోవవచ్చితిననియుఁ జెప్పి- యాజలము వారికొసంగుమని చెప్పి యాతఁడు ప్రాణములు విడచెను. పిమ్మట నేనాజలముదీసికొని యావృద్ధదంపతులఁ జూసి యథార్థమెఱింగింప మొదలునటకిన

కదళీతరువులవలె మూర్ఛిల్లి కొంతవడికి లేచి యనేకవిధంబుల విచారించి నన్నుఁగని "పాపాత్మా! మావలెనే నీవునుఁ బుత్రశోకముచే మరణింతువుగాక" యని శపించి వారు గతించిరి. దేవేరులారా! ఆశాపఫల మిప్పు డనుభవింపవలసివచ్చినది.

కౌస-సుమి—హా! రామచంద్రా! మాకి కేదిదిక్కు? (అని మూర్ఛిల్లుదురు)

వసి—(ప్రవేశించి) రాజేంద్రా! ఎంతకాల మిట్లు విచారించెదవు?

దశ—ప్రాణములు మేననున్నంతకాలము సూర్యమివరా! కేకయరాజేంద్రుని చెంతనున్న మాభరతశత్రుఘ్నులను శీఘ్రముగా బిలిపింపుఁడు.

వసి—అవస్య మట్లనే పిలిపింతును.

(తెర వ్రాలును.)

ఇది ద్వితీయాంకము.





శ్రీరామచంద్ర.

# సంపూర్ణ రామాయణము.

## తృతీయాంకము.

### పాదుకాపట్టాభిషేకము

ప్రథమరంగము:—కైకేయి మందిరము.

[భరతశత్రుఘ్నులు ప్రవేశించుచున్నారు]

భర—(సందిగ్ధహృదయముతో నిటునటుఁ జూచుచు) తమ్ముఁడా!

సీ. వైభవోపేతమై । శోభాయమానమై
గన్పట్టు పురమేల । కళదొఱంగె
రాణించు నీపుర । రాజవీధు లిదేల?
వెలవెల బోయిన । విధముఁ దోఁచు
సతతంబు వీతెంచు । సంతోషవాదముల్
వినఁబడ విదియేమి? । వీనులలర
మనలఁ గాంచిన యంత । మన్నింపకయె భటుల్
గన్నీరు గార్చఁగాఁ । గడఁగిరేల?
ఏమిమూఁడెనో? మఱి । యేమియయ్యెనో గాని
గడువజాలనట్టి । కష్టమేదొ
కలిగినట్లు మనసు । కళవళఁ బడుచుండె
నేమికారణంబో । యెఱుక పడదు.

పట్టణ మింతపాడువారినట్లుంట నే నిదివఱకెన్నఁడును జూడలేను.

శత్రు—అన్నా! పురప్రవేశ మొనరించినప్పటినుండియు నాకును నట్లే గాన్పించుచున్నది. తండ్రిగారియాజ్ఞ మన కెఱింగించుటకై గిరివ్రజపురంబున కరుదెంచిన వారివచనంబులుగూడ విన్నదనంబులై యున్నవిగాని సంతోషకరంబుగాలేవు. కావుననే నేను వారి నప్పుడు ప్రశ్నించితినిగదా? వారేదియోచెప్పి తప్పించుకొని యిరి సమస్తవైభవములును నొక్కమారే గట్టించివైచుట చూడ యేదో యొకవిశేషకారణముండి తీరవలయును.

భర—సోదరా! అదిగో! చూడుము. మనలను గాంచిన యంతనే భయభ్రాంతులై భటులు దూరదూరముగాఁ బోవుచున్నారు. మూలమూలల డాగుచున్నారు గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచున్నారు. వీరియవస్థయంతయు విపరీతముగానున్నది. కారణమెట్టుంగ రాకుండనున్నది? కానిమ్ము గృహమునకు వచ్చితిమికదా? తల్లిగారి నడిగినచో నన్నియు దెలియును. (నిష్క్రమింతురు)

(తెర లేచును)

[మరల భరతశత్రుఘ్నులు ప్రవేశింతురు]

భర—తమ్ముఁడా! మన మీదినంబున మనతాతగారిచెంతనుండి వచ్చెదమని యందఱకును దెలియునుగదా! ఒక్కరైనను మన కెదురురాకుండుట కేమి కారణము? తల్లిగారైనను రాకుండుటకేమి కారణము?

[అప్పుడమంగళరూపముతో కైక ప్రవేశించుచున్నది]

కైక—(విచారముతో) నాయనా! నాయనా! వచ్చితివా?

భర—(తల్లినిజూచి విచారముతో) అమ్మా! అమ్మా! ఇదియేమి విపరీతరూపమే?

ఆ. వె. సుస్రిక్కియుంటివేల? । శోభదొఱఁగితేల?
వాడియుండనేల । వదన మిటుల?
తొంటిరూపమెల్ల । దొఱఁగియుంటి విదేల?
యేడ్చుచుంటివేల? । యెఱుఁగఁ జెపుము.

శత్రు—అమ్మా! పట్టణమంతయు నిట్లు శోభావిహీనమై యున్న దేమి?

కైక—(బిట్టుగవగచుచు) నాయనలారా! ఇంకేమున్నదోయి!

ఆ. వె. సత్యసంధులనుచు । సర్వజగమ్ముల
మిగుల కీర్తిఁ గనిన । మీ జనకుఁడు
మిమ్ము మమ్ముఁ గూడ । మేటిదుఃఖాబ్ధిలో
ముంచి స్వర్గమునకు । బోయె నయయొ.

భర-శత్రు—ఆఁ! ఆఁ!—(అని మూర్ఛిల్లుదురు)

కైక—(కుమారులకు మూర్ఛదేర్చి) తండ్రులారా! విచారించిన నేమి ఫలము? మనయదృష్టము లిట్లున్నవి. విచారించుటమాని ముందుకార్యమును జూడుఁడు.

భర—

13 వ అనుబంధము.

తండ్రీ! తండ్రీ!

తే. గీ. సుతులు లేరంచు మదిలోన । సుస్రిక్కిసుస్రిక్కి
క్రతువు నొనరించి మమ్ములఁ । గాంచి తుదకు,
మా పురోభివృద్ధిఁ గని । మా వలనను
సౌఖ్యపడకుండ పోతి వే । జనక! దీని కి.

శత్రు—(లేచి) జనకా! జనకా! నీకు మాయందున్న యాదరభావ మెందరిగెను. మమ్ముఁ గంటిరెప్పలలో బెట్టుకొని పెంచితి వే. మా క్షేమ మింక ముం దరసెడివారెవ్వరు? మాకిం కెక్కడ క్షేమము? మా కిం కెక్కడిసౌఖ్యము? మాకిం కెక్కడి యానం దము?

తే. గీ. తండ్రి జీవించియున్నంత । దనుక నేఁ గ
దే? సుతుల ముద్దుముచ్చటల్ । దీరుచుండు
నతఁడు పోయినవెన్క నా । కంతయైన
కలదె సౌఖ్యము? మాకట్టి । గతియె కలిగె

భర—(విచారముతో దల్లిఁ జూచి) అమ్మా! నాజనకుం డెట్లు మర
ణించెను.

కైక—కుమారా! వెనుక మీతండ్రిగా రొక యుద్ధములో నాసాహాయ్య ముండుటవలన జయించిరి ఆనాఁ డా భూపతి నాప్రజ్ఞావిశేషంబుల కలరి "నీ యిచ్చవచ్చిన వరంబులు రెండు గోరుకొ మ్మిచ్చెదను" అని యన నా యిచ్చవచ్చినప్పు డడిగెద నని చెప్పితిని. అప్పుడు నేను గోరుకొనుటకుఁ దగినవరంబు లేమియు నాకుఁ గాన్పింప లేదు. ఇంతకు బదిదినంబులక్రిందట రామున కీ యయోధ్యాపురము పట్టముగట్ట నిశ్చయించిరి. అప్పుడు నేను మీతండ్రిగారిని డాసి, నా వెనుకటి వరంబు లిప్పు డిమ్మని గోరితిని. నీయిచ్చవచ్చిన వరంబులు గోరుకొ మ్మిచ్చెదనని నీ తండ్రిగారు బలుకుటంతోఁడనే,

తే. గీ. ఈ యయోధ్యాపురంబున । కెలిమి భరతుఁ
బట్టభద్రుని గావింప । వలయు నొకటి
పదియు నాల్గేండ్లు రాముండు । వనములందు
ననఘ! మునివృత్తినుండఁ బో । మ్మనుట రెండు.

భర—(క్రోధముతోఁ జూచుచు) తరువాత?

కైక—సత్యసంధులగు తండ్రిగారియాజ్ఞఁ బాలింప రాముఁడు సీతాలక్ష్మణులతోఁగూడ నానాఁడే వనవాసమునకుఁ గాషాయాంబరధరుండై వెడలిపోయెను. రామలక్ష్మణు లావిధముగా వెడలుటచేతను మీరు మీతాతగారి గృహమునుండి సకాలము

నకు రాఁబోవుటచేతను బెంగఁగొని "పుత్రా! పుత్రా!!" యని పరిదేవన మొనర్చుచు నేఁటి కేఁబదిదినములక్రిందట.—

శతు—(స్రుక్కాంత పడిపోవును)

భర—(వడకుచు) హా! హా! నాపాపపుజెవు లెట్టి దుర్వార్తను వినుచున్నవి! నాయగ్రజుఁడే- శ్రీరామచంద్రుఁడే- జానకీ మనఃకాముఁడే- భాతృవత్సలుం డగు రాముఁడే- సత్యవాక్పరిపాలకుఁ డగు రాముఁడే- సీతాలక్ష్మణులతో నరణ్యవాస మొనర్పఁ బోయెనా? ఇట్టితరుణంబున నాతండ్రిగా రస్తమించిరా? ఈ ఘోరకష్టములకు నీవరములా కారణము. (క్రోధముతో) ఓ దుష్టరాక్షసీ! పతిప్రాణాపహారిణీ! ఇవి నేమివరములే కుల కలంకిణీ! కనులు గానరాక పోయిన కారణమున వ్యాఘ్రిము తనబిడ్డలం దినును. కనులుండియు సుతులఁ దినుచున్న ని న్నే మనవలయునే దోషకారిణీ! రాముఁ డెవ్వఁడనుకొంటివే. భగవంతుఁ డాతఁడే గాదకే. ఆతని మహామహిమలు వినియు మఱచితివకే. అట్టి భగవంతు నెట్లు ప్రకారము దలపెట్టితివే ఢాకినీ! శ్రీరామపాదారవింద సేవనము లేకుండ నేనకే యీ యయోధ్య పాలింపవలయును? పాపాత్మురాలా! ఇట్టితల్లు లెందైనఁ గలరకే. ఓ మాతృరూప పిశాచమా!

*చ. అడవుల రామచంద్రుఁడు జటాజినముల్ ధరియించి యుండ నే
బుడమి భరించి భోగములు । పొందఁగలానకొ? యిట్టినొప్పు లే
వొకఁ గలవింక నన్ను మొగ । మేమితెఱంగునఁ జూతు పాపపుం
గడుపునఁబుట్టి యీభువన । గర్హ్యుకు బాత్రుఁడ నైతి రాక్షసీ.

ఛీ ఛీ! దురాత్మురాలా! నీమోము జూచుట మిగుల పాపము.

సీ. కేకయరాజేంద్రు । కీర్త్యున్నతుల కెల్ల
నపయశంబును గూర్చి । నట్టి నిన్ను

యిక్ష్వాకుకులమున । కెనలేని దుర్యశ
మిట్లు చేకూర్చిన । యట్టి నిన్ను
కొంకుజంకును లేక । కుమతివై ప్రాణేశు
ప్రాణముల్ హరియించి । నట్టి నిన్ను
అవతారపూరుషుం।డగు రామచంద్రున
కపకార మొనరించి । నట్టి నిన్ను
సోదరీమణివలె నిన్ను । జూచుకొనిన
యట్టి కౌసల్య నేడ్పించి । నట్టి నిన్ను
అవనిజాతను ద్వేషించి । నట్టి నిన్ను
జంపినను లేదు పాపంబు । జగతిలోన.

(అని మీదికేగును.)

శత్రు — (భరతుని కడ్డుగా జని పట్టుకొని)

తే. గీ. అగ్రజా! యేటికిట్టి దురాగ్రహంబు
శాంత మూనుము కాంతలన్ । జంపరాదు
అందునను నిన్ను గన్నట్టి । యతివ యామె
మాతృహంతవు కానేల । మానుమయ్య!

మాతాపితృవిధేయుండగు శ్రీరామచంద్రుండీవార్త విని సహింపం గలండా? ఇట్టి యకార్యకరణం బొనరించి మన మాతని వదన పద్మము దిలకింపఁగలమా? ఆగ్రహ మాపదలకు మూలకారణము. నామాటవినుము. శాంతమూనుము.

కైక — (విన్నదనముతో)

మ. తనయా! మంథర నన్ను జేరి మిగులన్ । దర్కించి యీకోర్కెలే
గన నీవృద్ధికి మూలకారణము కై । కా! చూచుకో! నీవు నం
దనుఁడే రాజగు నీపురంబునకు జే । దాయుంచు బోధింప, ముం
దును వెన్కల్ గనకుండ నావరములే । దుష్టాత్మనై కోరితిన్.

నేనొనరించినది మహాపాపకార్యమని నన్నెల్లరును దూరుచునే యుండిరి. ఆసంగతి నేనుఁగూడ నెఱుంగుదును. కాని రాజ్యకాంక్ష నన్ని యపమార్గమునకుఁ ద్రిప్పినది. రాజ్యలాభమునకు నీవైనను సంతసించి నన్నుఁ బ్రేమింతువనెడి ధైర్యంబున నన్నెవ్వరెన్ని గతుల నిందించినను గణింపనైతిని. నీవు రాజ్యపాలన మొన రించుచుండఁగాఁ జూడవలయునని యీ యకార్యము నొనరించి తిని. వైధవ్యభరంబున గోల్పితిని. నాయనా! నన్ను క్షమించి రాజ్యంబు స్వీకరింపుము.

భర — తమ్ముఁడా! వినుచున్నావా?

తే. గీ. లోక విద్రోహులైన స్త్రీ । లోక సమితిఁ
దునిమినను లేదు పాపమం । చుచితగతిఁ
దాటకిన్ జంపి మనయన్న । చాటు నీతిఁ
గాన నీమెను వేగమే । గండడంతు.

(అని మీఁది కుఱుకుచున్నాఁడు.)

కైక — (తప్పించుకొని) నాయనా! నాకు బుద్ధివచ్చినది. పాపిష్ఠిరాలనై కన్నుమిన్నుఁ గాన కధికారమున కాసించి- నాకన్నతండ్రిని- వంశోద్ధారకుని- జానకీమనఃకాముని- శ్రీరాముని- అవతారపు రుషుని- కౌసల్యాగర్భశుక్తిముక్తాఫలంబును- నడికానకుఁదోసి తిని. అపయశ మార్జించితిని. నాయట్టిదాని జన్మ మేమిజన్మము. నాయనా! నన్ను రక్షించి పుణ్యముగట్టుకొమ్ము. అక్కా! అక్కా!

తే. గీ. నీ సుతున కెగ్గుఁజేసిన । నీచమతిని
రాజ్యలక్ష్మికై ప్రాణేశు । ప్రాణములను
గొన్న పాపురాలను, శిర । ణన్నదాన
పతితపావనురాల కా । పాడుమమ్మ.

(నిష్క్రమించును.)

శత్రు— అగ్రజా! మనముగూడ పెదతల్లిగారిచెంత కరుగుదము రమ్ము.

భర—(విచారముతో) తమ్ముఁడా! నేనిప్పు డాసాధ్వీమణి నేమనిదర్శించుదును? ఆమె నన్నుఁ గాంచినయంత నే—

సీ. అన్నరాజ్యమునకై । యాసఁజెందిన మహా
పాపుఁడు వీఁడని । పలుకదేమొ ?
ఆత్మేశు ప్రాణమ్ము । లపహరించిన కైక
సుతుఁడు వీఁడని నను । జూడదేమొ?
కైకమ్మసుతుఁడవై । గడియించితివి రాజ్య
మని నన్ను నిష్ఠుర । మాడునేమొ?
"ఎఱుఁగ నే నీకుట్ర । లేమియు నామాట
నమ్ముమా" యనివేడ । నమ్మదేమొ?
యెటుల వచ్చువాఁడ? । నేమంచు కౌసల్య
పాదపద్మములను । బట్టువాఁడ
బ్రదుకు నీచమయ్యె । ప్రాణమే భరమయ్యె
కైకసుతుఁడ నైన । కారణమున.

శత్రు—అన్నయ్యా! విచారముచే నీ వట్లనుకొనెదవుగాని యా పతివ్రతాశిరోమణి నిన్ను దూరదు. నీవు నిర్దోషివని యామె నాత్రి మెఱుఁగదనుకొంటివా? మఱేమియు భయములేదు. మనము వెడలుదము రండు. (ఇరువురు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము.

[కౌసల్యాంతఃపురము:—కౌసల్యాసుమిత్ర లుందురు]

కౌస—(విచారముతో) 14 వ అనుబంధము.

అయ్యో! నాయనా! రామా!

తే. గీ సుతుఁడు సుఖపడుచుండఁగా । జూడలేక
వనములకు గెంటివైచి తా । పైన నీదు
తండ్రిగారి ప్రాణముల ని । ర్దయను మ్రింగి
తిట్టి కౌసల్య కడుపునఁ । బుట్టితేల ?

సుమి—అక్కా! విచారించిన నేమిలాభము? భగవల్లీల యిట్లున్నది. మన కర్మసూత్ర మట్లున్నది. ఇందు నీ దోష మేమిగలదు?

కం. పరమేశు విలాసముచే
వరమడిగిన కైకచే, ద । పసి శాపముచేఁ
దరుణీ! కష్టము లీగతి
దొరకొనెనే గాని నీకు । దోసము గలదే ?

అక్కా! పాప మాభరతుఁడు నీ వదనము జూచుటకు లజ్జించుచున్నాఁడు ఆతఁ డీ విషయంబున నేమియు నెఱుంగడు. ఆతఁడిప్పుడు నిన్ను దర్శింపవచ్చును. ఆతని నీ వనుగ్రహింపుము.

[అప్పుడు భరతశత్రుఘ్నులతో వసిష్ఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భర—(వడివడి జని కౌసల్యపాదములపై వ్రాలి) అమ్మా! అమ్మా!

తే. గీ రాము నడవులకంపించి । ప్రాణకాంతు
ప్రాణములఁగొన్న కైక గ । ర్భంబునందు
జననమందినయట్టి ద్రో । హంబుగాక
యెఱుఁగ నెట్టి దోసము క్షమి । యింపుమమ్మ!

అమ్మా! సుకుమారుండును, మాతాపితృవిధేయుండును నగు శ్రీరాము నడవులకుపంపించి ప్రాణనాథుని దిగమ్రింగిన యద్దురాత్మురాలి పుత్రుఁడు వీఁడని నన్నుగాంచి యందఱును ద్వేషింతురు. (విచారముతో)

సీ. ప్రేముడితో మమ్ము । పెంచవలసిన
తండ్రియే మముబీడి । తరలె దివికి

యిన్నాళ్ళు నను పేమ । నీక్షించినటు వంటి
తల్లి యుండియు లేని । దాయె నాకు
కఠినాత్మురాలైన । కైకసుతుండనా
నను గాంచి రాముండే । మనునో యేమొ?
యెందలి యాధార్థ్య । మెఱుంగక ప్రజలెల్ల
భ్రాంతితో నన్ను నిం । దింతురేమొ ?
యేమిచేయువాండ । నెవ్వరు దిక్కింక
సర్వమెఱింగినట్టి । జనని వీవె
కరుణతోడ నన్నుం । గాపాడకున్నచో
భరతుండింక బ్రతుకు । ప్రాప్తిలేదు.
[ఏడ్చుచు కైక ప్రవేశించుచున్నది]

కైక—(ఏడ్చుచు) అక్కా! అక్కా!

మ. భరతుం డీవిషయంబు లేమెఱుంగండా । పాపాత్మురాలైన మం
థరయే నాదరిం జేరి కొండెములం చి । త్తభ్రాంతిం జేసూర్చి యీ
వరముల్ కోరగ బోధంజేసినది యీ । పాపం బయో నాదియే
భరతుం బ్రోవుము పుత్రుంగా నతసన్ । బాలింపుమా తల్లిరో !

భర—(వలవల నేడ్చుచు) అమ్మా! నీపాదంబులాన నే నేపాపంబెరుంగను. నన్ను క్షమింపుము.

సుమి—అక్కా! మనపూర్వజన్మ సంచితార్థమే మన కిట్టిపాటు గూర్చినదిగాని- యిందు వీరందఱును నిమిత్తమాత్రులే. ఈవిషయము నీవెఱుంగనిదిగాదు. పాప మీా భరతుండెట్లు కడుపగిలి దుఃఖించుచున్నాడో చూడుము. తల్లీ! పెద్దదానవు. నీదుఃఖమును నీవు దిగమ్రింగి పిల్లల నూరడింపుము.

వసి—రాజమాతా! భరతుండు నిశ్చయముగా నిర్దోషి. వాని ననుగ్రహింపుము.

కౌస—(విచారముతో) నాయనా! భరతా!!

చ. కడుపునఁగన్న పుత్త్రుఁడటు । కాననకేగె నటంచు నెంతయో
నడలుచునుండ దాసిపయి । నక్కట! రాజనకుండు ప్రాణమే
విడచినదుఃఖ మీగతిని । బెల్లుగ నాతలముక్కలౌట నిన్
గాంచుక! కనంగలే దదియొ । కోపముగా మది నెంచుకోకుమా?

(లేవదీసి కన్నీరుతుడుచుచు) కుమారా! విచారింపకుము నీజననిని కూడ దూరకుము కర్మసూత్రి మూపెరూత్రిము గడువం గలదా?

భర—(కౌసల్యకు నమస్కరించి) అమ్మా! జనకున కుత్తరక్రియ లొనరించినపిమ్మట నాయన్నగారి చెంతకరిగి—

శా. రాముం బుణ్యగుణాభిరాము నెలమిన్ । బ్రార్థించి తోడ్తెచ్చి ది
క్సీమాతిక్రమణత్వమాన్యయుల స । త్కీర్తుల్ వెలుంగొంద ను
ద్దామశ్రీ కభిషిక్తుఁజేయుదు—

కౌస—(విచారముతో). నాయనా! నీయాశయము మంచిదేగాని పితృవాక్యపరిపాలకుండగు నాచిన్నియన్న మరలివచ్చి రాజ్యమేలునా? పదునాల్గేండ్ల అరణ్యావాసము ముగియకుండ పట్టణంబున కరుదెంచునా? కల్ల. కల్ల. —నాయనా! వృథాయాసమే గాని లాభములేదు.

భర— ... ... ... రఘూ । త్తంసంబు రాకున్నచో
భూమీశాగ్రణిఁగొల్చి పల్తు నటవీ । భూమిన్ దపోవేషినై.

కైక—అక్కా! మనమందఱముకూడ వెడలి రాముని బ్రార్థింతము. పితృవాక్యపరిపాలన మెట్టిదో మాతృవాక్యపరిపాలనముకూడ నట్టిదే. మనయదృష్టవశంబున రాముఁడు మనకోర్కె కనుమతింపగూడదా! (వసిష్ఠునితో) మునిచంద్రమా! ఏమందురు?

వసి—కర్మదినములు ముగియఁగనే వెడలుట మంచిదని నాయభిప్రాయము.

కౌస—అట్లే కానిండు.

తెర వ్రాలును.



## తృతీయ రంగము.

చిత్రకూటప్రాంతారణ్యభూమి.

[ముందు సీతారాములును, వెనుక లక్ష్మణుఁడును నుండఁగాఁ దెర లేచును.]

శ్రీరా—జానకీ! అరణ్యవాస మత్యంతకష్టమని నొక్కి నొక్కి చెప్పినను నామాట వినక నావెంట వచ్చినందుల కీవెట్టిసౌఖ్యములం బడుచుంటివో జూచితివా? ముందుముం దింకెంతయు ఘోర కష్టములు బడవలసివచ్చునే. యీకష్టములు చూడఁజాలకున్నాను

సీత—నాథా! తమ రట్లనవలదు.

సీ. బాల్యంబుననె దుష్ట । రాక్షసులఁబట్టి
సంహరించిన బాహు । శాలురయ్యు
అలయహల్యాశాప । ముర మేసముతోనఁ
దప్పించినట్టివంటి । ధన్యులయ్యు
సామాన్యనరులకు । సాధ్యంబు గాని, యీ
శ్వరవిల్లు విఱిచిన । వారలయ్యు
అవతారపూరుషుం । డగు భృగురాము గ
ర్వం బడంచిన యట్టి । వారలయ్యు
పతితపావనులయ్యు యీ । పగిది ఘోర
కాననంబులఁ గడలేని । కష్టములను

బహుచు దపియుంచి నవయంగా । వే సివచ్చి
నపుడు తమదాసినైన నే । ననఁగ నెంత.

నాథా! తమకంటె నే నెక్కువ సుకుమారినా? మీరు పురుషులు గావున వడివడి నడచుచుంటిరి. నే నబలనుగావున నడకలో నా యబలత్వము జూపుచుంటిని. అంతియేగాన తమరు నాకష్టములఁ గాంచి చింతింపవలదు.

శ్రీరా—మనోహారిణీ! నీ పింకె తదూరమో నడువవలసినపని లేదు. అదిగో!

* సీ. మహనీయులౌరవహారేషు । మంత్రిస్వరంబులు
గంధర్వ మంజుల । గానతతులు
విలసిలెకిన్నరీ । వీణారవంబులు
శారికోపన్యాస । చతురతయును
రాజకీరాలాప । రచనాకలాపముల్
కలహంసనిస్వన । కలకలములు
కమనీయకోకిల । కలకనాదములు, రో
లంబఝంకారకో । లాహలంబు
గలుగుచాస వేద । గంభీరఘోషముల్
గలయ జెలఁగుదాని । గాలినోలి
మొరయు వేణురంధ్రములదాని । కనుఁగొన్న
త్రికూట మిదియె । చిగురుబోడి.

ఈపర్వతముపై మహానుభావులగు ఋషులున్నవారు. వీరినందఱను దర్శించి యిచ్చట నే కొంతకాల ముందము.

(నిష్క్రమించి రెండవవైపునుండి మరల ప్రవేశింతురు)

లక్ష్మ—అగ్రజా! ఇదివరకు మనముచూచిన ప్రాంతము లన్నిటి కంటెను నిది రమణీయమై యున్నది.

రాము—సోదరా! నీవనినది నిజమే గాని- నాదక్షిణనేత్రి మేటికో యూరక యదరుచున్నది. కారణమేమో యెఱుంగరాకుండ నున్నది.

లక్ష్మ—(వినిపించికొనక యొకవైపునకుఁ జూచుచుండును.)

రాము—తమ్ముఁడా! ఏమది అట్లు చూచుచుంటివి.

లక్ష్మ—అగ్రజా! అదెసఁ జూడుడు.

తే. గీ. ఆకసంబెల్ల ధూళిచే । నడఁగుకొనియె
పెరుగవంబేమొ కర్ణముల్ । విరుచునుండె
నీవరుసఁగన రాక్షసు । లెవ్వరైన
మరల జనుదెంచు చున్నట్లు । మదినిఁదలఁతు.

రానిండు. రానిండు. క్రొవ్వి మీపైకి రాదలంచిన నట్టి శాత్రవునినైన నిట్టె బరిమార్చవచ్చును.

(అనిపిమ్మట్రిమింది వఱికి పరల బ్రవేశించి)

అగ్రజా! అగ్రజా!! నీ యమాయకత్వమే నిన్నింతవఱకుఁ దెచ్చినది. దీనికిప్పు డేమనియెదరు?

మ. భరతుండే భవదీయ ప్రాణములను । బల్మారు వాక్రుచ్చిరే
పరికింపుం డటు మీపి మానుజుఁడె మీ ప్రాణంబులో బ్రాణమే
ధర మీయడ్డము లేక నేలుకొనఁ చి । త్తంబాను నూహించి స
త్వరమే వచ్చుచునుండె సైన్యయుతుడై । దర్పంబుతో జూచితే
రాజ్యాపేక్షతో మనం నరణ్యంబునకు బొమ్మనియే యావల్లని తల్లి కైకేయి గోరినదిగాని- మా తాపిస్తి కుమారుండగు భరతుం డాతకంటె నేడాకు లెక్కువ చదివిన వాఁడగు కతంబున బహునాళ్లెండ్లనంతరమైన వెనుక మన రాజ్యమును మనము గోరుదుమేమో యనుభయంబు పెంపున నిస్సహాయులమై యున్న మనలను సంహరించి—నిశ్చింతతో రాజ్యమేలుకొనదలంచి—

రణముసల్పుటకే వచ్చుచున్నాఁడు. ఇట్టి క్రూర మాభిప్రాయముతో జనుదెంచుచున్న భరతుని మధ్యమార్గముననే మట్టుఁబెట్టెదను. అగ్రజా! అనుజ్ఞనిమ్ము.

రాము—లక్ష్మణా! ఏల నీకీవెఱ్ఱియాలోచనము. ఆతఁడు నన్ను క్షమాపణము గోరుటకై జనుదెంచుచున్నాఁడు గాని నన్ను సంహరించుటకు గాదని తలంపుము. మనము వారిని గలసికొందము రమ్ము.

లక్ష్మ—అగ్రజా!

ఉ. మీరసినట్లు నిక్కముగ । మేటిక్షమాపణ మిమ్ము దీనుఁడై
గోరగ వచ్చుచుండు నెడ । కోపులు లేల? రథంబు లేల? యీ
తీరున సైన్యమేల? మఱి । తీక్ష్ణశరంబు లవేల ? నూతనా
చారమె వేడుకోలునకు? । స్వాంతమునన్ దలపోసిజూడుమా!

అగ్రజా! మీరు సత్యకాలపు మాటలాడుచున్నారు. అయోచితము రాజ్యమబ్బినప్పు డద్దానిని దిరిగి మీకే పాలించుకొండని భరతుం డనున ? పరిపాలనా సామర్థ్యము లేనివాఁడా?

ఆ. వె. ప్రాణ మలియకుండ । రణము చేయకయుండ
చెక్కుచెదరకుండ । జటికలోన
నశ్రమమున రాజ్య । మబ్బగా తినలేక
విడిచికొనఁగ । నతఁడు వెఱ్ఱివాఁడె?

రాము—లక్ష్మణా? వేగిరపడకుము. క్షణమోర్చినచో సర్వంబును నీవె యెఱుంగగలవు? (అనిచూచి) అదిగో! వారందఱేవచ్చుచున్నారు. వాని నెదుర్కొందము రమ్ము.

లక్ష్మ—ఒక్కవరం బొసంగినచో వచ్చెదను.

రాము—ఏమది ?

లక్ష్మ—ఆతఁడు మి మ్మేమైనఁ దూలనాడినచో—

రాము—(చిఱునగవుతో) వెఱ్ఱివాఁడా! అట్లేగావింపవచ్చును. లెమ్ము.
(నిష్క్రమింతురు.)

## తురీయరంగము.

[కైక, కౌసల్య, సుమిత్ర, భరత, శత్రుఘ్న, వసిష్ఠు లొక ప్రక్కను వారిసమీపమున సీతా, రామ, లక్ష్మణులును నుందురు

రాము—(కన్నీరు తుడుచుకొనుచు)

15 వ. అనుబంధము.

వసి—రామచంద్రా! విచారింపకుము.

చ. అఱువదివేల వర్షములు । హర్షితమూర్తి ధరనేలినేలి సు
స్థిరతర కీర్తిగాంచియు, న । జేయులరా మినుగాంచి ధన్యుఁడై
యరిగె దివిష్టపంబునకు । నాతనిగూర్చిన వంతయేల నీ
వెఱుగని ధర్మమేది? తను । వేరికినైన స్థిరంబె రాఘవా!

రాము—సంయమీంద్రా!

చ. కొడుకులు లేరు లేరనుచు । గుందినయంతటి వారమైన యా
కొడుకులఁ గల్గినందులకు । గొబ్బున సౌఖ్యము లందెమొక్కొ? యే
వడువున మాయునో వ్యథలు । బాయును? తండ్రిఋణంబు దీర్ప నే
వడువున మాకు లభ్యమగు? । భావనఁ జేయుఁడి నెమ్మనంబునన్.

కైక—నాయనా! రామచంద్రా! ఈదుర్దశల కెల్ల నేనే కారణము. గతించినదాని కిపుడు చింతించినచో లాభము లేదు. (విచారముతో)

తే. గీ. నింద లేనిదే యెవ్వాని । బొందియైనఁ
బోవ దెన్నఁడటంచును । బూజ్యులందు
కాలగతిఁ ద్రోడ నా దగు । కఠినబుద్ధి
మారి నీ తండ్రి కట్టెను । స్మరణ మొసఁగ.

ఆ మహాపాపమెల్ల నాయదియే నన్నుఁ గూర్చి పౌరులెల్లరును హసించు చున్నారు. నీవు తిరిగి యయోధ్యాపురంబునకు రాకయున్నచో నా నిందలు నేను భరించుట దుర్ఘటము. నీవు తిరిగి రాజ్యము గైకొనినచో నా నింద కొంతకాలమునకు గాకున్న గొంతకాలమునకైనను దొలంగిపోవును. నాయనా! రామా! నాఁడు ని న్నరణ్యావాసమునకు బొమ్మనుటకు నా కెట్టి యధికారము గలదో నిన్నుఁ దిరిగిరమ్మనుటకును నా కట్టి యధికారమే గలదు. తనయులకు బితృవాక్యపరిపాలన మెట్టిదో మాతృవాక్యపరిపాలనముగూడ నట్టిదియే. నీకుఁ దెలియని విషయంబు లేమియును లేవు. నిన్ను నేను ప్రార్థింపఁగూడదు గాన బ్రతిమాలుచుంటిని. నా యానతి శిరసావహింపుము.

రాము—జననీ! నీవు చెప్పినదంతయు ధర్మయుక్తమే గాని—

తే. గీ. ధరణి సుస్థిరమైన స । త్యంబుకొఱకు
మమ్ము వీడెరు తుద కస్థి । రమ్ములైన
ప్రాణములవీడె నా తండ్రి । యట్టి సత్య
వాక్యపరిపాలకుని దృప్తి । పరుపవలదె ?

ఆ మహామహుని సమక్షంబున బదునాలుగేం డ్లరణ్యావాసంబు జేసి వచ్చెదనని శపథ మొనర్చి యిప్పు డాతఁడు గతించెనను నెపంబున మరల రాజ్య మాక్రమించుకొనుట దోషముగాదా ? ఇప్పు డందులకు వ్యతిరిక్తముగా నీవు నా కాజ్ఞాపించుటగూడదు. కావున నన్ను బాధింపకుము. నీకు నా యానగలదు.

భర—అన్నా! నీ యీ సోదరుని చిన్నివిన్నప మించు కాలింపుము. ప్రాణములకంటె మిన్నయగు సత్యవ్రతము విడువుమని నీ కుప దేశించునట్టి మందబుద్ధిని గాను. ఇహాపరంబగు సత్యవ్రతము నీవారు విడువఁదగదు. కాని—

మ. భరతా! నీవె మదీయప్రాణమనుచున్ । బల్మారు వాక్కృచ్చి సు
స్థిరమౌ ప్రేముడి తోడ జూచుకొనుచున్ । శీర్షంబు ముద్దాడు చుం
డిరి మున్నప్పుడు నేడుగూడ నటులే । నిండారు సత్ప్రేమతో
భరతుం జూచుచు మీ సమక్షమున ని । ల్వన్ సమ్మతింపన్ వలెన్.

సర్వజనసమ్మతుండవగు నీవు లేని యయోధ్యాపురంబున నే నొక్క
క్షణంబైనను నిల్వఁజాలను. మీ సమక్షముననేయుండి మీ
సపర్య లొనరించుకొని తరింపవలయునని యున్నది. కావున యీ
కోర్కె కనుమతింపుడు.

రాము—సోదరా! (దగ్గఱగా దీసికొని) నీకు నా యెడఁగల భక్తి
వాత్సల్యంబు లేనెఱుంగనివిగావు. నీ కోర్కె కనుమతించుటకు
నా కెట్టి యభ్యంతరమును లేదు. నీవు దగ్గఱ లేనికొఱంతయు
నాకు దీరెడిదిగాదు కాని యొక్క విషయ మాలోచింపుము.

తే. గీ. రాజు లేనట్టి యెటువంటి । రాష్ట్రమైన
భగ్నమయి దొంగజనుల కా । వాసమగుచు
నాశనంబగు- కావునన్ । ధరణివిడువ
తగదు తగదన్న ! నా పల్కు । దలపుమన్న !

అది మంచియాలోచనముగాదు. సోదరా! నా వాక్యము లాలించుము.

తే. గీ. పదియు నాల్గేండ్లు సజముగా । బదియునాల్గు
క్షణికములరీతి కాలంబు । గడిపివైచి
వెంటనే వచ్చి రాజ్యంబు । స్వీకరింతు
దయను బొమ్మన్న నా మాట । దలపుమన్న.

భర—అన్నా! నీ పాదద్వయం బంటి వేడెదను. కరుణింపుము. (అని
పాదములపై వ్రాలును.)

వసి—రామభద్రా! భరతుఁడు నీ పాదములంటి వేడుచున్నాఁడు.
నీ వనవాసమే సర్వజనులకును సౌఖ్యావాసమై యున్నది.

కావున నీ వయోధ్యకు రాదగదు. నీ పాదుక లాతనికిమ్ము. నీకు మారుగా నీ పాదుకలే సింహాసనమునందుంచి భరతుఁడే నీకుఁ బ్రతినిధిగా రాజ్యమేలును. అందువలన మా యిరువురి కోర్కెలును దీరును. అట్లనుగ్రహింపుము.

రాము—చిత్తము. (అని పాదుకలు విడచును)

భర—(పాదుకలు శిరమునదాల్చి) సోదరా! ధన్యుడనైతిని.

చ. అనయము సర్వలోకములు । హర్షము జెందగ కీర్తిచంద్రికల్
గన దశదిక్కులన్ వెలయుఁ । గా, నిజభక్తిని పాదుకాముఖం
బున తమ రాజ్యభారము, స । ముజ్జ్వలరీతి వెలుంగ భూప్రజా
ళిని సుఖపెట్టుచుందు విమ । లేక్షణ నిదగు శాసనంబునన్.

కావున మా కింక యనుజ్ఞనిమ్ము.

రాము—మంచిది. (అందఱును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

ఇది తృతీయాంకము.






# సంపూర్ణ రామాయణము

తృతీయాంకము.

వనవాసరాఘవము.

ప్రథమరంగము — దండకారణ్యము.

[సీతారామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

రాము — సోదరా! మనము దండకారణ్యములోఁ బ్రవేశించితిమి. ఇచ్చటి కింక మన బందుగులెవ్వరును రాజాఁరు. ఈ ప్రాంతంబున సకలసౌఖ్యంబుల కాకరంబగు నొక సమస్థలంబున పర్ణశాల నిర్మించుకొని యుందము.

లక్ష్మ — చిత్తము.

[రామలక్ష్మణులు ముందును సీత కొంచెము వెనుకగాను నడచుచుందురు. విరాధుఁడు ప్రవేశించి చటాలున జానకిని దన ప్రక్కకు దీసికొని]

తే. గీ. భయము లేకుండ నే నున్న । వనములంట
వనిత నొక్కతె దోడ్కొని । వచ్చినారె
బలవిహీనులకేల నీ । వనితపొందు
మిమ్ము జంపి విరాధుఁడీ । కొమ్మఁగొనును.

సీత — హా! (అని మూర్ఛిల్లును)

రాము—(వెనుదిరిగిచూచి) అయ్యయ్యో! తమ్ముఁడా! లక్ష్మణా! ఇంకేమున్న దటుచూడుము; చూడుము.

*చ. ఘనతర కార్ముకంబుఁ బటు । కాండచయంబును గేలనుండ నా
తనువునఁ బ్రాణముం గలుగఁ । దమ్ముఁడ యిద్దశఁ బొందెఁ జూచితే
జనకతనూభవం బరఁగు । సాధ్వి నిరంతర భాగ్యలీలలన్
దనరిన మత్ప్రియన్ దశర । థక్షితినాథు నమంగుకోడలిన్.

తమ్ముఁడా! ఇంకేల నాకీ యసువులు. నేను జీవించి యింకేమిలాభము? నా కన్నులయెదుటనే మత్ప్రియసి నొక్క దుర్మార్గుఁడు పరిభవింపఁ జూచుచున్నాఁడే! అయ్యయ్యో!

*తే. గీ. ధరణిరాజ్యంబు గోల్పోటుఁ, దండ్రిచావు
ఇష్టబంధువియోగంబు । దుష్టయాతు
ఇష్టురారణ్యవాసంబు । నేఁడు నాదు
దేహదాహంబు సేసెనె । దేహికతన.

లక్ష్మ—సోదరా! ఇప్పట్టున విచారించుట నీకుఁ దగునా? నీ బాహుబలంబున కీ దుష్టరాక్షసుం డొక లెక్కయా? (అని విరాధుని దిక్కై) ఓరీ! దుష్టమార్గానువర్తీ! ఇంకెందుబోయెదవురా పాపాత్మా! (అని బాణమును విడుచును)

విరా—(తప్పించుకొని) ఓరీ క్షుద్రనరకీటకమా!

తే. గీ. ఈ విరాధుని బలమేమొ? । యెఱుఁగఁబోక
తుచ్ఛబాణానఁ బ్రాణముల్ । బుచ్చుకొనఁగ
నెంచి యున్నావె? చాల్జాలు । నెన్నఁడైన
మదగజంబును జంపునే । మశకము.

ఇదిగో! ఈ బాణాహుతి కగ్గముగాకుండ నిన్ను నీవు రక్షించుకొమ్ము. (అని బాణమును విడుచుచున్నాఁడు.)

లక్ష్మ—సోదరా! సోదరా! శరణు శరణు ఆ క్రూరుఁడాగ్నేయాస్త్రమును విడచెను అది నన్ను బొలియఁజేయవచ్చుచున్నది. రక్షింపుము. రక్షింపుము.

రాము—లక్ష్మణా! భయపడకుము. (వెంటనే తన బాణముతో వైరి బాణమును ద్రుంచి)

మ. తులువా! లక్ష్మణు నొంచినాఁడ ననుచున్ । దోస్సార మింకెంతయో
గలదంచున్ గడుగర్వమూని ననుదా । కన్ వచ్చుచున్నాఁడవే
నిలుమింకెందున కేఁగఁగాఁగలవు? రా! । నీ విప్డు నా ఘోరయు
జ్వల బాణాగ్నికి నింధనంబువలె సం । ప్రాప్తించితో మూర్ఖుఁడా!
(అని బాణమును విడచును)

విరా—(తప్పించుకొని) ఓరీ! నరాధమా!

తే. గీ. వడి విరాధుని జంపఁగా । వలయు నెఁడీ
నీ మనోరథ మీరీతి । నీళ్ళుగారె
మిమ్ము నిర్వుర నొకసారె । మ్రింగివైచి
కలికితోఁగూడి సర్వసా । ఖ్యములఁ గొందు.
(అని యిరువురనుఁ జెరియొకచేతను బట్టుకొనుచున్నాఁడు)

(రామలక్ష్మణు లొకరొకరు సాఙ్జలొనరించుకొని విరాధుని బాహువు లొక్కమారు నరకుదురు. విరాధుఁడు గంధర్వుఁడగును.)

విరా—ఓమహానుభావులారా!

కం. తుంబురుఁడను గంధర్వుఁడ
నంబురుహాక్షియగు రంభ । కనురక్తుఁడనై
డంబుగ తనుఁ గొలువని నే
రంబునకు శపించె నీశ్వ । ర సఖుఁడు రామా!

అప్పుడు నా తప్పు నేను దెలిసికొని యాతని పాదంబులపైవ్రాలి శాప విమోచనంబునకై ప్రార్థింప గా—

*మ. పటుశాపాహతి యస్మదీశుఁడు భవ । ద్బాణంబు ప్రాణంబులో
క్కట దూలించిననాఁడు గల్గునను మం । గోపోపశాంతిం బరి
స్ఫుటనాదంబున బల్కెనాఁ డది రఘు । క్షోణీశ సిద్ధించె నా
దటనే గ్రిమ్మట నీ నిమిత్తమున గం । ధర్వత్వముం బొందెదన్.

దేవా! ఇచ్చటకు సమీపంబుననే శరభంగమహాముని యున్నవాఁడు. ఆతనిని దర్శింపుము మీకు సర్వశుభంబు లొదవుగాక. నాకు సెలవొసంగుఁడు.

రాము—మంచిది పోయిరమ్ము.

(గంధర్వుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రాము—తమ్ముఁడా! మనముగూడఁబోయి శరభంగుని దర్శింతమురమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు)



ద్వితీయరంగము

పర్ణశాల.

[సీతారామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

రాము—సోదరా! శరభంగమహామునిని దర్శించితిమి మందకర్ణుని జూచితిమి. జటాయువుని గనుగొంటిమి దురాత్ముండగు జంబుకుమారుని వధించితిమి. ఇంకీ యరణ్యంబున రాక్షసులున్నట్లు గాఁదోఁపదు. అందుచేతనే యిచ్చోట పర్ణశాల నిర్మించుకొంటిమి. ఇంక నిచ్చట మన యరణ్యవాసము హాయిగా ముగింపవచ్చును. అప్పుడప్పుడు మునులను దర్శించి వారి యాశీర్వాదములు బడయవచ్చును.

[ప్రవేశము శూర్పణఖ.]

శూర్ప—ఈ యడవిని మునులరీతి సంచరించుచున్నవారిలో నెవ్వరో మదీయ యాత్మజుని జంపియుండిరని విని, వారిని బొలియింపఁ

బోఁగా మునులెల్లరును నాపాదములపై వ్రాలి "తామట్టి కూ్రరకార్య మొనరింపలేదనియు, రామలక్ష్మణులను వారు జంపిరనియు, వారుగూడ మునులవలెనే యుందురుగాని వారిచేత ధనుర్బాణంబు లుండుననియు, వారీపాపకర్మములం గుందురనియు" దెలుపఁగా నెఱుకికొనుచు వచ్చితిని. (ముందునకుఁ జూచి) అదిగో! వారేగావలయును రామలక్ష్మణులు. (నిదానించిచూచి) ఆఁ, అగును. మునులు జెప్పిన యానవాళ్ళన్నియు వీరిచెంతనున్నవి. వీరినిజంపి నాపుత్రుని యాత్మకు శాంతిఁ గూర్చెదఁగాక. (ఇంచుకనడచి మరలమరల జూచి) ఆహాహా! వీరెంత సుందరాకారులు. ఇట్టి నవమోహనాకారులను జంపుటకంటె వీరితో సర్వసౌఖ్యంబులం దేలి వీరివలన వచ్చినవారికంటె సౌందర్యవంతుండగు కుమారుని బడయుటలెస్స. వీరిభావము లెట్లుండునోచూచి యటుపై కార్యాచరణను గడంగుటలెస్స. (సమీపించి) సుకుమారులారా! మీరెవ్వరు?

రాము—సాధ్వీ! మే మయోధ్యాపురాధీశ్వరుని తనయులము.

శూర్ప—రామలక్ష్మణులు మీరేనా?

రాము—అగును.

శూర్ప—(సీతను జూపించుచు) ఈమె నీకేమిగావలయును?

రాము—ఆమె నాయర్ధాంగి. సుదతీ! నీ వెవ్వరిదానవు?

శూర్ప—సురుచిరాకారా!

తే. గీ. చెలఁగి ముల్లోకములుఁగూడఁ । జిటికలోన
రాసి అంపానఁబెట్టిక । రంబు కీర్తి
నందినట్టి లంకాపురీ । నాధుఁడైన
రావణుని సహోదరిని, శూ । ర్పణఖ పేరు

రాము—సంతోషము. నీవు వచ్చినపనియేమి?

శూర్ప—ఇనవంశోద్ధారకా! నేను వేయిమాటలదాననుగాను. నీ
యట్టి సురూప సుందరున కీసృష్టిబొమ్మ భార్యగా దగదు.

తే. గీ. ఈఁడు, జోడైనవారితో । గూడఁబోక
యొచ్చటను దిక్కులేనట్టు । లీ కురూపిఁ
గట్టుకొంటివి యేమిసౌ । ఖ్యంబుగనెను
విడిచిపెట్టుము నిన్నుచే । బడుదు నేను.

రామా! నీవు నన్నుఁ జేపట్టుట కంగీకరించితివయేని నీకు సర్వసౌఖ్యం
బులగు నీయయోధ్యాపురము నీకు దిరిగి లభించును. ఇచ్చటి
కనతిదూరంబున నాకింకొక సహోదరుఁడు ఖరాసురుఁడనువాఁడు
గలఁడు. ఆతఁడు నన్నుఁబట్టి నీ కనేకోపకారము లొనర్చును.
నాయన్న రావణుఁడుసైతము నీకప్రియంబునకు రాఁడు.

* చ. ఇది నను బోలు నే వెదఁగ । నే నినుఁ బొందిన బెక్కురూపులన్
మదనకళాకలాపములు । మందగతిన్ వెలయింతు దీవిమిం
గెద, నిటు సూడుమీ పిదప । గేళికి జొచ్చదయప్పు మత్సుగ
ద్గదమధురోక్తులన్ హితతర । తంబుగ బంధవినోదరీతులన్.

నామాట వినుము. నన్నేలుకొమ్ము.

రాము—శూర్పణఖా! నీదివ్యరూపము నాకక్కజము గొల్పుచునే
యున్నది. కాని నేను నీకుఁ దగినవాఁడనుగాను అదిగాక నా
కేదియో యొకభార్య యుండనేయున్నది. ఈనా సోదరుండగు
లక్ష్మణునిభార్య యిప్పుడిక్కడలేదు పోయి నీ వాతనిని
వరింపుము.

శూర్ప—నీతో సమానులయినవారు ధీరయుద్ధము గోరినను నిల్చె
యందువా?

రాము—అట్లేల పొమ్మందును?

శూర్ప—అట్లయిన మారయుద్ధ మభిలషించిన నన్నేల బొమ్మంటివి?

రాము—లక్ష్మణుఁడు నాకంటె చిన్నవాఁడు. కనుక వానిని జూపించితిని.

శూర్ప—రతికి బిలిచిన చతురత లేదవిన యోబడగా! అట్లయిన నీతో నాకేమిపని. (లక్ష్మణునిదిక్కై) లక్ష్మణా! ఏమందువు? నీవు నాకు మగడవు కాగలవా?

లక్ష్మ—ఇట్టిప్రశ్న నాకస్మికముగా నడిగిన నేమిచెప్పఁగలను అయిన నొక్కటూహింపుము.

చ. సకలజగంబులం దధిక । సత్త్వుఁడనందగు రాముఁడుండఁగ
వికలమతిన్ దలంచి నను । వేఁడెద వేటికి? నన్నుఁగూడుచో
సకియరో! నీవు నావలెనె । సత్యము తప్పదు దాసివౌట హా
రికి, తగదట్లు గావునను । శ్రీయుడి రాముని బెండ్లియాడుమీ ॥

నీవు నాయగ్రజునిఁ జేపట్టినచో నేను నీకుఁగూడ సపర్యలొనరింతును. నీకేది యిష్టమో జూచుకొమ్ము.

శూర్ప—నిజమే! దాసినగుట నాకిష్టము లేదు. రాణి నే గావలయును. రామా! నామఱఁది చెప్పినది సబబుగానున్నది. అందుచే నే నిం కాతనిని వరింపను నీవు నన్ను మాటలతో వరించెదవా? లేక నీభార్యను మ్రింగిన పిమ్మట వరించెదవా?

సీత—(నవ్వును)

శూర్ప—ఏమే నన్నుఁ జూచిన నవ్వవచ్చుచున్నదా? నిన్నిప్పుడే మ్రింగెదఁ జూడుము. (అని మీఁదఁబడబోవును.)

రాము—(అపవారించి) సోదరా! ఈదుశ్చారిణికి బుద్ధివచ్చునట్లొనరింపుము.

లక్ష్మ—చిత్తము

రాము—శూర్పణఖా! నీకంత కష్టమొందులకు? నాసోదరుని వెంట వెడలుము. నీకు సుకరంబగు మార్గము జూపించును.

శూర్ప—ఓ. అట్లయిన నింక గావలసిన దేమి? మఱదీ! రమ్ము (లక్ష్మణునితో నిష్క్రమించును.)

సీత—మనోహరా! ఈరాక్షసాంగన స్త్రీభూషణంబులగు సిగ్గుభిడియములు విసర్జించినదే.

రాము—మనోహారిణీ!

కం. లంకను బుట్టినవనితలు
శంకాటంకములు లేక । జారిణులై ని
శ్శంకగ దిరుగుచునుండుట
పంకజముఖి వారి కెందు । పరిపాటి సుమీ.

లక్ష్మ—(ప్రవేశించి) అగ్రజా! ఆ దురాత్మురాలి ముక్కుచెవులుం గోసి వికృతాకారిణిగా నొనర్చితిని. ఆమె రోదన మొనర్చుచు బోయినది.

[తెరలో]

కం. శూర్పణఖా! నిన్నీగతి
కార్పణ్యముతోడ జేయ । గడగినవారిన్
గూర్పరములు దుంచెద నీ
కర్పించెద నీక్షణంబ । నడలకు మింకన్.

ఓమిత్రులారా! రాక్షసపరిభృతులారా! రండు. రండు. రామలక్ష్మణులతో బోరొనర్చి వారిని దుదముట్టింతము.

రాము—లక్ష్మణా! వింటివా! శూర్పణఖాపరాభవమును విని రోషకషాయితాత్ముండై ఖరుఁడు దూషణాదులను సహాయంబుగా దీసికొని వచ్చుచున్నాడు. నేనరిగి వారి నుక్కడగించివచ్చెదను. నీవు మీావదినను భద్రముగాఁ జూచుచుండుము.

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

## తృతీయ రంగము.

పరివేశము:—పర్ణశాల సమీపమున సీతారాములు.

రాము—దేవీ! ఇంక మన మీ యరణ్యమున నున్నంతకాలము రాక్షసు లీప్రాంతమునకు రారు వారి కాయువుపట్టు లనందగు ఖరదూషణాదులు నాచే నిహతులైరి. వారిసైన్యంబు లన్నియు గతించిపోయినవి మనలక్ష్మణునిచే బరాభవింపఁబడిన శూర్పణఖ యెందో పాఱిపోయినది.

సీత—దేవా! ఈరాక్షసుల జన్మస్థాన మెచ్చట?

రాము—లంక.

సీత—అచ్చట జన్మించినవారెల్ల రీమచ్చువనే యుందురా?

రాము—అగును. వారెల్లరును నరమాంసభక్షకులే.

లక్ష్మ—(ప్రవేశించి) అగ్రజా! ఫలపుష్పములం దెచ్చి పర్ణశాలయందుంచితిని.

రాము—మంచిపని జేసితివి

సీత—(ఒక ప్రక్కకుఁ జూచుచు)

16 వ అనుబంధము.

మనోహరా! కంటిరా! యీవింతమృగమును. (అనిచూపుచు)

తే. గీ. రోహిణాచలమేను మే । రువునుగూడి
యురుతరంబగు సత్ప్రభ । లూనినటుల
మించి క్రొక్కారుచుక్కల । మెఱుగుటొఱపు
గలిగియున్న కురంగంబు । గనుఁడి యదిగొ.

ఓహోహో! ఈసువర్ణచ్ఛాయ నేత్రానందకరంబుగా నున్నదే. మనోహరా! ఈహరిణంబును బ్రాణంబులతోఁ బట్టుకొని నాకొసంగి చెలికత్తియలు లేనిలోపంబును దీర్పఁ గలందులకు వేడుచున్నాను.

రాము—తరుణీమణీ!

తే. గీ కోరిమెఱుఁగవు మది నెట్టి । కోర్కెయున్న
నింతకాలంబునకుఁ గోరి । తింపువదన!
ప్రాణములతోడ లేడిని । బట్టి యిపుడె
నీకొసంగెద నరణంబు । నిశ్చయముగ.

(క్షణమాత్రి) మిం దేయుండుము. సోదరా! లక్ష్మణా!! నీవదినగారి కోరి
క వింటివిగదా? ఆమె యాశయమును దీర్చుట మనకు ముఖ్య
కర్తవ్యము. కావున నేను వెడలి యాలేడిని బట్టితెచ్చెదను.
నీ విందే యుండుము.

లక్ష్మ—అగ్రజా! తమరుగూడ నట్లేయనిన నే నేమనంగలవాఁడను?

17 వ అనుబంధము.

తే, గీ. పసిడిలేడంచు భ్రమపడ । వలవదిప్పు
డనఘ! నాచేఁ బరాభవ । మందినట్టి
శూర్పణఖచేయు మాయగా । జూచుచుంటి?
గానిచో లేడి కీరూపు । గలుగఁటున్నె?

రాము—సోదరా!

తే. గీ నీతలంచిన యట్లిది । నిక్కమైన
యసురమాయయే యైనచో । నట్టిమ్రింతు
గాక యుండిన దానిని । గదిసిపట్టి
జనకజ కొసంగు టెట్లైన । మనకు మేలె.

కావున నేను వచ్చువఱకును నీమెను జూచుచుండుము. (నిష్క్రమిం
చును.)

సీత—(రాముఁడు వెడలిన దిక్కుగాఁ జూచుచు) మఱదీ! ఏమది?
ఆపసిడిమృగము మీయన్నగారికి చిక్కియుఁ జిక్కనట్లు చెంగు
చెంగున గంతులిడుచు నెట్లు త్రిప్పలు బెట్టుచున్నదో చూడు

ము. అయ్యయ్యో! నిష్కారణ మా త్మేశ్వరుని బాధించితిని గదా? (మరలఁ జూచి) ఆఁ; ఆఁ; మఱిది! ఇంతలోననే నేమ యియుండురు? అయ్యయ్యో! లేడిగాని మాయన్నగారుగాని కాన్పించుటలేదే? ఏమిది?

[తెరలో]

హా! లక్ష్మణా! లక్ష్మణా!!

సీత—(భయముతో) ఆఁ; ఆఁ; లక్ష్మణా! ఆయార్తారవము నీయన్న గారిదే గదా? వేగ సహాయ మరుగుము.

శా. వింటేలక్ష్మణ! రామునార్తరవమే । వీ తెంచెడిన్ లేడికై
గొంటిన్ బోయిన నీసహోదరున కే । దో ముప్పువాటిల్లియే
యుంటన్ సత్యము మాయలేడి యగునే । మో నీవెయన్నల్లు చె
న్నొంటన్ బోగదవన్న! పోయియతనిన్ । వేగంబె కాపాడుమా!.

లక్ష్మ—అమ్మా! మాయన్నగారిట్టి క్షుద్రక్రిడరక్కసాధములచే నొంపఁబడుదురా? నీకీవెఱ్ఱిసందియమేలనమ్మా! ఆమహాత్మున కేవిధమైన యాపదయురాదు. భయంబుడుగుము. మాయన్నగారి బాణాగ్ని కాకనకమృగం బసువులందొఱంగుచు నట్లార్చియుండును. అంతియేగాని యాయాక్రందనము మాయన్నగారిది గాదు.

సీత—లక్ష్మణా!

తే. గీ పడిఁదిమృగమ ర్చుటన నసం । భ్రమముగఁదె
యార్చెఁబో 'లక్ష్మణా! సోద । రా!! సహాయ'
మనుచు నిన్నుబిల్చెనె? నిజ । మతని కేవొ
యిడుమ లొదవెను రక్షింప । వెడలుమన్న.

లక్ష్మ—వదినా!

* కం. దెప్పర మప్పౌరుషాగ్నిని
కెప్పాటును గలుగనేర । దెందును నోహో
నిప్పుఁ జెదలంట నేర్చున
తప్పదలఁచి తీ విశేషల । దలఁకెద వమ్మా!

సీత—లక్ష్మణా! కొంచెమాలోచింపుము. కార్యము మించినచో లాభము లేదు సుమా! వేగ వెడలుము. నీయన్నగారిని దోడ్కొని రమ్ము.

లక్ష్మ—వదినా! నామనవి నాలింపుము అది యసురమాయ గాని మరి యొకటి కాదు.

సీత—లక్ష్మణా! ఇదివఱ కెన్నఁడును నామాట జవదాటియెఱుంగవు. నేఁ డేదియో నీకు విపరీతపుబుద్ధి పుట్టినట్లున్నయది. లేకున్న నీయగ్రజు నార్తారవము వినియు నీ విట్లందువే.

క. దిగులందియేనుఁ బనిచిన
మగుడం జెప్పెదవుగాని । మది నించుకయుఁ
బెగడవు సవతుల కొడుకులు
పగవారని నీతివిదులు । పలుకుట బొంకే

పాపాత్మా! నీయగ్రజుని యార్తారవము వినియు గాపాడుటకై వెడలకుంటివి. ఆమహానుభావుఁడు నిష్కారణముగా నిన్ను నమ్మిమోసపోయెను. అయ్యయ్యో! తనయార్తారవము విని సహాయమరుదెంచుచుందువని కొండంత యాసతోనున్న నీసహోదరుఁడు తుట్టతుదకు నిరాశాతప్తహృదయుండై నిస్సహాయుఁడై మరణింపవలసినదే. నీవు నీయన్న మరణమును కాంక్షించితివా కలుషహృదయా!

చ. అనుజుఁడనంచు మున్నొక మ । రాత్ముడు రాజ్యవిభూతియెల్లఁ జే
కొని యటు జేసె నీవుఁగడుఁ । గ్రూరత రాముని చావు వేఁచితే

మసఁగల నింకనిన్నుఁ గుటి । లాత్మక! నాకని కాదినాఁడవే
నినుగయికొందునే సలువు । నీరయి కూలెదఁ గాక దుర్మతీ.

లక్ష్మ—(సీతపాదములపై వ్రాలి యేడ్చుచు) జననీ! నీకిట్లనుట భావ్యమా! ఇంతకాలంబునుండి చూచుచుంటివి నాహృదయమెఱుంగవా తల్లీ! నీయెడల నేను వేఱుభావము దాల్చుదునా? నీవే నాతల్లివని- గురుపత్నివని- పరదేవతవని- భావించుకొనుచున్న నన్నిట్లాడవచ్చునా? నీనిందావాక్యములు నన్నంతకంత కలయించుచున్నవి. నాయన్నగారి యాజ్ఞ మీరజాలకున్నాఁడను. నీ కర్ణకఠోరవాక్యపరంపరలు వినఁ జాలకున్నాను. అమ్మా! ఏమైనఁ గానిమ్ము. నేనుబోయివచ్చెదను. మీరు మాత్రి మీపర్ణశాలవిడచి బయటికిపోకుఁడు. మాయన్నగారిని దోడ్కొని క్షణములో వచ్చెదను. (అని నిష్క్రమించును)

[రెండవవైపునుండి సన్యాసివేషముతో రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రావ—జయ్ శంకర్.

సీత—మునికులతిలకా! నమస్కారము.

రావ—మనోరథ సిద్ధిరస్తు.

మ. నవలా! యెవ్వరిదాననీవు? యభిధా । నంబెద్ది? నీనాథుఁ డే
డీ? వనంబంగున నేల నీయునికి? యి । ట్లీ వెంతయో వంతతో
నవయంగాఁ బనియేమి? నీహాయలు నీ । నవ్యాకృతింగూడ నో
యువతీ! కానలపాలుసేయఁగతమే । మో వేగ వాక్రుచ్చవే?

సీత—తాపసవర్యా! నేను మిథిలాపురాధీశ్వరుని తనయను. నాయభిదానము సీత. అయోధ్యాపురాధినాథుఁడగు దశరథేశ్వరుని కోడలను. శ్రీరామచంద్రుని యర్ధాంగిని. మామామగారి పంపున మేమరణ్యావాసము జేయవచ్చితిమి. ఒక కనకమృగంబున

కై నానాథుఁ డరిగెను. అన్నగారిని దోడ్కొనిరా మామణిది లక్ష్మణుఁ డరిగెను. స్వామీ! ఇంపుగూర్చుండుము. వారువచ్చి మిమ్ము సత్కరింతురు.

రావ—(తనలో) ఓహో! ఇదియే మంచిసమయము. (ప్రకాశముగా) బాలా!

* చ. వినువిని కోర్కెలుల్లమున । నెక్కొన ధైర్యము నుజ్జగించి యే వనితలపొందు నెల్లకిట । వచ్చితి నచ్చెరువారు నీవిలో కనములు గాముబాణముల । కంటె మనంబున దూఱజొచ్చె నం గన ననుఁ దక్కనేలికొనఁ । గాదె ముదంబున వేయునేటికిన్.

నావృత్తాంత మీ వెఱుంగ వేమీ విను తెల్పెద.

*చ. కమలభవుండు తాత గుణ । గణ్యుఁడు విశ్రవసుండు తండ్రి హే మమయవినూత్నరత్నమయ । మండితమాత్మపురంబులంక వి క్రమము త్రిలోకభీకర మ । ఖండ శుభాకరమైన దైత్యరా జ్యమునకు నేను భర్తఁ బటు। శౌర్యుఁడ రావణనామధేయుఁడన్

ఇదిగాక! నానిజరూపుజూడుము. (అని నిజరూపుజూపును.)

సీత—హా! (అని మూర్ఛిల్లును)

తెర వ్రాలును.

తురీయరంగము.

[జటాయువు పడియుండఁగా దెర లేచును]

ప్రవేశము:— రామలక్ష్మణులు.

రాము—(విచారముతో)

18 వ అనుబంధము.

*శా. అన్నా! నన్నుబలాఢ్యుఁ గానెఱుఁగుదీ । వన్నాతిశోకార్తిమై నిన్నుంబల్కిన నింతనంతనయినన్ । నీవుండవై లింతకుఁ

నన్నుఁ నిన్నును వేఁచు దానవులు మా । నంబూనమైపోవఁగా
నన్నాతిన్ గొనిపోవకుండుదురె హా ! । యయ్యో కదుం(గ్రూరతన్.

తమ్ముఁడా ! చూచితివా! ఈయరణ్యంబెల్ల గాలించినను నాజానకి జాడ
గానవచ్చుట లేదే? యింకేమిచేయుదును.

లక్ష్మ—(విచారముతో) అగ్రజా ! నేనేమిచేయంగలను. అమ్మహాసా
ధ్వి నాపైఁ బ్రీతియకాలనను ద్దీప్త రాముగ్రింబైన రుమ్రినివిధంబు
న మండిపడుటఁ జేసి యామెను విడచివచ్చితిని. ఇంతలో నింత
మునిగె. మనమధిక ప్రయత్నంబున నదులు, గిరులు, కమలాక
రంబులు, వనంబులు, గూడ గాలించి వేచితిమి. ఆతల్లిజాడ గాన
రాదయ్యె. ఇంకేమిచేయంగలము. ఇంకను సిల్లేనెమకుదము.

రాము—తమ్ముఁడా ! చేయుటకేమున్నది?

క. ప్రాణములకంటె హెచ్చగు
ప్రాణేశ్వరి బాసి పుడమి । బ్రిదుకుటకంటెన్
హీనము గలదే యింకా
ప్రాణము బాయుటయె నాకు । భద్రం బనుజా !

అయ్యయ్యో !

ఆ. వె. గరళకంఠుచాప । ఖండన జేసిన
జెట్టియనుచుఁ బెండ్లి । జేసినారు
క్రూరదనుజమాయ । కోడి నాప్రియసతిఁ
బ్రోవలేని వట్టి । మూర్ఖుననైతి.

సోదరా ! ఇట్టి సమయంబున నేను నాప్రాణములు విడచుటకు నస్వ
తంత్రుఁడనై యున్నాను.

ఆ. వె. కదియనాలగేండ్లు । వనవాస మొసరింపఁ
బ్రీతినఁ జేసి యిపుడు । స్వర్గపురికి

ఖ్యాతినముఁగియకుండ । రానేల రా యని
జనకుఁ డలుగు ననుచు ।। సంశయింతు.

లక్ష్మ—అగ్రజా! నీయట్టి ధీశాలు లిట్లు కలంజెల్లునా? నావాక్యములిం చుకాలింపుము. మనచే మొన్న పరాభవింపఁబడిన శూర్పణఖ యే మనపైనున్న యక్కసుదీర్చికొనదలంచి మావదినెగారిని ప్రుచ్చిలి యుండును.

చ. అసురులదుర్నివాడి న్మనల । నట్టివధింపఁగ శక్తిలేక, యా
యసుర పడంతి యే యిటు ధరా । త్మజదొంగిలినంత యామెకై
యసువులు బాయుదీ రనుచు । నాత్మదలం చిటు మాయఁజేసి రా
క్షసులకు మేలుగూర్పఁగల । సాధనమిందు దలంచి యగ్రజా!

ఇట్లామె యాలోచించి తనహితు నొక్కని మునుముందు మాయలేడిగా మనచెంతకు బంపెను. మన మా మాయలేడి ననుసరించిపో యితిమి. సమయమునకై నిరీక్షించియున్న యాదుష్టాంగన నిర్భ యముగా మావదినెగారిని దోఁకొనిపోయియుండవచ్చును. ఎట్లో ప్రయత్నముమీద మనమారక్కసిని గనుఁగొని దాని మదమడంచి భూమిజం దెచ్చుట పౌరుషేయముగాని యిట్లు విచారించుట పౌరుషేయ మగునా?

రాము—సోదరా! నీవనినదిగూడ కొంత సత్యమైయుండవచ్చును. దను జులుమాయ లొనర్చుటయందఖండప్రజ్ఞాధురీణులు. వారిమా యావాగురులం జిక్కనివారుండరు. వారుపలుమాయ లొనర్చి శత్రునాశన మొనరించుకొనుచుందురు.

క. ఆపలలాశని యుండెడి
పాపపుగుహ యెందుఁగలదొ? । వసుమతిపట్టిన్
యేఁగగిది నెందుదాచెనొ?
లోఁకను భూజాత నరసి । దొరకునొ? లేదో?

లక్ష్మ—(ముందునకుఁ జూచి) అగ్రజా! మరల నిదియొక చిత్రము.

తే. గీ ఈ నిశాచరుఁ డెవ్వఁడో । యెదురు వేచి
మనల నపమార్గమునఁ బెట్ట । మదినలంచి
పక్షిరూపంబు దాల్చి యా । పక్క నదిగో
కాటికాపరివోలెనే । గాచియుండె.

మనము చూచినను నిదియొక విహంగమని యనుకొని విడచివేయుదు మని యెడి యాశయముతో నిచ్చోనున్న వాఁడు. ఇది యు మా యాకురంగంబు చందంబయియుండును. (అని విల్లెక్కు-వెట్టి) ఓ రోరిదనుజాధమా!

మ. జనకక్ష్మాపతిపుత్రియేది? యెచటా । సాధ్వీమణిన్ దాచితో
గన వేగంబుగ దెల్పు? శూర్పణఖ ని । క్కంబైనవానం బెనో
చెనఁటీ! చూపుము ఆమె నిప్పు డెచటన్ । జెండాడగావచ్చునో
విశిపింపన్ వలె నీవు లేనియెడలన్ । వేవేగమే దంతురా!

జటా—ఓ! ఆర్తజనశరణ్యా! శ్రీరామా! శరణు. శరణు నేను జటాయువను ప్లవంగంబును. నేను సంపాతికి సోదరుండను గాని రాక్షసుండను గాను. నీజనకుండగు దశరథేశ్వరున కిష్టసఖుండను. మే మొకరినొక రెన్నఁడును మరచుట లేదు. నావృత్తాంతము మీతండ్రిగారు వివరించియే యుందురు. సీత వృత్తాంత మంతయు నాకు దెలియును. మీ రింటలేని తరుణంబున లంకాపురాధినాథుండు వచ్చి, తన దశశిరంబులం జూపి, యామెను బెదరించి, యామె మూర్ఛిల్లగనే తనరథంబుపై నిడుకొని పోవుచుండెను. కొంతవడి కామె మూర్ఛదేలి "దశరథేశ్వరుని కోడలి కిట్టి పరాభవము తటస్థింప రక్షించువారు లేరా!" అని యాక్రందన మొనరింప నేను వెడలి యాదైత్యాధమ్ము నడ్డి యాతనితో బోరితిని. రావణుని యష్టకష్టంబుల

పాలుపఱచితిని. ఛత్రంబు గూల్చితిని. చాపము ద్రుంచితిని. గుఱ్ఱములను జంపితిని. విరథుం జేసితిని. కాని యేమిలాభము? ఆ క్రూరరాక్షసుఁడు నా యాయువుపట్టెఱింగి నా పక్షంబులఁ ద్రుంచెను. దానితో బడిపోయితిని. శ్రీరామచంద్రా! నీ కీ విషయంబు తెలియఁగించుటకే యింతవఱకుఁ గొనయూపిరితో నుంటిని. దేవా! నా విధ్యుక్తధర్మమును నేను నిర్వర్తించితిని గాని నా ప్రయత్నంబున బూర్ణఫల మందనైతిని రామా! రా-మా!—నా-ప్రాణములు పోవుచున్నవి.—నా—క—గ్ని—సం—స్కా—ర———(చచ్చును)

రాము—(విచారముతో) లక్ష్మణా!

చ. ఘనమగు రాజ్యముఁ విడచి । కాన వసించుట కాత్మ గుంద, నా
జనకుఁడు చచ్చిపోయెనని । స్వాంతమునన్ బెగడొంద, సీ
తను దనుజాధముం డొకఁడు । దాచుటగూర్చి విచారమొంద, నీ
యనఘుఁడు నన్నుగూర్చి రణ । మందున గూలుట కెంతొ బొక్కెదన్.

లక్ష్మ—అగ్రజా! విచారించి చేయునదేమున్నది ఈ మహానుభావుఁడు కోరినట్లగ్నిసంస్కార మొనరించి సీతాన్వేషణమునకై పోదము రండు.

రాము—మంచిది (అని రామలక్ష్మణులు పక్షి నెత్తుదురు.)

(తెర వ్రాలును)

## పంచమాంకము.

స్థలము:—ఆ యరణ్యమందే యింకొక భాగము.

[కబంధుఁ డొకచో గూర్చుండి యుండును.]

కబం—(ఇటునటు జూచి) అదిగో! ఎవ్వరో యిరువురు మానవులు వచ్చుచున్నారు వారి నీపూట కాహారముగా గొందుఁగాక.

(అని చేతులు చాచి రామలక్ష్మణులను బట్టుకొని దగ్గఱకు దీయుచున్నాఁడు)

లక్ష్మ—అగ్రజా! అగ్రజా! మరల మనల నెవ్వఁడో దుష్టరాక్షసుఁడు బట్టుకొని మ్రింగ యత్నించుచున్నాఁడు. మన మిరువురమును గూడ వీనికి జిక్కిపోయితిమి వీఁడు నిరాయుధుఁడని సంశయింపవలదు. మీరు రాభుజము ఖండింపుఁడు. నే నీ భుజము తెగనేసెద.

రాము—సోదరా! కానిమ్ము (ఇరువు రొక్కమారు నఱకుదురు.)

కబం—హా! హతోస్మి. హతోస్మి స్వామీ మీ రెవ్వరు?

లక్ష్మ—అయోధ్యాపురాధీశ్వరుం డగు దశరథేశ్వరుని తనయులము. రామలక్ష్మణు లను వారము.

కబం—దేవా! శ్రీరామచంద్రా! నమస్కారము

*సీ. దను వనియెడి నామ । మునఁ బ్రవర్తిల్లుచుఁ
గాంతిఁ జంద్రునిఁ, బ్రభాకరునిఁ దేజ
మునయందుఁ, బాకశా । సను భోగమునఁ బోలు
నితఁ డనఁ గీర్తి వ । హించుతు నజునిఁ
దపమున మెప్పించి । తత్కృపఁ జిరజీవి
తత్వమును బీరంబుఁ । గామరూప
కత్వము నేఁ గాంచి । క్రౌర్యపరుండనై
హింస గావ్చుచుఁడనై । యెపుడు సమద
లీలఁ దిరుగుచు నొక్కచో । స్థూలశిరుఁడ
నంగ నొకముని తపసు సే । యంగ నచటి
కేట్టి వికృతాకృతిని దాల్చి । యేఁగి యతని
యెదురఁ దిరుగ నాసంయమి । యెంతో యలిగి.

* కం. ఈరూపము కడుఁ బ్రియపడి
గారవమునఁ దాల్చి వేడ్కఁ గ్రాలెద విదె నీ
కోరిక సఫలతఁ బొందఁగ
నోరి దనుజ యింక నిట్లయుండుమి యనిమెన్.

నే నాతని శాపంబునకు భయపడి నా తొంటిరూపంబు ధరించి శాపవిమోచన ప్రాప్తి యెపుడగు నని ప్రార్థింప "రామలక్ష్మణులు నీకరయుగము ఖండించినపుడు నీశాపము దీఱునని యెను. తరువాత వారే నీదేహమును దగ్ధం బొనరించిరయేని నీ పూర్వాకారము నీకు వచ్చును. నీతెలివియు వచ్చును" అని యానతిచ్చెను. అటు తరువాత నే నా వికృతాకారముతోడ నే మహేంద్రునిపై రణమొనరింపఁ బోయితిని. ఆతఁడు తన వజ్రాయుధముతో నన్ను గొట్టెను. ఆ దెబ్బతో కంఠంబును, శిరమునుఁ గాళ్ళును బొట్టలోపల జొరబడెను. నాఁటినుండియు నిట్లుంటిని. నేఁటికి మీవలన శాపవిమోచనంబు గంటిని. మహాత్ములారా! నాకు సెలవొసంగుడు.

లక్ష్మ—అగ్రజా! ఈతఁడు దనుజుఁడుగదా? ఈతనివలన మన కారావణునియుదంతం బేమైనఁ దెలియునేమో తెలిసికొనుట మంచిది కాదా ?

రాము—అట్లనే చేయుదము. మునిశాపప్రాప్తి కీతనిశరీరమును దగ్ధముగావింపవలయును గదా? రమ్ము. శరీరము దగ్ధమొనరింతుము.

(అందఱును నిష్క్రమింతురు.)

[మరల సుందరాకారుండగు కబంధునితో
రామలక్ష్మణులు ప్రవేశింతురు.]

కబం—పూజ్యులారా ! మీకరుణాకటాక్షమున నా స్వరూపము నాకు వచ్చినది. ఏమిసెలవు.

లక్ష్మ—ఓయీ! మేమింటియొద్ద లేనపుడు మావదినగారిని కూర్చొనియుండగు రావణుఁడు దొంగిలించుకొని పోయెను వానిజాడ నీవేమైన నెఱుంగుదువేని మాకు దెల్పుము.

కబం—స్వామీ! ఆతఁడు మిగుల బలవంతుఁడు. లంకాపురాధీశ్వరుఁడు. ఆతఁడు నరవానరులచేగాక తక్కినవారిచే మరణములేకుండ వరములు బడసెను. ఇచ్చటికనతిదూరంబున ఋష్యమూకపర్వతం బున్నది. ఆపర్వతముపై సుగ్రీవుండను నొకకపిపుంగవుండు తన యనుచరులతో నున్నాఁడు ఆతని సహాయము గోరుఁడు.

రామ—ఆతఁ డాపర్వతముపై నుండనేల?

కబం—వాలిసుగ్రీవులనువా రిరువు రన్నదమ్ములు. విశేష బలశాలులు. ఒకనాఁడు మాయావియను రాక్షసుని జంపుటకై వాలి వెడలెను. అనుజుఁడు వెన్నంటెను. వానిబాఱి దప్పించుకొనలేక యాతఁడొక గుహలో దూరెను. ఆగుహాద్వారమున సుగ్రీవుని గాపుంచి వాలి గుహాలో బ్రవేశించెను కొన్నిమాసముల వఱకాతఁడీవలకు రాలేదు అగ్రజుఁడు మరణించినట్లు తలంచి సుగ్రీవుఁడు కిష్కింధకు వచ్చి, వాలికుమారుండైన యంగదుని రాజుఁజేసి తాను ప్రతినిధియై రాజ్యమేలుచుండెను.

రామ—ఓహాహా! సుగ్రీవుని బుద్ధి మెచ్చుకొనఁదగియున్నది. అటుపిమ్మట నేమిజరిగినది.

కబం—తరువాత వాలి మాయావిని జంపి యీవలకు వచ్చి ద్వారముచెంత తమ్ముఁడు లేకుంట కలిగి కిష్కింధకువచ్చి దర్బారులో తమ్ముని బరాభవించి, సత్యాసత్యము లరయక, తమ్మునొక్కని నూరువెడలనడచి యాతని భార్యను జేపట్టెను. తమ్ముఁడు జీవించియున్నచో నెప్పటికైన ముప్పువాటిల్లునని యాతనిజంప

వలయునని తలఁచి వేచియుండెను. ఈసంగతి విని యాతఁడా పర్వతముపై డాఁగెను.

రాము—వాలి మఱి యీప్రదేశము గనిపెట్టలేఁడా ?

కబం—కనిపెట్టగలఁడు కాని యీమిలాధము సుగ్రీవుని దరిమివైచిన కొంతకాలమునకు దుందుభి యను రక్కసిని వాలి చంపి కాలితో దన్నివైచెను. అట్లు పాదంబుచే త్రోపువడిన యాశరీరము ఋష్యమూకపర్వతముపై దపంబొనరించుకొనుచున్న మతంగముని యాశ్రమములో బడెను. అద్దాని కమ్ముని యలిగి దీనినిక్కడ వేసినవాఁ డీపర్వతముపైకి వచ్చెనేని వానిశిరము సహస్రభిన్నమై పోవుఁగాక యని శపించెను. ఆకారణమున సుగ్రీవుని కచ్చట క్షేమమున్నది.

రాము—బాగు. బాగు.

కబం—దేవా! మీరిరువురును గొంచెమించుగా సమానమగు దుఃఖములో నున్నారు. ఒకరికొకరు సహాయము మొనరించుకొనుట కిదియే తగినసమయము. అదిగాక భుజబలంబున వాలి యెక్కువ వాఁడేగాని యధర్మాత్ముఁడు. సుగ్రీవుఁడు ధర్మపథానువర్తి. కావున యాసుగ్రీవుని మీరు రక్షించి యాతని సహాయమును మీరు దీసికొనినచో రావణుని గ్రహింపవచ్చును. మీవలన నాతఁడు దరించును.

రాము—దనూ! మాకు మంచివిషయ మెఱింగించితివి. నీవు వెడలుము. మేము వెడలి సుగ్రీవుని గలిసికొందుము.

కబం—చిత్తము. (నిష్క్రమించును.)

రాము—తమ్ముఁడా! మనముగూడ వెడలుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

ఇది తురీయాంకము.






శ్రీ రామచంద్ర.

# సంపూర్ణ రామాయణము



## పంచమాంకము.



లంకాదహనము

ప్రథమరంగము.

స్థలము:—ఋష్యమూకపర్వతము

[సంతోషముతో హనుమంతుఁడు ప్రవేశించుచున్నాడు.]

హను—"పెద్దవారల యుపదేశము పెరుగుటన్నముతో సమాన" మనువాక్యము సత్యదూరము గాదుగదా? నా బాల్యంబున నా జననియగు యంజనీదేవి నన్నుఁబిలిచి "కుమారా! సుగ్రీవునే కొలువుము ఆతని పూర్వపుణ్యవిశేషంబున నయోధ్యాపురాధీశ్వరుండగు శ్రీరాముని సహాయం బాతనికి దొరకును. శ్రీరాముఁ డవతార పురుషుఁడుగాని మానవమాత్రుఁడు గాఁడు. నీవుకూడ శ్రీరాముని బంటువై చిరకీర్తి గడించుము" అని నుడివినది ఆహాహా! నేటికి నాజన్మధన్యమైనది.

19 వ అనుబంధము.

నాతల్లిగారి యాశీర్వచన మింతకాలమునకు ఫలించినది. నేటికాలమునకు నాజన్మ తరించినది. శ్రీరామచంద్రుని దర్శనమైనది. ఓహోహో! ఆదివ్యమూర్తిని సేవించు భాగ్య మింతటి

వారికి లభ్యమగును శ్రీరాముఁ డవతారపురుషుఁడు గాని సామాన్యుండు గాడని యెఱింగియు వాలిని జంపగలఁడో లేడో యను సంశయంబున సప్తతాళ వృక్షంబులొక్క బాణంబునఁ గూల్చునని కోర నామహాపూరుషుం డట్లే ఛేదించెను. ఆమహామహుని శక్తిసామర్థ్యంబు లప్పుడెఱింగి తనయగ్రజుండగు వాలిని సుగ్రీవుడు ద్వంద్వయుద్ధమునకు గమ్మని పిలచెను. రోషకషాయతాత్ముండై వాలి సుగ్రీవుఁ దాకెను. ఆమహాసమరంబున సన్నదమ్ము లిరువు రొక్కపోలికనే యుండుటంబట్టి వాలిని గుర్తింపలేకపోయి శ్రీరాముఁడు వధింపకూరకొనిన కారణంబున మరల సుగ్రీవపరాభవమైనది. రెండవమారు సుగ్రీవున కొక కంఠహారమువైచి శ్రీరాముఁ డనికి బంపించెను. ఆ యుద్ధంబున వాలి తప్పక గూలితీరును. ఆరణ మెట్లుసాగుచున్నదో త్వరితగతి నేనరిగి చూచెదఁగాక.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.



ప్రథమరంగము:

స్థలము:—అరణ్యము.

[వాలిసుగ్రీవులు శరములతోడను, రామలక్ష్మణులు చెట్టుచాటునను నుండఁగాఁ దెర లేచును.]

సుగ్రీ—ఓరీ! దుర్మదచిత్తా!

చ. అనుజుఁడటన్న ప్రేమ లవ। మైనను లేక సభాస్థలంబు నం
దునను బరాభవించితివి। తోయరుహాక్షిని నాదు భార్య నే
గని వరియించి తట్టితిను। కాలునివీటికి బంపకుండ నే
మని యిఁక నూరకుందు నటు। లైన పరాభవ మెట్టులారెడుఁగా.

ఓ భ్రాతృద్రోహీ!

సీ. లాంగూలమునఁగట్టి । లంకేశ్వరుని సప్త
సంద్రంబులను ముంపఁ । జాలితినని
మాయాసురునిఁబట్టి । మర్దించి ఘనకీర్తి
సంపాదనము జేయఁ । జాలితినని
దుందుభిరక్కసిఁ । ద్రుంచి, కాలునదీటి
నరిగ యోజన మంపఁ । జాలితినని
భ్రాతృభావమువీడి । బాధించి నన్ను రా
జ్యమునుండి గెంటఁగాఁ । జాలితినని
అనుజు వెడలించి యాతని । యాలి నెలమి
నరసకీడ్చించి వరియింపఁ । జాలితినని
గర్వపడఁబోకుమీ మూరు । కదనమందు
నిన్ను వధియించి తీరెద । నీచహృదయ!

వాలి—ఓరీ! పశుప్రాయుఁడా!

ఉ. మాటలకేమిగొప్ప! అను । మానములేక మె న్నిగతులో
నోటికివచ్చినట్లు మది । నెవ్వగ బల్కగవచ్చుగాని యీ
మాటలు జెప్పినట్లె నను । మ్రుందఁగఁ జేయుటటంచు నెంచితే
పోటరి! రమ్ము రమ్ము రణ । భూమికి నిన్ బలియిత్తు నిప్పుడే.

ఓ వాచాటా! నిన్నింక ప్రాణములతో బోనీయను. (అని బాణమును విడుచును. వాలి విడచును. రాముఁడు బాణము విడచును. వాలి గూలును.)



## ద్వితీయరంగము.

[అంగద, జాంబవంత, హనుమంత సుషేణ నలు ప్రవేశము.]

జాంబ—యువరాజా! ఇట్లు విచారించిన నేమిలాభము ?

ఉ. సోదరుఁ డన్న ప్రేమ మది । సుంతయు లేకయె, నిందుకోల్వులో
మోది, పరాభవించి, వన । భూములకుం వెసఁ గెంటివైచి, యా
సోదరు భార్యనే వలచి । సూరిజనావళి కెల్ల ద్వేషియై
యీధర వర్ధిలం గలఁడె । యెంతటి బాహుబలాఢ్యుఁడైననుం.

నిజమునకు నీజనకుఁ డెంతటి మహాపాత్కుఁడైనను నీవాక్యంబులకు మాత్రము నిజముగా గర్వింపవలసియున్నది. అది యేమందువా?

తే. గీ. ధరణి నవతారపురుషుఁడై । దనరుచుండె
దశరథాత్మజుచే మృతిఁ । దవిలెఁ గాన
లేదు జన్మంబు ముక్తికి । లేదు లోటు
అట్టివానికై వెగ్గల । న్యాయమగునె ?

హను—అంగదా! వయోవృద్ధుండైన జాంబవంతుని మాటలు విశ్వసింపుము. విచారమును విడచి ముందుకార్యమును జూడుము.

అంగ—జాంబవంతా! ఎట్టివానికైనను పితృమరణము విచారము గలిగింపక పోవదు కాని శ్రీరాము బాణనిహతుండైన నాజనకునిఁగూర్చి నేను చింతించుటలేదు కాని శ్రీరాము నానతిపై సీతాన్వేషణకొఱకై బయలుదేఱితిమి. సీతాన్వేషణ మొనరించి యామహాసాధ్వి యునికి యూథ కర్తవారిజాతమునకు నివేదించి యాతని యనుగ్రహపాత్రుండను గావలయుననుకొన్న నా యాశయమునకు విఘ్నము వచ్చినది. స్వయంప్రభా గుహాముఖంబున నేనాఁడు విడచితిమో యానాఁడే నాయాశయము ముడుగఁటినది. ఇప్పు డనవర్ధుఁడనని వెనుకకు వెడలితిమేని సుగ్రీవుఁడు బ్రదుకనీయఁడు. సుగ్రీవునిమాట యటుండనిండు.

తే. గీ. ఏ మొగముతోడఁ బోదు శ్రీరాము దరికి
పోయి, ధరణిజ గాన్పింప బోదటంచు
సిగ్గు లవమైన లేకుండఁ జెప్పఁబెట్లు
చెప్పితిని బొమ్ము వారు రక్షింతురొక్కొ.

20 వ. అనుబంధము.

సుషే.—యువరాజా! మాటిమాటికిట్లేల విచారించెదవు? సంపాతి యను పక్షీంద్రుండు చెప్పిన యుదంతమును మఱచితిరా? సీతామహాసాధ్విని లంకాధిపతియగు దశకంఠుండు బలాత్కారముగా దొడ్కొనిపోయి యశోకవనమునం దామెను నికొందఱు దుష్టవనితలను గాపుంచెననియు, నామెజాడ లరయువల యునని నీరధిని దాటి పోవలయుననియు నుడివెనుగదా? నీరధిని దాటుటకై యేల ప్రయత్నింపరాదు.

అంగ—సుషేషణా! నే నందులకే యిప్పుడింతఁగా విచారించుచున్నాను. ఏమందువా! శతయోజనంబుల వెడల్పుగల నీమహోదధిని దాటుటనిన సామాన్యకార్యము కాదు. మాటలతో దీరు కార్యముగాదు. ఎట్టిదుర్గమభూయిష్ఠం బైనను నాజనకుఁడు లేని లోటు నాకిప్పుడు గాన్పించుచున్నది.

హను—ఎందువలన?

అంగ—ఆతఁ డిట్టి మహోదధి ననాయాసంబుగా నిర్గమింపఁగలఁడు. నాజనకుని పేర్విన్నమాత్రమున లంకేశ్వరుఁ డడలిపోవును గదా? మున్నొకమారు మండోదరియున్న బిలద్వారమును రావణుఁడు తొలఁగింప లేనప్పు డద్దానిని నాజనకుఁడు తల లాంగూలమున నిట్టి ద్రోచివైచెను. ఒకానొక కారణంబున నారావణుని తన తోకకుం జుట్టబెట్టి సప్తసముద్రంబులయందును ముంచి, ముంచి, త్రిప్పి యసిపించి విడచిపెట్టెను. నేను

బాలుండనై యున్నప్పుడు నా యూరువులో నొక యాటబొమ్మగా రావణుఁడు గట్టివైచెనట. ఇట్లు జరిగినను దనగర్వమును రావణుఁడు విడువకుంటచే నాజనకుఁ డాతని గర్వపరిహారమునుఁ జేయఁదలంచి యాతనిని నాజనకుఁడు తన బాహుమూల నిరికించుకొని యొక్కవత్సర ముంచెనట. అట్టి బాహుబలాభిరాముం డగు నాజనకుఁడే జీవించియుండి, లోకారాధ్యుఁడగు శ్రీరామునకే సేవకుం డయ్యెనని యీ లంకేశ్వరుని యాట లిట్లు సాగివచ్చునా ?

హను—(చిఱునగవుతో) యువరాజా! చచ్చినవాని కండ్లు చారెఁ డన్నట్లున్న దీయుదంతము. ఇప్పు డెందు కాగొడవ? అట్టి బాహుబలాఢ్యున కుద్భవించిన నీ వేమైన నిక్కార్యమునకుఁ దగుదువా ?

జాంబ—వనౌకసులారా! ఇచ్చట నొంకుల కీవిషయవితర్కము. మహార్ణవము చెంత కరుగుదము రండు

అందఱు—నడువుఁడు. నడువుఁడు. (అందఱు నిష్క్రమింతురు)

[తెర లేచును]

సముద్రపుగొడ్డు.

[మఱల నందఱును బ్రవేశింతురు]

గజ—(చూచి) ఓయి బాబోయి. సముద్రమంటే యిదియా! శత యోజనమంటే యేమిటో యనుకుంటిని కనుచూపుమేర వఱకు గట్టే గన్పట్టుటలేదే. ఇంక దీనిని దాటుటెట్లు ? నావలనఁ గాదు బాబూ !

గవా—యువరాజా! గజునివలె నేను పిఱికివాఁడనుగాను గాని—

కం. పదియో, లేకుంటే యిరు
వదియో, యోజనములుమఱి । వడిదాటఁగలన్

బదపడి దాటఁగ జాలను
విదితంబుగ దెల్పుకొంటి । విమువుము నన్నున్.

సుషేణుఁడీ కార్యమునకుఁ దగునని కొనును.

సుషే.—యువరాజా! జానకి జాడలరసి రావలయునను నుబలాటము
నాకు మిక్కుటముగానే యున్నది కాని—

తే. గీ. సరిగ దెబ్బదియోజనాల్ । జవముఁజూపి
దాటఁగలఁగాని యాపైని । దాటలేను
అట్టియెడలను జనకుని । పట్టియునికి
తెలియుటెట్టుల రాముకు । దెలుపుటెటుల?

ఇట్టి శతయోజనంబులు శతమైనను దాటఁగలవాఁడు జాంబవంతుఁడే.
ఆతఁడే యిక్కార్యమును జక్కపెట్టుటకు సమర్థుఁడు. కావున
నాతనినే నియోగింపుఁడు.

అంగ.—తాతగారూ! మన సుషేణుని వాక్యములు వింటిరిగదా? మీ
రే యీ మహత్కార్యమునకుఁ బూనుకొనకున్న మాకింక
గతిలేదు.

జాంబ.—యువరాజా! సుషేణుఁడు చెప్పిన వాక్యములు సత్యములే.
నేను పూర్వపుస్థితిలో నుంటినేని యింతవఱకు కాలోచింతునా?
త్రివిక్రమునకుఁ బ్రదక్షిణ మాచరించు సమయంబున నొక
శైలము విరిగి నామోకాలిపైఁ బడినది. ఆకారణమున నామో
కాలు బెణకినది. అందుచే నేనాత్రినుదూఁకినను కరేలుమను
చుండును. ఆభయముచేతనే నేను నోరుమూసికొని యూర
కుండవలసి వచ్చినది.

అంగ.—అట్లయిన తాతగారూ! ఇంక నీవిషయమై యాలోచించుటెందు
లకు?

తే. గీ. ఎట్టులో ప్రాణములు బిగఁ । బట్టి నేను
యోజనశతంబు లంఘింప । నోర్తుఁగాని
తిరిగి కొన్నాళ్ళవఱకును । మరలి యిటకు
వచ్చుటకు శక్తిచాలదు । ప్రథితగుణుఁడ

అయినను సంశయింపక లంకలోనికిఁ బోయెదను. మీరెల్లరును దిరిగి కిష్కింధకరిగి శ్రీరాముని కీవిషయ మెఱుఁగజెప్పుఁడు. మరల శక్తిఁజేరగనే సీతావృత్తాంత మెఱుఁగఁజేయుటకై వచ్చెదనని తెల్పుఁడు. ఈ సేవకుని యెడ లాగ్రహ మూనవలదని నివేదింపుఁడు.

జాంబ——యువరాజా! నీ వాలోచించిన విషయ మంత ప్రశస్తమైనది కాదు. నీవు మాకందఱకును నాయకుఁడవు. నీవు వెడలంజనదు. (అని హనుమంతునివైపుఁ దిరిగి) వాయుకుమారా! నీకంటె సత్వసంపన్నుం డింకొకఁడు లేఁడు. మాలో మేమిట్లు తటపటఁ బడుచుండ నిన్నుఁగాన ట్లూరకుంటివేమి?

హను——తాతగారూ! నేను తప్పక శ్రీరామకార్యార్థమాయి లంకాపురి కేగెదను మీరందఱును నన్నుత్సాహముతో దీవింపుఁడు.

21 వ అనుబంధము.

జాంబ——అంజనీతనయా! నీయుత్సాహంబే నీకార్యసిద్ధికి మూలమగును గాత. నీ శ్రీరామభక్తియే నీకంగరక్ష యగుగాత. శీఘ్రముగా బోయిరమ్ము.

హను——చిత్తము. (అని రెండడుగులు ముందునకువైచి కరములుమోడ్చి నిమీలితనేత్రుఁడై యొక్కనిమేషము ధ్యానించి)

సీ. తప్పటడుగులనాఁడె । తాటకిఁ వధియించి
ప్రజయార్తిని బాపి । నట్టి కరుణ

పతిశాపదగ్ధమై । పడియున్న చట్రాతి
నాతిగాఁ జేసిన । నాటికరుణ
పరశురాముని గర్వ । భంగంబు గావించి
యవనీశులను గాచి । నట్టికరుణ
కూరాత్ముఁడౌ వాలిఁ । గూల్చి సుగ్రీవు జే
పట్టి రక్షించిన । యట్టికరుణ
నేఁడు నాపైనఁ జూపు మో । నీరజాక్ష!
నీదు ఘననామమే నాదు । నెమ్మనమున
సంస్మరింపుచు జలనిధి । నంతరింతు
రామ (శ్రీ) రామ కాపాడు । రామ రామ.
కపిపుంగవులారా! వాకు సెలవొసంగుఁడు.
"రామ, రామ, రామ" (అని యెగిరిపోవును.)
తెరవ్రాలును.



తృతీయరంగము.

కోట ముంగలి భాగము.

లంఖ—(ద్వారముచెంతఁ గూర్చుండియుండి) ఒకయంశము సత్యమై నప్పుడు రెండవయంశ మేల సత్యేతరంబగును?
తే. గీ. బ్రహ్మ వచియించినట్లు (శ్రీ) । రాముపతిని
రావణుఁడు దెచ్చె నింక నీ । రామయునికి
దెలిసికొనఁ గోఁతు లరుదెంచి । తీవ్రమతిని
గోట మూలమట్టంబుగఁ । గూల్పకున్నె?
[ప్రవేశము:—శీఘ్రగామియై హనుమంతుఁడు]
హను—(తనలో) రామా! త్రిలోకాభిరామా!! సద్గుణస్తోమా!!! జానకీమనఃకామా!!!! నీనామసంస్మరణంబు మాత్రమున నీ

మహాోదధిని నిర్గమించి లంకాపుర ప్రవేశ మొనరించితిని. ఇక్లే నిరాయాశముతో సీతాన్వేషణ మొనరించి యామహాసాధ్వి క్షేమసమాచారము నీకెఱింగించునట్లు నీభక్తుని నీవనుగ్రహింపుము. (అని ముంగునకుఁజూచి) అబ్బ! ఏమి యీ వికృతాకారము! చిన్నపర్వతాకారముతో నున్న యీయువతిని గోటకావలిగా రావణుఁడు నియమించి యున్నట్లున్నాఁడు. కానిమ్ము. దీనియుదంత మేమియో తెలిసికొందుఁగాక.

(అని సమీపించును.)

లంకి—(తనలో) ఆముచ్చటయుఁ దీరినది ఇదిగో వనచరుఁ డొకఁ డరుదెంచినాఁడు. నలువవాక్యానుసారముగా వీనిచే నా గర్వపరిహారం బగునా యేమి? ఏమైనను వీనిని, నిరోధింపక తప్పదు గదా?

హను—(మాటాడక లోనికిఁ బోవును.)

లంకి—(అడ్డుఁగాఁ జని) ఓరీ! మర్కటాధమా! జాగ్రత్త.

హను—(దగ్గఱగాఁ జని) ఓసీ! నీపెరెవ్వతె?

లంకి—లంకిణి.

హను—(నవ్వుచు) నీవు లంకిణివా? శంకిణివా ?

లంకి—నీ వేళాకూళములు గట్టిపెట్టి మర్యాదగా వచ్చినత్రోవను బొమ్ము.

హను—పోకున్న నీచేసెడిదేమి ?

లంకి—బంతి విసరిన ట్లావలకు విసరివైచెదను.

హను—అట్లయినఁ గానిమ్ము (అని లోనికిఁబోఁబోవును)

లంకి—ఓరీ! మర్కటాధమా! నిలువుము. (అని వెన్నపై గుద్దును.)

హను—ఓసీ! భడివె అబలవని యూరకొనినందులకు గర్వించుచుంటివా? నీగర్వపరిహార మొనరింతును రమ్ము. (అని కొట్టును.)

లంకి—ఓరీ! కోతిగ !

22 వ అనుబంధము. (డైలాగు)

హను—శంఖిణీ! మాటలతో నన్నుఁ బోనీయవా?

లంకి—నేను పోనీయను.

హను—ఓసీ! మొండిముండా!

తే. గీ. ఉవిద నేచుట పాపమం । చూహఁజేసి
నిన్ను వధియింపకుండ నే । మిన్నకుంటి
నంతమాత్రాన పెరుగర్వ । మంద నేల
రమ్ము నిను దుంచిపోదు శీ । ఘ్రమ్ము నేను.

లంకి—ఓరీ కోతిగా!

తే. గీ. అబలలను జంప పాపమం । చనఁగ నేల
నీదు గురువగు రాముండె । నిన్న మొన్న
తాటకిని గీటడంచె, నీ । నాఁటి కీవు
జంపు మిఁక నను నీకులా । చారమగద?

హను—కులాచారమో? దురాచారమో? ఎట్లైనను నామార్గము నిష్కంటకముగా నొనర్చుకొనక తప్పదు. (అని వెన్నుపై బలముగా గుద్దును)

లంకి—బాబూ! నన్నుఁ జంపకము. నీవు సామాన్యుడవనుకొంటిని. నీయిష్టమువచ్చినట్లు లంకలోనికిఁ బొమ్ము. నన్నుఁ బ్రాణములతో విడువుము. నీకుఁ బుణ్యముండును.

హను—లంకిణీ! నీశంకినీకట్టు విడచితివి గనుక బ్రతికితివి. నీకేమియు భయము లేదు. దారి విడువుము.

లంకి—చిత్తము. (అని దారి విడచును. హనుమంతుఁడు లోనికిఁ బోవును.)

(తెర లేచును.)

[హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హను—ఏమిది? దాదాపుగా నీలంకాపట్టణం బంతయు గాలించి వైచితినే. జానకిజాడ నింతకంతయు గానరాదేమి పాపము?

చ. వరుసగ రమ్యహర్మ్యములు । బల్వలముల్ నదులుం దటాకముల్
గిరులును భూగృహంబులును । గేళిగృహంబులును సంధు గొందులుం
బురములు వీధివీధులును । బుష్పవనంబులు జిత్రశాలలుం
దిరిగితి గాని, లోకజన । నిర్గమనింపకపోతి నక్కటా!

ఇంకేమి చేయుదును? మదోన్మత్తుండగు నాదానవాధముం డాజానకి నెచ్చోనిర్బంధించి యుంచెనో గదా? ఇదిగో! ఇది విప్రజ్ఞప్తి గృహముగదా! లోనికిఁబోయి చూచెదఁగాక. (అని లోనికరిగి యీవలకు వచ్చి) కటకటా!

చ. లలనలవైపు నెప్పుడు ప । రాకునసైనను జూడనట్టి య
స్ఖలితపు బ్రహ్మచారినయి । కాలముబుచ్చుచు నున్ననేను, నే
డలఘుతరవ్రతంబు నడు । గంటఁగ స్త్రీలశరీరమర్మముల్
దలఁగక జూడఁగావలసె । ధర్మవిహీనుఁడనైతి నేటితోఁ.

అయ్యయ్యో! ఏనేమి చేయుదును. సీతామహాసాధ్వి నరయు నవసరంబున నీ రమాస్యమందిరంబు లన్నియు నరయవలసి వచ్చినది. రాత్రి సమయంబుల నీరమాస్యమందిరముల కితరులు రారను దృఢ నిశ్చయముతో నిశ్చింతగా నీ స్త్రీలెల్ల బరుండిరి. ఈపాపపు దృశ్యము నాకండ్లఁ బడినది. అక్కటా! నా యీ పాప మెట్లు తొలఁగిపోవును? (ఇంచుకాలోచించి) నా యీ పాపసంచయము తొలఁగిపోవుటకు రామనామమే ముఖ్యమైనది.

23 వ అనుబంధము.

[హనుమంతుఁడు నిష్క్రమించి యొకకొక యగారమునఁ బ్రవేశించును. అచ్చట కొందఱు స్త్రీలు పరుండియుందురు.]

హ. హా! ఇచ్చట కొందఱు యువతీమణులు నిద్రించుచున్నారు. వీరిలో నాలోకమాత యుండెనేమో చూచెదఁగాక. (అనిపరీక్షించుచు)

సీ. తాంబూలరాగంబు । తగఁగల్గియుంట నీ
చెలువ మాయంబయా । సీత గాదు
మేలివస్త్రంబు లీ । మేనఁగప్పుకుట నీ
ముద్దియ జనకుని । పుత్రి గాదు
ధమ్మిల్లమునఁ బూలు । దాల్చుటచేత నీ
వెలఁది శ్రీరాముదే । వేరి గాదు
మధుసేవఁ జేసిన । విధముగన్పడుట నీ
మదిరాక్షి సౌమిత్రి । వదిన గాదు
పతితపావనియని యనఁ । బరగుసీత
జీవితేశ్వరుఁ గానకున్నె । చింతలేక
నాథు నెటుఁ జేరుట నెడిచిం । తయును లేక
హేయమైనట్టి భోగంబు । లేలగోరు.

తప్పు. తప్పు. ఆమహాసాధ్విమణి నట్లుగాఁ దలఁచుట తప్పు. (ఇంచుకాగి) అయ్యో! ఇఁకేమి సాధనము? (అని యుంగరము యొక కరిగిచూచి నిస్పృహతో) అయ్యో!

మ. సతి నాకెక్కడఁ గానరాదలిగి రక్షః । స్త్రీలు భక్షించిరో?
పతిభావించుచు బ్రాణముల్ విడచెనో । పౌలస్త్యుచేఁ దప్పియు
ద్ధతి సంభోగధిఁ గూలెనో దశముఖో । ద్యద్బాహుసంపీడనా
న్వితమై స్వర్గెనొ? పంక్తికంఠుఁ డెడగా । వేఱొండుచో డాఁచెనో?

నాకేమియుఁ దోఁచకుండ నున్నయది. ఆమహాసాధ్వి మరణించెననుట కవకాశము లేకుండనున్నది. కానిమ్ము. ఇప్పుడీవితర్కమేల? ఇంకను రావణుని యంతఃపురంబును బరీక్షింపవలసియున్నది గదా? అచ్చటనైనను రాముదేవేరి గాన్పింపదా? (సందియముతో)

కాన్పింపని చో నేమిసాధనము? (ఇంచుక యాలోచించి) సాధన
మున కేమున్నది?

మ. ఎట మాజానకిఁ డాంచితో చెలుపవే ! విగా యంచులంకేశునిన్
కటురోషంబున బట్టి కొట్టెదను యా ! బ్రహ్మాస్త్ర వడిన్ జేసి నీ
వెటులైనన్ మరి సీతఁజూపుమని నే ! నెంతేని వేధింతు, నిం
కటుగాకున్న సమస్తమా జగములా ! యంభోధిలో దేల్చెదన్

అవ్వాడైనను మా లోకజనని దర్శనభాగ్యము నాకొదవక పోవునా? చూ
తము. ఏల లభింపక పోవునో? నాతల్లి యకాలమృత్యువువాత
బడకయే యున్నచో నామె నీకూరరాక్షసుఁ డెక్కడ డాంచి
నను యామెజాడలఁ దీసి తీరెదను. రామా! నాప్రయత్నంబు
నకు నీ యాశీర్వాదబలంబు కొంత యొసఁగుము.

(తెర వ్రాలును)



## తృతీయరంగము.

[రావణుని యంతఃపురములో మండోదరి]

మండో — అక్కటకటా! ఎంతలో నెంతయవస్థ వచ్చినది.

చ. పదములపైనవ్రాలి మతి ! ప్రార్థనజేయుచు బ్రోత్సహించు నే
విధములు కంటిసిరోలుక ! వేడుచునన్నను రామచర్యలన్
విదితముగాగ జెప్పినను ! వేదవిమండని నొక్కిపల్కినన్
వదరకు మీవటం చనుచుఁ ! బల్కు గణింపడు నామవాక్యమున్.

అయ్యయ్యో! నేనేమిసేయుదును? ఎందుజొత్తును? అవతారపురుషుం
డగు రాముని యర్ధాంగిని నీయట్టివా డపహరింపరాదన నా నాథుఁ
డు నామాట వినఁడే. మంచిచెడ్డ లాలోచింపఁడే ఎవ్వరెన్ని
విధముల జెప్పినను దన్నుఁగాన ట్లూరకొనునే. అక్కటకటా!

సీ. తాటకిఁ జంపిన । పోటుమగానిసి యున్న
పిటికిముందులునాటి । పెట్టకనును
పరశురామునిగర్వ । భంగంబు వినుమన్న
పనికిమాలినమాట । పలుక కనును
శివవిల్లు విఱచిన । జెట్టిమగ నను మన్న
బట్టువై పొగడఁగా । వలవదనును
మారీచు వాక్యముల్ । మన్నించుమనిగా యన్న
కోపించి నోర్మూసి । కొమ్మి యనును
బోధ సేయుకొలఁది । పొంగుచుండుచు క్రోధ
మేమి సేయుదాన । నెందుఁ జొత్తు
సీతవిడువకున్నఁ । జేటువచ్చునటంచు
హితవుగఁ జెప్పువార । లెవ్వరింక.

అయ్యయ్యో! నాకిప్పుడు వచ్చిన యీ దుస్స్వప్నమే నా భావిస్థితిని నిరూపించుచున్నది. (ముందునకుఁ జూచి) అదిగో! ప్రాణేశ్వరుండు దయ చేయుచున్నాఁడు. నా స్వప్నవృత్తాంతం బెఱిగించి సీతను విడువవలసినదని మరల ప్రార్థించిచూచెదను.

[అప్పుడు రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రావ—(తనలో)

మ. ధనధాన్యంబులు లెక్కసేయదు, మహా । ధైర్యంబు శౌర్యంబులా
మనమం దెన్నరు, లోకమాన్యుఁడని యే । మాత్రంబు నన్ జూడ దే
మనినన్ సుంతయు లోఁగదయ్యొ, యెటు లీ । యబ్జాక్షి చిత్తంబు జి
క్కునొ నాపైన, మదేమొ గర్చునెపుడా । కోర్కెల్ తుదన్ ముట్టునో?

[అప్పుడు హనుమంతుఁడు సూక్ష్మరూపమునఁ బ్రవేశించి]

హను—(ఇటునటుఁ జూచి) ఓహోహో! ఇది రావణాంతఃపురము గావలయును. జానకీదేవి యిందున్నదేమో? (అటు నిటుఁ

జూచి) అదిగో! ఆ మృదుశయ్యపై నధివసించియున్న యా యువతీరత్నము భూజాతయై యుండునేమో? (నిదానించిచూచి) ఆమె ధరణిజయే గాకున్న మ్లానవదనయై యుండుట కేమికారణము? (ఇంచుకాలోచించి) ఇదిగో! రావణుం డర్ధరాత్రింబునఁ దన్నుఁడాయ వచ్చుచుండెనను విచారముతో నీ మహాసాధ్వి విచారించుచున్నది (ఒక్కనిమేషమూరకొని) అహో! ఏమి నాబుద్ధిమాంద్యము. ఈబిడ సీతగాదు. ఆ మహాసాధ్వి పరుల మంచముపైఁ గూర్చుండుట కంగీకరించునా? రామా! రామా!! తప్పుభావించితిని. ఈ సేవకుని మన్నింపుము.

మండో—(రావణునిఁజూచి సమీపమున కేఁగి) జీవితేశ్వరా! మీరా భూజాతఁ దోడ్కొనివచ్చిననాఁటినుండియును నన్నియు దుశ్శకునంబులే గాన్పించుచున్నవి నేఁడుగూడ నాకొక దుస్స్వప్నము వచ్చినది. ఒకవానరముఖ్యుఁడు సీతాన్వేషణమునకై మనలంక కరుదెంచి, లంఖిణిని జంపి, సీతతో మాటాడి—

రావ—ఓ భీరురాలా! నీ మనోదౌర్బల్యమే యిట్టి దుస్స్వప్నములు గల్గుటకు కారణము కోఁతులు గీతులు నన్నేమిచేయంగలవు. చేతికిదొరకిన పెన్నిధినిఁ బోగొట్టుకొమ్మందువేం? హావిర్జట యిప్పుడు నాచెంత కరుదెంచి నన్నశోకవనంబునకు రమ్మని పిలచినది. నేనటకు వెడలవలయు ననుకొంటిని. నీయేడ్పువలన నాకపజయము వచ్చునేమోగాని నరవానరులు నన్నేమి చేయగలరు. నోరుమూసికొని పడియుండుము. నే నటకే పోవుచుంటిని. (అని నిష్క్రమించును.)

హను—నడు నడు. నేనును వచ్చుచుంటిని. (నిష్క్రమించును.)

మండో—హా! (అని మూర్ఛిల్లును.)

తెర వ్రాలును.

## పంచమరంగము.

### అశోకవనము.

[ప్రవేశము:—విచారముతో సీత, యెదుట రావణుఁడు, దూరమున రాక్షసాంగనలు, వృక్షముపై హనుమంతుఁడు.]

రావ—సీతా! నాయెడల నీ కీ విముఖత్వ మేలనే?

మ. యువకుల్ మెచ్చెడి రూపయౌవనములో । హొంగల్గె నీచెంతనే
జవరాండ్రాల నలవంతయుంచెడి మహా । సౌందర్యమున్ వంశమున్
జవమున్ ధైర్యము, శక్తియుక్తులును రా । జ్యంబున్ మహాతేజమున్
యువతీ గల్గిన నన్నుఁగైకొనఁగ సం । కోచింప నీకేలనే.

రాముఁడు నన్నుమర్దించి నిన్నేమైన ననునేమో యను భయమా! వెఱ్ఱిదానా!

ఆ. గీ. తపముఁజేసి బ్రహ్మ । దయబొంది యతనిచే
మరణమొందకుండ । వరము బడసి
యున్న నన్నుఁబట్టి । గ్రన్ననఁ దుర్పింపగా
గలరె? నరులు వాన । రులు దలంప.

కావున నీకట్టి సంశయము వలదు. నన్నుఁ జేపట్టుము. అదియునుఁగాక,

చ. అనుజుఁ డొకండు రాజ్యరమ । నట్టె హరించెనటన్న బెంగతో
మనమునఁ గుళ్ళుచుండగ; న । మాంతముగా నిను నేహరించితిన్
వనిత! యిఁకెట్టు లానరుఁడు । ప్రాణములన్ భరియింపనోర్చు, నో
ర్చినను జలార్ణవం బెటుల । చెంగునదాటును, దాటుగాక, యా
మనుజుఁడు, ధైర్యశాలి నను । మార్కొని గెల్వగలాఁడె భామినీ.

హను—(తనలో) ఓరీ! దనుజాధమా! నీకాలము సమీపించినది
ప్రేలుకొనఁదలంచినదంతయు నిప్పుడే ప్రేలుకొమ్ము.

సీత—(గడ్డిపరక చేతఁబట్టుకొని దానివైపుఁజూచుచు) ఓరీ దనుజాధమాధమా! ప్రేలకూరకొనుము. నోరుమూసికొని యావలకుఁ

బొమ్మ! తారతమ్య మెఱుంగకుండ మాటలాడకుము. శ్రీరా
ముం డనిన సామాన్యునిగా దలంపకుము

మ. హరకోదండవిఖండనుండు మరి వి। శ్వామిత్రయాగాహితా
సురసంహారి సుబాహు నొంచెను ఖరా। సుజ్ఞుపై మారీచు సం
హరణంబున్ క్షణమందుఁ జేసె, శిలనే। యజ్ఞాంక్షిగా మార్చె భా
స్కరవంశాగ్రణి రాముఁ డల్పుడనుచున్। సంభావనన్ జేయుదే.

అట్టి మహానుభావునిఁ జెనక నీ తరముగాదు. నీ మాయలను గనిపెట్టఁ జాలఁడనిగాని- యీ మహార్ణవంబును దాటఁజాలఁడనిగాని- నిన్ను గెల్వఁజాలఁడనిగాని భావించుకొనకుము.

తే. గీ. నీవలెనె పేలినటువంటి। నీచులెల్ల
నిముషమందున రాముచే। నిహతులైరి
బ్రహ్మవరములు గలవంచు। భ్రమపడకుము
రణమున నరవానరులె మా। రకులు నీకు.

అంతవఱకు రాకుండ నీ ప్రాణంబులు నీవు నిలుపుకొనదలంచితివయేని చేసిన నేర మొప్పుకొని నన్ను శ్రీరామున కర్పింపుము. నీ వాతని పాదములపై వ్రాలుము. ని న్నామహానుభావుఁడు రక్షించును. లేదందువా?

*శా. పంకేజాసనుఁ జొచ్చినన్ జవమునం। బాతాళమున్ దూఱినన్
లంకారాక్షసవంశవారిధిఁ గరా। శజ్వాలజిహ్వాలమై
సంకీర్ణస్ఫుటవిస్ఫులింగపటలీ। సంచారమై ఘోరమై
కింకన్ రాఘవబాణబాడబముఖా। క్షీణాగ్నిగ్రోలున్ నినున్.

హను—(తనలో) సెబాస్. లోకమాతా! చక్కఁగాఁ జెప్పితివి.

రావ—(తీవ్రక్రోధముతో) ఓ యబలాశిరోమణీ!

చ. ననువరియించి సౌఖ్యము ల। నారతమున్ బడయుంగ నెంతు నీ
వని వినయంబుతో నిటుల। బ్రార్థన జేయుచు వేఁడుచుండఁగా

వినక యనేకరీతులను । బేలుచునుంటివి రాము జంపి యీ
దనుజుఁడె నిన్ను బల్మిఁగొని । తద్దయు సౌఖ్యములందుజూడుమీ.

నీ కొక్క రెండుమాసములు గడువొసంగితిని. ఈ లోపున నిండారు
ప్రేమతో నను వరించెదవా? నీకు సకలసౌఖ్యములు చేకూరు.
లేదందువా? ఆపైన నీ కష్టముల కంతముండదు. (ప్రక్కను
జూచి) హావిర్జటా! నన్ను వరించుమని యీ రీమెకు బోధించుమఁడు.

హావి—చిత్తము.

రావ—(నిష్క్రమించును)

హను—(తనలో) కానిమ్ము ఇప్పటికి పిశాచము వదలినదికదా?
ఈ దౌర్భాగ్యశిరోమణుఁగూడ వదలినపిమ్మట నీ జగన్మా
తను దర్శించెదఁగాక.

సీత—(తనలో) ఓరామచంద్రా!

చ. తరుణి నటంచు నీ తులువ । దైత్యుఁడు నోటికివచ్చినట్లుగా
బరుసములాడుచుఁ దెగుల । పంతములాడుచునుండె నయ్యో యీ
గరువమడంచి నీ సతిని । గావఁగరావె మహానుభావ! నీ
తరుణిని నీవెబ్రోవఁదగు । దైత్యకరంబుల జిక్కకుండఁగన్.

ఓమఱిది! లక్ష్మణా!

చ. జననియటంచు నీ విమల । స్వాంతమునందున నన్ను నెంచి నీ
వనయము గొల్చుచుంటివని । భావనచేయక మూర్ఖచిత్తనై
ఘనతర నిష్ఠురోక్తులను । గాయముసొవ్వగ నిన్ను దిట్టినం
దున కిటువంటి ఘోరతర । దుఃఖముపాలయిపోతి లక్ష్మణా!

హావి—సీతా! సీతా! ఏందుకే విచారించెదవు? మా రాజేంద్రుని
వరించినచో చేటుమేయుదువా? రావణుండనిన సామాన్యుం
డనుకొంటివా? దేవేంద్రునంతటివానిని నిట్టె రణంబునఁగెల్చెను.
ఇనుఁడీతనికి వెఱచి తన తేజంబంతయు జూపడయ్యెను. ఆతని

యిష్టానుసారంబుగ వర్షము గురియును. ఈతనికి భయపడి సర్వదిక్పాలు రీతని కరిగాపులైరి. ఈతఁడు నాలవబ్రహ్మయగు పౌలస్త్యుఁడు ఇట్టి జగదేకవీరుని వరింపక నీచమానవుని వరిం చెదవేమి? నీకు మతిపోయినదా? కోరినను రానిభాగ్య మయాచితముగా నీకు లభించుచుండఁ గాలఁదన్నుకొందువే మే నిర్భాగ్యురాలా!

**హను**— ఈ ముండ నీఁగనునలిపి వేసినయట్లు నలిపి వేయుదునా?

**హావి**— త్రిజటా! నిదుర వచ్చుచున్నది. ఈ మొండి యెంతచెప్పినను వినకుండనున్నది. ఇప్పటికి పరుండుదము.

**త్రిజ**— మీరు పరుండుడు. నే నీమెను గనిపెట్టియుండెదను

**హావి**— మంచిది (అందఱును బరుందురు)

**త్రిజ**— తల్లీ! సీతా! విచారింపకుము. కష్టము లెల్లకాల మిల్లుగట్టుకొని కాపురముండవు నీ పతి నీ రావణాధముఁడు నిర్జింపఁ జాలడు నా కిట్లే స్వప్నము వచ్చినది. నీ యునికి శ్రీరామునకుఁ దెలియగనే యీ లంకకుఁ జేటువాటిల్లినట్లే విచారింపక శయనింపుము. (అని త్రిజట పరుండును)

**హను**— (తనలో) ఓహో! ఈమె యెవ్వతెయోగాని సత్యముగ్రహించినది. ఈమెకూడ నిదురించుచున్నది. కావున మా లోకజననిని దర్శించుట కిదియే మంచిసమయము. (సూక్ష్మరూపియై యెట్ట యెదుట నిలచును)

**సీత**— (చూచి) ఓరీ! రావణాధమా! మఱల మర్కటరూపధారివై నన్నలయింప నెంచి వచ్చితివా? దనుజాధమా! నీచే నీ యిడుమలఁ బడుచుండుటకంటె చచ్చుటమంచిది. (అని కేశములచే నుఱి వెట్టుకొనఁబోవును.)

అయ్యో!

చ. అడలకుమమ్మ! రక్కసుడ । నంచు దలంచి త్వదీయపాదముల్
విడువకుమమ్మ! నవిభుడు । పేర్మిమడిబంపిన బంటునమ్మ! నా
నుడువులు నమ్ముమమ్మరో! మనోగత దుఃఖము బాయుమమ్మ! రా
ముడు నినుబ్రోవనున్నమ్మ! రణభూమిని రావణు గూల్చి వేగమే.

తల్లీ! లోకజననీ! నీయునికి దెలిసికొనిరమ్మని శ్రీరామచంద్రుండు నన్ను బంపించెను. నేను నిజముగు మర్కటమును. వాయుకుమారుడను. సుగ్రీవమంత్రిని. శ్రీరామ సేవకుడను. నీ కుమారుడను.

సీత—నిన్ను నమ్ముట కాధారమేమున్నది. నానిశేశుని గుణరూపాదులను వర్ణించి నన్ను నమ్మించుము.

హను—లోకమాతా!

సీ. నీలమేఘశ్యాము । లీలలు వర్ణింప
జాలునా రెవ్వరీ । జగతిలోన
భూసహిష్ణుని గుణపుంజమున్ గొనియాడి
దరిఘంపజేయు నెవ్వనికరంబు
ధాతయై యుల్లోక । నేతయై యుతి జగ
త్త్రాతయూ వాసిని । దరమెపొగడ
చక్రాత్రినాథిగా । నల్పిన చరణము
హాత్మ్యంబు వర్ణింప । ననువ్రహను నె
సర్వభూతహితుని । సాధుసత్వాదీక్ష
వ్రతుని గుణభరితుని । బంధుహితుని
నిర్వికార యుతుని । నిర్జితతేజుని
బొగడవశమె నాకు । బూతచరిత.

అమ్మా! ఆవేద వేదాంగ ధనుర్వేద కోవిదుడే నాప్రభుండగు సుగ్రీవునిగాచి, యాతని యనుజుండను దుష్టవర్తనుండును నగు

వాలిం బరిమార్చెను. మఱియు నీజాడ లరయ బంపించెను. నేనింకవచ్చి నిన్నుఁ గాంచితిని. నాజన్మ ధన్యమైనది. ఇదిగో శ్రీరాముఁ డానవాలుగా నొసంగిన యంగుళీయకము. (అని యిచ్చెను.)

సీత—(కైకొని కనులకద్దుకొని) ఉంగరమా!

సీ. నినుబాల్పెడి విభుండు । వనముల ననుబాసి
కాల మేతీరుగా । గడుపుచుండె
ననుఁగూర్చి బెంగఁ గొందు । ననుజుని సౌమిత్రి
గన్నన యూరార్చు । చున్నవాఁడె
శ్రీరామక్షేమంబు । చెప్పి సంతోషంబు
గూర్పవే నామీఁద । గోపమేల
రాముండు వచ్చునా? । రావణుం గ్రుంచునా?
వారిభావం బేమొ । పలుక వేమి?
యీవె మాకుఁ బెండ్లి । సింపారఁ జేసితి
వీవె గలుపవచ్చి । నావు మఱియు
యిట్టి సదయహృదయ । వెట్టులఁ నిన్నింక
పసిడియుంగరంబ । బాయఁగలను?

వాయునందనా! నీవు మహాశక్తిఁ గలవాఁడవు. నీయట్టిశక్తిసామర్థ్యంబులు గలవారీలోకంబులం దిక నుండఁబోరు. శతయోజనవిస్తీర్ణంబైన సంద్రం బిట్టెదాటితివి. పతివియోగ దుఃఖంబున బ్రాణము బాయనున్న నన్ను కాలమృత్యువు వాతనుండి రక్షించితివి. కుమారా! నీయుపకృతి మఱువఁజాలను.

* కం. ఎన్నఁడు రాముఁడు రాఁగలఁ
డెన్నఁడు గోసిపోవు నన్ను । నెన్నఁడు దుఃఖా

పన్నత లేకుండుదు, నే
నెన్నఁడు సాకేతపురికి । నేగుదుఁ బతితోఁ.

హను—లోకమాతా! నీ వేటి కిట్లు విచారించెదవు? నిన్నీక్షణంబ శ్రీరాము సన్నిధికిం గొనిపోవుదును. నా కనుజ్ఞనిమ్ము.

సీత—మారుతీ! శతయోజన విస్తీర్ణంబగు లంక నొక్కడవే దాటుట దుర్ఘటము. నీవు చిఱుతవు నన్నెట్లు గొనిపోవఁగలవు?

హను—త్రిలోకపావనీ! నీయాశీర్వచన మొక్కటుండవలయుఁగాని యీ లంకాపురముగూడ మూపుననిడుకొని పోవఁగల జవసత్త్వములు నాకున్నవి. తల్లీ! వలయుదేని నానిజరూపము జూడుము. నీసంశయ నివారణమగును. (అని రామనామము ధ్యానించును. హనుమంతుని విశ్వరూప మగపడును)

సీత—నాయనా! నీశక్తిసామర్థ్యంబు లెఱింగితి. నీరూప ముపసంహరింపుము.

హను—(సూక్ష్మరూపియై) తల్లీ! ఏమియాజ్ఞ?

సీత—ప్లవంగశేఖరా! నీవెట్టి ధైర్యశాలివైనను నేను నీమూపున నధివసించి రాజనదు. అట్లువచ్చుటకు నాకిష్టములేదు. మహాపతివ్రతనగు నేను పరపూరుషు నంటరాదు. కావున నీవరిగి శ్రీరామచంద్రునకు నాకష్టదశ యెల్ల నివేదించి నాశిరోమణి నానవాలుఁగాఁ జూపి వెంటనే వారి నిక్కడకుఁ దోడ్కొని వచ్చి నన్నుద్ధరించుటకు బ్రయత్నింపుము.

హను—తల్లీ! ఆజ్ఞాబద్ధుఁడనై యట్లేచేసెద.

సీత—కుమారా! సంతోషము. ఇదిగో శిరోమణి దీని నారామచంద్రున కిమ్ము ఇచ్చి నావాక్యములుగా నిట్లుపల్కుము.

సీ. చటాత్రినాతిగా । సల్పిన శ్రీరాము
చరణంబులకు నమ । స్కారమనుము

భవతారకంబైన । పావననామమే
　　　　సతిజీవములు నిల్ప । జాలెననుము
తనసతిన్ గూర్రుఁడౌ । దనుజుండు హరియింప
　　　　నురకుంట తమబోంట్ల । కొప్పదనుము
దుఃఖంబు దిగమ్రింగి । స్త్రీయజాతీనిబోవ
　　　　దగుమార్గ మూహింప । ధర్మమనుము
రెండుమాసంబులే గడు । వుండెననుము
పరగ రాకున్న జీవముల్ । బాయుననుము
మిమ్మె దైవంబుగా మది । నమ్మెననుము
నెనరు నాయందు నొక్కింత । నిలుపుమనుము.

కపీంద్రా! నామరదితోఁ గూడ నామాటలుగా నిట్లు జెప్పుము.

* క. కూడని పరుసంబులు దను
　నాడిన యాఫలముగంటి । నను మింకను నా
　కీడుదలంపకు మనుమీ
　నాడిక రాకుండ మొఁగు । మనుకృపపుట్టన్.

హను—తల్లీ! అట్లే చెప్పి గడుపుమించకుండ నీనాథుని దోడ్కొని వచ్చెద. నిన్ను జూచుదను కాహారము విసర్జించితి. చూచితి. మిక్కిలి యాకొంటి తల్లీ! కొన్ని ఫలంబులు మెసవుట కాజ్ఞ నిమ్ము.

సీత—అట్లే తినిపొమ్ము.

హను—తల్లీ! అనుగ్రహింపఁబడితి. (అని రెండడుగులువైచి తనలో) ఇంతదూరముఁవచ్చి రావణునిజూడకుండ బోవుట ధర్మముగాదు. ఈ యశోకవనము పాడొనరించినచో భటులు నన్ను రావణుని చెంతకు దోడ్కొనిపోవుదురు. అప్పుడు రావణుని సంగతి కన్నుగొందుగాక. (నిష్క్రమించును)

## షష్ఠరంగము.

[హనుమంతుఁ డశోకవనము భాధానరింపుచుండఁ గొందఱు రాక్షసులతో నింద్రజిత్తు ప్రవేశించును.]

ఇంద్ర—సేనానులారా! మనయశోకవనంబును దగ్ధపటలంబొనరించి వానిదుర్మదంబడఁ జరుదెంచిన జంబుమాలిని, మంత్రిసుతసప్తకంబును, సేనానాయకపంచకంబును, దుద కక్షయకుమారునిఁ గూడ బొలియించిన యావనచరుం డెక్కడనుండెనో చూడుఁడు.

ఒకఁడు—(ముందునకుఁ జూచి) దేవా! అదిగో! ఒకకోఁతిగా డావృక్ష మధిరోహించి మనలను జూచి వెక్కిరించుచున్నాఁడు.

ఇంద్ర—(చూచి క్రోధముతో) ఓరీ మాయకోఁతిగా!

ఉ. దొంగవలెన్ వనంబునను । దూరి యశోకవనంబు నిట్లుగా
భంగముజేసితేల? వన । పాలుర నెల్ల వధించితేల? సే
నంగడతేర్చితేఁర? ర । ణంబునకున్ వడి గాలు ద్రువ్వుదే
సంగరరంగమందు మము । జయ్యనఁ గెల్వఁగశక్తియున్నదే.

ఓరోరి వనచరాధమా! నీతప్పు మన్నింపఁ దగినది కాదు.

చ. చరణములంటెనన్ సరియె । సంగరమున్ బొనరింపఁ జాలకన్
బరుగిడిపోయినన్ సరియె । పద్మభవాదులు నిన్నుబ్రోవ దు
ర్భరముగ బోరినన్ సరియె । ప్రాణముతో నినుబట్టి శత్రుభీ
కరుఁడగు రావణాసురుని । కాళ్ళపయిన్ బడవైతుఁ జూడరా!

హను—ఓరీ రాక్షసాధమా!

చ. వనచరుఁ డన్నమాత్రమున । వహ్వారె గెల్వఁగవచ్చునంచు నీ
మనమున నెంచివచ్చి యిటు । మాటలు పెక్కులు నాడెదేల రా
రణమొనరించి గెల్చుకొన । రాదె, ప్రగల్భము లాడినంత నే
ఘనుఁడవటంచు నెంచినను । గొప్పమటంచును వేసువాడనే.

క. మాటల పసయెంతైనను
వాటంబుగ జూపవచ్చు । బగతురపట్టన్
మాటల పసపనిచేయున?
పోటరి! రణభూమి నిల్చి । పోరుము నాతోన్.

ఇంద్ర—అట్లయిన నిదిగో బ్రహ్మాస్త్రప్రయోగము జేయుచుంటిని. కాచికొమ్ము (అని విడచును)

హను—(తనలో) బ్రహ్మదేవుని వరప్రాప్తి కేమఘనీయులు దీనితోఁ గట్టబడి రావణుని సందర్శించెదగాక. (అని మూర్ఛపోవును)

(ఇంద్రజిత్తు హనుమంతుని గట్టి తీసికొనిపోవును)

(తెరవ్రాలును)

సప్తమరంగము.

రావణుని దర్బారు

[విభీషణుఁడు, రావణుఁడు, హనుమంతుఁడు, కొందఱు రాక్షసులు ప్రవేశింతురు.]

రావ—ఓరీ వనచరాధమా! ఏమంటివి?

హను—బుద్ధి తెచ్చుకొని సీతామహాసాధ్విని శ్రీరామునకొసంగి మని యుండుమంటిని లేకున్న చచ్చెదవంటిని. ఓరీ రావణా!

*చ. ఉరవడి రాఘవాస్త్రతతు । లుగ్రతరార్చుల మింటనంట నీ
కరములురంబు నంగములు । గంఠము లాస్యము లంఘ్రులూరులున్
శిరములు మర్మముల్ బరులు । జించుచు ద్రుంచుచు నుబ్బి పాఱుచున్
మఱియులు సేయుచున్ నిగుడ । మూఁడుజగంబులు నిన్నుగాచునే

ఓ మతిహీనా! నావాక్యము లాలింపుము.

తే. గీ. ధాతవరములు గలవంచుఁ । దలఁపఁబోకు
మమర గంధర్వ కిన్నర । యక్ష రాక్ష

సాలిచేఁ జాపు రాకుండ । సాకుగాని
గాచు నే నరవానర । గణమునుండి.

రావ—ఓరి కోఁతిగా! దూతవని సంశయించి నిన్ను జంపుటకు విభీష
ణుని వాక్యములచే సంశయించి యూరకొనఁ బెచ్చు పెరిగి
ప్రేలు చుంటివే. నరవానరు లంత మహాబలశాలులేమి?
ఏమి గర్వముగా!

హను—ఓరీ రావణా! నేనిప్పుడు కట్టుబడియుంటినని యనుకొనకుము.
నాకీ కట్లోక లెక్కలోనివి గావు. నేను తలఁచుకొంటి నేని—

*మ తురగస్యందనమత్తవారణభట । స్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁగాల్చి సైనికసుహృ । త్పుత్రానుజశ్రేణి నె
త్తురుగ్రక్క బడగొద్ది చంపి మఱి మ్మ । త్యుగ్రతం బట్టి నీ
శిరముల్ ద్రుంపఁగ నేన చాలుగు జయ । శ్రీలబ్ధి వర్ధిల్లఁగన్.

కాని మా శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞాభంగం బగునని చూచుచుంటిని.

రావ—ఓరి ప్లవంగాధమా!

ఉ. దూతవటన్న సంశయము । దూరముగా వెసఁద్రోసి నాదు వి
ఖ్యాతబలంబు జూపి నిను । గండడగించెద నెవ్వఁడడ్డమై
గాతునటంచు వచ్చినను । గట్టి వధించెద వానిగూడ నీ
కూత లికెంత సేపుసినుఁ । గూల్చెద కాల్చెద జూచుకొమ్మికన్.

(అని మీదికురుకుచున్నాడు.)

విభీ—(రావణుని బట్టకొని) సోదరా! దూతను సంహరించుట
మిగుల దూష్యము. కావున వీనికి బుద్ధివచ్చునటు లేదేని యిం
కొక శిక్ష జేయుము.

రావ—అట్లయిన ఓయీ! రాక్షసులారా! ఈవనచరాధముని
తోకకుఁ బట్టినన్నిగుడ్డలు చుట్టి తైలముతోఁ దడిపి నిప్పంటించి
విడువుడు. (అని నిష్క్రమించును.)

రాక్షసులు — (హనుమంతుని వెదకికొని పోవుదురు)

హను — (మండుచున్న తోకతో మరల ప్రవేశించి) అమ్మా! లోకమాత! నీనామ సంస్మరణమువలన నాకీ యగ్ని చందనమువలె చల్లనై యున్నది. (ముందునకుఁ జూచి) ఈ లంకాపట్టణంబెల్ల వీతిహోత్రున కాహారం బగుచున్నది. కావలసిన పని నెఱవేఱినది. నాకింక నీయగ్నితో నేమిపని. (అని సముద్రము చెంత కరిగి యగ్ని నార్పుకొని) అమ్మా! సీతమ్మా!

* ఉ. రావణుఁ దుంచి లోకములు । ప్రస్తుతిసేయఁగ నిన్నయోధ్యకున్
భూవరపుంగవుండు గొని । పోయి మనోరథభోగసౌఖ్యముల్
వావిరి బొందుచుం నృపతి । వంద్యపదాబ్జము లొప్ప సర్వధా
త్రీవలయంబు నేలెడి మ । దిందెలకొందకు పోయి వచ్చెదన్.

(అని నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.





శ్రీరామచంద్ర.

# సంపూర్ణ రామాయణము.



## షష్ఠాంకము.



### విజయ రాఘవము.

స్థలము—లంకాపురంబున రావణుని దర్బారు.

[రావణుఁడు, విభీషణుఁడు, మంత్రి మఱికొందఱు రాక్షసులు ప్రవేశింతురు]

రావ—సోదరా! ఇప్పుడు నీవనునది యేమి?

విభీ—అగ్రజా!

*తే. గీ. తొలుత మూఁడుపాయంబులు । గొలుపకున్న
దుదిఁ గదా విక్రమోద్యోగ । మదియు రిపుఁడు
మత్తుఁడైయున్న నొరుచేత । నొత్తఁబడిన
వీతబలుఁడైనఁ జనుసంధి । నీతివిదులు.

అట్టియెడ దశరథాత్మజుం డప్రమత్తుండును, విజిగీషుండును, నధికబల సమేతుండును నగుటఁ బరులకజేయుండు. అదియునుఁగాక ధర్మం బెచటఁగలదో జయం బచ్చటనే స్థిరముగాదా? అగ్రజా! ఇట్లంటినని గినియకుము.

సీ. ఆశూర్పణఖ మాట । లాలించి భూమిజఁ
దగ ముచ్చిలఁబోవు । తప్పుమనది

మారీచు హితవుల । మన్నించి వినబోక
దప్పు గాతనిబంపు । తప్పుమనది
మనకెగ్గుఁ దలపని । ఘనుఁడైన శ్రీరాము
తరుణిదొంగిలినట్టి । తప్పుమనది
తుదకు మారుతిబోధ । మదికెక్కనీయక
తగనట్లు శిక్షించు । తప్పుమనది
యిన్నితప్పులు మనయందు । నెనయుచుండ
ధర్మమెల్ల వారలచెంతఁ । దనరుచుండ
నెంతబలమున్న వరము ల । వెన్నియున్న
మనల జయలక్ష్మి వరియించు । టరుట కల్ల.

కావున నాయీహితవాలించి, యీ లంకాపురంబునకుఁ జేటురాకుండ, నీకును మాకును నకాలమృత్యువు రాకుండ, యీదనుజకోటికి ముప్పుఘటింపకుండ సౌఖ్యంబుగ నుండుట కంగీకరించితి వయేని—

*మ. జగతీనాథుఁడు నీనెపంబునఁ బుల । స్త్యబ్రహ్మవంశంబుపైఁ
దెగ నంభోధిగడాకమున్న, కపుల । ద్వ్యాప్తిం దిక్కులాదిప్రె
ల్లగిలం గోట్రవకమున్న, లక్ష్మణుఁడు కీ । లాఘోరనారాచముల్
నిగుడింజేయక మున్న ఫుచ్చునుపలన్ । వేవేగ పృథ్వీసుతన్.

అగ్రిజా! నేనిట్లు పమ్కర్షముగా జెప్పుట కింకొక గోప్యవర్తనముగూడ గల దది యెఱింగించుచుంటి వినుము

తే. గీ. మున్నుఁ గమలగర్భునిజూడఁ । బోయి, తగవుఁ
దప్పి పుంజికస్థలయను । తరుణిఁగవయ
నలువ గనుఁగొని శపియించి । నాడు గాదె
పెరసతీమణిఁ బట్టిన । శిరములూడ.

ఈశాపమును మరచిపోకుము. సీతను విడువుము.

రావ—ఓరీ! శత్రుస్తుతిపరాయణా!

* తే. బలిమి మూఁడులోకంబులు । గెలిచి, దివిజ
సిద్ధయక్షాదికాంతలఁ । జెఱలుగొన్న
యట్టిదశకంఠు తమ్ముఁడ । వైననీకు
నీయధిరోక్తు లిటు నోరి । కెటులవచ్చె.

ఛీఛీ! ఇంక నామొగ్గలనిల్వకుము. నా యభివృద్ధిఁ గాంచి సహింపఁజాల కనూయవహించితివా కులపాంసనా! పొమ్ము. (మిక్కిలికోపముతో) పోకుండ నిల్చితివేని నిన్ను నొకమాఱు కాలఁదన్ని నిండుసభలో పరాభవించి పంపెదను. పొమ్ము. నీప్రాణంబులుంకఁ జూచుకొమ్ము.

వి—(లేచి)

*చ. చనకుమహాద్విరోధము । చక్కటిచెప్పిన నింతతప్పునం
గనలితి నీతిశూన్యులకుఁ । గార్యము లేటికిఁదోఁచు నిప్పుడే
యును బని లేదు నీవలన । నొప్పని నావచనంబులెల్ల నీ
వని మొన రాముచేఁ బడిన । యప్పు డెఱింగెదుగాక పోయెదన్.

(అని నిష్క్రమించును)

రావ—ఓరజనీచరులారా! విభీషణుండు డలుక వహించిపోయెను. రాముఁడెట్లును గపిసేనతో లంకాపురంబునకు వచ్చితీరును. వానితోఁ బోరుటకు మీరెల్లరును సిద్ధముగానుండుఁడు.

రాక్షసులు.—చిత్తము.

(తెర వ్రాలును)



ద్వితీయరంగము.

సముద్రపుటొడ్డు.

[రామ లక్ష్మణ, సుగ్రీవ, హనుమంత, అంగద, జాంబవంత
సుషేణాదులును, విభీషణుఁడును ప్రవేశింతురు.]

రామ—మారుతీ! నీ చెప్పునదేమి?

హను—శ్రీరామచంద్రా!

తే. గీ. నీతిమాలి రావణుఁ । డట్లు దూతఁబట్టి
సంహరించెద ననుచున్న । సమయమందు
దూత నేచుట మిక్కిలి । దోషమనుచు
బోధయొనరించి నన్నటఁ । బ్రోచె నితఁడు.

కావున నీతనికి మీరు శరణొసంగవచ్చునని నాయభిప్రాయము.

లక్ష్మ—అగ్రజా! మారుతివాక్యంబు లాలించియు నిట్లంటినని యన కుఁడు. ఈతని కొంతమాత్రమును నభయంబొసంగ రాదని నాయభిమతము. ఏమందురా?

మ. మనలో నున్నటులుండియుండి, మనస । న్మానంబు దా బొంది యే
యనుమానంబును గల్గనీయక, రహ । స్యంబెల్ల నేదోవిధం
బున లంకాపురి కందఁజేయుటకు నై । మోసంబుతో డన్ విభీ
షణుఁడే తెంచెనటంచు నెంచెదను నా । స్వాంతంబునం దగ్రజా!

అగ్రజా! రాక్షసుల మాయలన్నియును దొలుతనుండియుఁ జూచుచుం టిని గావున నింతధైర్యముతోఁ జెప్పుచుంటిని. నామనవి నించు కాలింపుఁడు

చ. అసురుల మాయలెల్లఁ దెలి । యంగలవారు నిజంబు లేరు, రా
క్షసులు రణోర్వి ఢీకొనిచ । క్కాపికి శత్రులఁ గెల్వలేరు, కా
న, సతతమెన్నిమాయల న । నంతముగా బచరించి శత్రులన్
గసిమసగంగఁ జేయుటకు । కైతవవృత్తి జరింతు రగ్రజా!

సుగ్రీ—శ్రీరామచంద్రా! లక్ష్మణుని హితవాక్యంబు లాదరింపఁ
దగినవి.

ఆ. వె. మాయ లేడియయ్యె । మారీచుఁ డానాఁడు
తపసిఁ వేషమూనె । దశగళుండు
మోసవృత్తియెంతొ । ముఖ్యమైవర్తించి
వైరితోడుత సహ । వాసములు ?

జాంబ—దశరథాత్మజా !

తే. గీ. వారిమర్వ్యాత్తివర్ణింప । వశముగాదు
తేనెబూసిన కత్తులు । తెలియరాని
విషపయోముఖకుంభముల్ । వీరుగాన
వీరి కభయప్రదానంబు । వీలు లేదు.

రాము—(చిఱునగవుతో) ఓ సోదరా ! మదీయ క్షేమాకాంక్షితులగు
నో హితులారా !

తే. గీ. శరణనుచు వేడు నెటువంటి । శత్రునైన
చేరిబ్రోవక విడచిన । వారు లేరు
సూర్యకులమునబుట్టిన । యార్యులందు
కట్టియెడ శరణార్థి నే । నెట్లువిడతు.

అర్క-కులంబున కపకీర్తిదేవఁ జాలను. నన్ను బాధింపకుడు.

చ. అడలితినంచు మాకు శర । ణార్థినటంచును వేడువానినిన్
విడువడటంచుఁ జెప్పుట మి । వేకమొ? వీడు విరోధియైననున్
విడ నభయప్రదానమిడ వేయియొ । లక్షయొ నశ్వమేధముల్
దడయక జేసినట్టి సుకృ । తంబు లభించును జుండిధాత్రిలోఁ.

శరణార్థిని విడచునంతటి పాపము లేదు. విభీషణుఁడే గాదు. రావణుఁడు
వచ్చి వేడినను గాచెదను. (అని విభీషణునితో) విభీషణా! యిటు
రమ్ము. ఏది యెట్లున్నను సరియే నీవు నన్ను శరణు వేడితివి గాన

నీకు శరణం బిచ్చితిని. నిన్నుమర్యాద పాలొనరించిన యా దశాస్యుఁబట్టి బిట్టుమార్చి లంకాపురంబునకు నిన్నుఁ బట్ట భద్రుంజేసెద. భయము బుడుగుము.

సుగ్రీ—ఓ సత్యమూర్తీ! ఆర్తత్రాణపరాయణా! మీరు శరణొసంగుట మాకు సంతోషమేగాని లంకాపురం బీతని కెట్లొసంగెదరు. రావణుఁడు శరణన్నచో నాతనికిఁగూడ బ్రోతునంటిరే, అప్పు డీతనికి లంకాపుర మియ్యంగలరా?

రాము—సుగ్రీవా! రాముఁడు శరణు వేడినవాని నయోధ్యాపురి కభిషిక్తుంజేసెదను. ఇఁక కాలయాపనమేల? వారధిగట్టుటకై యత్నింపుడు.

సుగ్రీ—చిత్తము.

రాము—విభీషణా! నేఁటినుండియు నీవు నావాడవు. నన్నుఁజేరిన వారిని కష్టములు జేరవు నీవిందు సుఖంబుండి మాకు నీచే నైన సహాయంబు జేయుచుండుము.

విభీ—చిత్తము. (తెరవాలును.)

తృతీయ రంగము.

లంకాపురి యుద్ధరంగము.

[రాముఁడు సైన్యసమేతుఁడై ప్రవేశించును.]

(తెరలో)

అయ్యో! నాధా! నాధా! త్రిలోకాధినాధా!!

మ. రణభూమిం మిము గెల్వఁ దగినట్టి / ర్యం బేమి లేకుంటచే
నను మర్దింపఁగఁ జూచుచుండి రకటా / నాచావువిన్నంత మీ
రుఁరుఁజావంగలరంచు నెంచుచును శ / త్రుల్ గాంచి యీసీతఁ గా
చినపుణ్యంబును నీవు గట్టుకొనఁగా / శ్రీరామ! వే వేగ రా!

రాము—(విని) ఆఁ ఆఁ! ఎవ్వరి దీయాక్రందనము ?

హను—(శీఘ్రముగాఁబ్రవేశించి) త్రైలోక్యపాలకా! ఇంకేమున్నది ?

శా. మాతల్లిన్ జగదేకపూతచరితన్ । గూర్చన్ ధరాజాతనిన్
సీతన్ గ్రూరుఁడు యింద్రజిత్తుఁ గడు దు । ష్టుండుగ్రార్యంబుతో
సీతోనే శనిపోవు లంకకనుచున్ । నిందించి నిందించి, చే
జేతన్ సంహరణంబొనర్చెనయయో । స్త్రీ--అంధుడై నిర్దయున్.

రాము—హా! సీతా! నను వీడిపోయితివా? నేనింకెవ్వరికొఱకీయుద్ధము చేయుదును?

సీ. నిన్నుఁ బొందుటకె వా । ర్ధిధికి వారధిఁగట్టి
కష్టంబునకునోర్వఁ । గలిగినాను
నిన్ను రక్షింపగా । నెన్ను చుఁగపులతో
శీఘ్రంబుగాఁ జెల్మి । చేసినాను
నిన్నుఁగావఁగమది । నిశ్చయించుటఁ జుమా
గొప్ప మిత్రులచావు । కొప్పినాను
నీకష్టములుదీర్చు । టే కోర్కెగా దుష్ట
దనుజులతోఁబోర । దలచినాను
మూషువంతులు జయమును । బొందినాను
రావణుని యింద్రజిత్తు నీ । రణమునందు
మారణమొనర్చి వేగ నిన్ । జేరిసుఖము
గొనఁదలంపఁగ ననువీడి । జనితె దివికి

సీతా! సీతా! హా ప్రియా!!! నేనింకేమిచేయుదును. (అని విచారించును)

లక్ష్మ—హా! త్రిలోకైకమాతా! నీ కెంతలో నెంతమరణము సంభవించెను.

సీ. నిత్యసత్యవ్రత । నియతుండై నెగడెడి
దశరథు కోడలై । దనరుచుండి
పరమపూజ్యుండన । బరగు శ్రీరాముని
యర్ధాంగ లక్ష్మివై । యలరుచుండి
పరమపావనియగు । వసుమతిపట్టివై
కన నయోనిజవయి । గ్రాలుచుండి
ముల్లోకములలోన । పూతచారిత్రవై
పతితపావని వన । బరగుచుండి
నెగడు నీవంటి తల్లియే । నిన్నుఁ గావ
దిక్కు లవమైన లేకుండ । దిక్కుమాలి
క్రూరుఁ డౌయింద్రజిత్తుచే । కూలినావె
కడకు మేమెల్ల దుఃఖ సా । గరమునఁ బడ.

విభీ—(ప్రవేశించి) వాయుసూతీ! రామలక్ష్మణు లేలచింతించుచున్నారు?

హను—విభీషణా!

ఉ. ఏసతిఁ గావఁగాఁ దలఁచి । యిట్టిసముద్రము లెల్లదాఁటి యీ
కోసలనాథుఁ డిచ్చటకుఁ । గోర్కెమెయిన్ జనుదెంచినాఁడో యా
భాసురగాత్రి సీత బల । వంతముగా నల యింద్రజిత్తు ఘో
రాసినిజంపివైచె నకటా! మనయత్నము లెల్ల వమ్మవన్.

విభీ—(ఇంచుకాలోచించి) శ్రీరామచంద్రా! కేవల మొకమానవుని విధంబున నీవు విచారింపఁ దగునా? నీ వెఱుంగని దేమిగలదు? త్రిలోకపావనియగు - అయోనిజయగు - మీయర్ధాంగలక్ష్మిని వధియించుట కొకదుష్టరాక్షసునితరమా? ఆమె యాదిలక్ష్మి గదా? మీరు కేవలము పరమేశ్వరులేగదా? అట్టిమీకు దుఃఖములంటునా? ఆయమ్మకుఁ జావుగలదా? దేవా! ఇట్లేటికడలె

దన్న? ఇంద్రజిత్తుచే వధింపఁబడినది మాయసీతగాని మాజనని యగు నయోనిజఁ గాదు. మాయాసీత మరణమును విని, యథార్థమగు సీతయే మరణించినదని మీరునమ్మి, యుద్ధముచేయుటకుం డనైనఁ బోఁపరనియు, లేదా నేటికి రణము చాలింతురనియు, నీలోపున మిమ్ము జయించుట కొక హోమము నిర్విఘ్నముగాఁ జేసికొనవచ్చుననియు దలంచి మేఘనాథుఁ డిట్టి యుక్తిఁ బన్నియుండును. రామచంద్రా! ఇది విచారించుటకు సమయముగాదు. వెంటనే చిరంజీవి లక్ష్మణుని సైన్యసమేతముగా నింద్రజిత్తుపైకిఁ బంపుము. ఇప్పుడీహోమ విఘ్నం బాచరించితిరయేని యింద్రజిత్తు నిమిషములో చచ్చును. ఇదివఱకే రాక్షససైనికులలో జేరెన్నికఁగన్న వారెల్ల నడఁగిరి. కుంభకర్ణుఁడు కూడఁ గూలెను. ఇప్పుడింద్రజిత్తుచచ్చినచో రావణుఁడు ఱెక్కలుదెగిన పక్షియై పోవును. కావున సంశయింపకుఁడు. అది మాయాసీత మరణముగాని యథార్థమగు సీతామరణముగాదు. ఆశీర్వదించి లక్ష్మణుని బంపుఁడు.

లక్ష్మ—(లేచి) అగ్రజా!

మ. అనుమానింపకుఁ డింక వేగముగ నా । శీస్సులందించి యా
రణభూమిస్థలి కంపినంతనె । యరిప్రాణానిలంబుల్ హరిం
చి నిమేషంబున యాక్షణంబె జయలక్ష్మిని దెచ్చి మీమస్తకం
బున ప్రేమంబున నిల్పువాఁడ ననఘా । పొమ్మంచు వే బల్కవే

రాము—సోదరా! అట్లేపోయి జయలక్ష్మిఁ బొందిరమ్ము. ఇంద్రజిత్తు దెగెనేని రావణుఁడు గూలినట్లే. కావున వేగఁ బొమ్ము నిన్ను శుభదేవతలు రక్షించుఁగాక.

లక్ష్మ—ఓ కపిపుంగవులారా! మీరందఱును నావెంటరండు. రణభూమికిఁబోయి యింద్రజిత్తుని వధింతము. (నిష్క్రమింతురు)



తురీయరంగము.

[యుద్ధరంగమున నింద్రజిత్తు, లక్ష్మణుఁడు ప్రవేశింతురు.]

లక్ష్మ——ఓరీ రాక్షసాధమా! వెనుకటిప్రజ్ఞావిశేషంబులం దలంచుకొని గోలమూఁగిసి, మూఁగిసిపడిపోయెదవు?

ఉ. లాఘవము విక్రమంబును బ । లంబును, శౌర్యధైర్యముల్
జేవయు, శక్తియుక్తి లవ । లేశమునైనను నీకు నున్నచో
యీవరుసన్ బ్రలాపముల । నెమ్మొయి నాడక బోరనిల్వరా
రావణకూర్మినందన! ప । రాక్రమమెంతయొ నాదిజూపెదన్.

ఓరోరి శూరమ్మన్యా!

క. వెనుకటి యాట్లరివీరుని
రణమున మూర్ఛిల్లఁ జేయ । లాఘవమనుచున్
మనమునఁ దలఁచుచువచ్చితె
చెనటీ నిలుమింక లేదు । క్షేమము నీకున్

ఇంద్ర——ఓ, ఆత్మస్తుతి పరాయణా!

శా. పేలిలన్ పచ్చును యెట్టులైనను, రణో । ద్వాన్నిల్చి శూరత్వ మిం
కేలాజూపఁగలాడవో తులువ! యే । దీ నీలావు నీదర్పమున్
చాలం జ్గిన శౌర్యధైర్యములు నీ । శక్తిన్ మహాయుక్తినిన్
చాలంజూపి రణోర్విగెల్చుకొను వా । చాటా! ననున్ వేగమే.

[అని బాణములను విడచుచు- లక్ష్మణుఁడు వాని నుపసంహరించును.]

ఇంద్ర——ఓరీ యనలక్ష్మణా!

కం. చాపాభ్యాసవిశేషము
పాపాత్మా గలదటంచు । భ్రమపడకుము నీ
చాపము ద్రుంచితి యిదె గను
మీవరి నాగాస్త్రము నిను । నీల్గఁగఁ జేయున్.

(అని నాగాస్త్రంబును విడచును)

లక్ష్మ—(దానిని సంహరించి) ఓరీ దనుజాధమా !

కం. ఉరవడి నాగాస్త్రంబిక
హరియించు నన్నటంచు । ననుకొనకు మిదే
గరుడాస్త్రంబును విడచెద
సురవైరీ దీనిబలము । చూడుము వేగన్.

(అని యాకర్ణాంతముగా పిల్లెక్కు వెట్టి)

తే గీ. రామచంద్రుండు సద్ధర్మ । రతుండ యేని
యవనిజ సుమహాపతివ్రత । యగునేనియేని
దైవకృపమాకు నిజముగా । దనరునేని
యింద్రజిత్తును బరిమార్చు । నీక్షణంబ.

అని నమస్కారపూర్వకముగా బాణము విడచును. ఇంద్రజిత్తు హాహాకారము నర్చుచుం బడిపోవును. దేవదుందుభులు మ్రోగును. వానరులు జయజయధ్వానము లొనర్తురు. రాక్షసులు హాహాకారము లొనర్తురు.

(తెర వ్రాలును.)

[మరల నదే యుద్ధరంగమున రావణలక్ష్మణులు ప్రవేశించుచున్నారు]

రావ—ఓరీ! లక్ష్మణా! ఎక్కడికి బోయెదవు. నిలు నిలు.

చ తనయుడు కూలినంతటనె । ధైర్యమువీడి రణంబు చేయుగాం
వెనుకకుదీసి సంధి కిక । వేడెద మిమ్ముని నెంచినావె ఛీ
మనుజుల లెక్కసేయుదునె । మాటలతో బని యేమి నీ విదే
సునిశిత బాణజాలముల । సుక్కడక నిల్వుము ప్రజ్ఞగల్గుచోన్.

లక్ష్మ—ఓరోరి దనుజకులబడబానలా !

చ. తనయుడు చచ్చిపోయెనను । దైన్యము లేకయె కుంభకర్ణు డా
జిని మరణించెనేయనెడి । చింతయులేక విభీషణుండు రా
ముని పదపద్మముల్ గొలువ । బోయినన దుఃఖము లేక సైన్యముల్

దనుజులు నిష్టబంధువులు బ । లాఢ్యులు చచ్చిరటన్న బెంగచే
దనువుదొరంగఁబోక బల । దర్పితువౌచు నిటేలవచ్చితో.

దైత్యాధమా! మొన్నటివరకుఁ గలకలలాడుచుండెడి లంక నీ కారణమున శోభావిహీనమై-శ్మశానసహితమై- మాటవరుసకైనను పురుషుఁ డను మాట లేకుండఁబోయినది. ఇంకను నీకు బుద్ధిరాలేదా ? జీవములపై నాసలేదా ?

రావ—ఓరోరి నరాధమా! నన్ను బెదరింపఁజొచ్చితివా ?

కం. నా కన్నుల యెదుటంబడి
యేక్రియ నిఁక బ్రతికిపోదు । వెవ్వరు నిన్నున్
జేకొని బ్రోవ సమర్థులు
నీ కిఁక గతిలేదు చావు । నిక్కము తులువా ?

నీ వింద్రజిత్తుచే మరణింపలేదని కులుకకుము. నీ ప్రాణంబులుం గొనుటకిదే యస్త్రము కాసికొమ్ము.

[అని బాణమును విడచును. సౌమిత్రి మూర్ఛిల్లును. అసురులలో జయజయధ్వానములును, వానరులలో హాహాకారములును బయలుదేరును. రావణుఁడు నిష్క్రమించును. రెండవవైపునుండి శ్రీరామ, సుగ్రీవ, అంగద, సుషేణ, జాంబవంత, విభీషణ హనుమంతులు ప్రవేశించుచున్నారు.]

రాము—(లక్ష్మణునిజూచి బిరబిరజని యాతనిపైఁబడి) హా! సోదరా! సోదరా!

చ. అడవికి వచ్చువాఁడు ప్రియ । మారఁగ నీ జనయిత్రి నిన్ను నా
కడలుచు నప్పగించెను ధ । రాత్మజకై నిను జంపుకొంటి త
ల్లడమున నింటికేగఁగ నా । లక్ష్మణుఁ డేడని చిన్నతల్లి న
న్నడిగినఁ బొట్టఁబెట్టుకొని । యుల్లనవచ్చితినంచు నందునే.

అయ్యో! సోదరా! నీకు నా మొదల భక్తియపారమే అట్టి భక్తి యెల్లఁ బోనాడి నన్ను వీడిపోయితివా? సోదరా! నీ వంటి సోదరుఁడింక నాకు దక్కునా? నిన్ను విడచి నే బ్రదుకఁగలనా?

*కం. ఎలనాగలుఁ జుట్టంబులుఁ
కలుగుదు రెచ్చోటనైనఁ। గరమురు దారం
దలఁప సహోదరు నేఁమిం
గలుగఁగ నెచ్చోటఁబడయుఁ। గాఁ దరమగునే.

సుషే—(లక్ష్మణుని బరీక్షించి) శ్రీరామచంద్రా!

*తే. గీ. నిద్రినొందినచందంబు। నెరయునితని
హృదయపంకజ మల్లన। యదరుచున్న
దినకులేశ్వర నా వాక్య। మెలమి నమ్ము
మితఁడు సప్రాణుఁడై యుంట। యింతనిజము.

వెనుకటివోలెనే యీతఁ డిప్పుడుగూడ మూర్ఛిల్లియుండెను మరల వాయుకుమారుని ద్రోణాచలమునకుఁ బంపి, సావర్ణ్యకరణి, సంధానకరణి, సంజీవకరణి, విశల్యకరణియుఁ దెప్పింపుడు. ఈతఁ డరుణోదయముగాకుండ నయ్యౌషధములు దెచ్చినచో నితనికి బ్రాణాపాయమురాదు. వేగబంపుడు.

హను—శ్రీరామచంద్రా! వెంటనే వెడలివచ్చెద నా కనుమతి యొసంగుఁడు.

శ్రీరా—మంచిది. నాయనా! నిన్ను శుభదేవత లోఁగుగాత. వెడలి రమ్ము. (హనుమంతుఁడు నిష్క్రమించును.)

(అప్పు డొక వానరభటు డరుదెంచును)

భటు—శ్రీరామభద్రా! అవధారు. దశకంఠుండు రణంబున మిమ్ము నిగ్రహింపఁజాలక, శుక్రాచార్యుని యనుమతిపై మిమ్ము నిగ్రహించుటకుఁగాను మిక్కిలి రహస్యంబుగా బాతాళహోమము

జేయుచున్నాఁడు. నిర్విఘ్నముగా నీచరిత్ర మాతనికిఁ గొనసాగనేని జయలక్ష్మి యాతనిఁ దానవాధముని వరించి తీరునని శుక్రాచార్యుండు చెప్పఁగా నేను వింటిని. వెంటనే రావణుఁడు హోమమునకు గడంగెను.

విభీ—ఓయీ! హోమముచేయుచున్న స్థలము నీవు చూచివచ్చితివా!

భటు—ఆహా! చూచియేవచ్చితిని.

అంగ—శ్రీరామభద్రా! ఆతనిహోమమునకు విఘ్నమాపాదింప నన్నుఁ బంపుము. చూడరాని యొకదుర్భరావస్థఁ జూచినప్పుడు గాని యాతని యాగమునకు విఘ్న మొదవదు. అట్టికార్య మేదైన నూహించి నే నాతని యాగ ధ్వంస మొనరించెదను.

విభీ—అంగదా! నీకొక వృత్తాంతమెఱింగించెద వినుము. నీవు వాలి వలన మండోదరి కుద్భవించితివి. అందుచే మండోదరి నీవంటి నను భాసము లేదు. కావున నామె బలవంతముగా యాగము జేయుచున్న రావణుని మ్రోల బరాభవింపఁ గడంగినచోఁ దన భార్య నా యవమానమునుండి రక్షింపుటకై నిన్నుఁ బొలి యింప వచ్చితీరును. అప్పుడు నీ వాతనికిఁ జిక్కకుండ నిచ్చటకు రమ్ము. యాగవిఘ్నం బగును గాన శ్రీరామునిచే నాతఁడు మడసి తీరును.

అంగ—మంచిది. (అని నిష్క్రమించును.)

రాము—(ఇటునటుఁ జూచి) అహాహా! ఏమిది?

తే. గీ. వాయుసుతుఁ డోషధులకై యు బోయి మగిడి
రాకయుండెను, మూర్ఛ దేఱకయయుండె
సోదరుఁ డింకెట్లు గడతు నీ శోకవార్ధి
ద్యుమణి యుదయించుచున ట్లదే దోఁచుచుండె.

(క్రోధముతో నిల్లాకర్ణాంతముగాలాగి)

ఉ. వాయుసుతుండు నోషధుల । వారిరీతిలీలను దేకమున్న శు
శ్రీయుతుఁడైన సోదరుఁడు । జెచ్చెరమూర్ఛను దేరకుండ న
న్యాయముగాను నీ వుదయ । మందితి వేని క్షణంబులోన ని
న్నేయుదు నొక్కకోల, మఱి । యేనును జత్తు నినుండ యిప్పుడే.

[తెఱలో]

తే. గీ. త్వరపడకుమయ్య రాఘవా! । త్వరపడకుము
వాయుపుత్రు డోషధులతో । వచ్చుచుండె
నోషధుల కాంతియేగాని । యోషధీశుఁ
డుదయమగు జాడగాదయ్య । మోదము గనుము.

జాంబ—జయము, జయము. శ్రీరామచంద్రా! హనుమంతుఁ డోష
ధులను దెచ్చుచుండెను.

విభీ—(చూచి) స్వామీ! ద్రోణాచలముపైనున్న యోషధులను
గుర్తింపఁజాలక యా పర్వతంబునే వాయుపుత్రుండు పెకలించు
కొని వచ్చుచున్నాఁడు.

సుషే—(చూచి) అదిగో! ఆపర్వత మాబయలునందుంచెను. రామ
చంద్రా! నేను వెడలి యోషధులను దెచ్చెద. (అని నిష్క్రమి
ంచి యోషధులతోడను హనుమంతునితోడను మరలఁ బ్ర
వేశించి యోషధులు లక్ష్మణుని నాసికారంధ్రంబుల కడ
నుంచి) సౌమిత్రీ! లెమ్ము.

లక్ష్మ—(మూర్ఛదేఱి) ఓరోరి దుష్టమార్గానువర్తీ! దశకంఠా!

చ. ఘనభుజసారవిక్రమ మఖండముగాఁగల నన్నుఁగేవ్వఁజా
లిన రణకోవిదుల్ గలుగ । రేదునటంచును గర్వమేల? రా
మునిదరిజూపు నీబలము । పూర్ణముగాఁగల శక్తియుక్తులన్
జెనఁటి క్షణంబులోన నిను । జెండుదు నాలుని వీటికంపెదన్.

రాము—సోదరా! ఆగుమాగుము. రావణుఁ డిప్పుడు పాతాళహోమ మొనరింపఁబోయి యున్నాఁడు. ఆదాఠ్యాభ్యుని హోమవిధ్వంసం బొనరించి రణభూమికి న్డొక్కఁసిరా యంగదుండు వెడలెను. శాంతింపుము. (అని హనుమంతుని గాఁగిలించుకొని) వాయుపుత్రా!

సీ. తొలుత సుగ్రీవుని । లలితమైత్రిని నాకుఁ
గలుగఁజేసిన మహా । ఘనుఁడవీవె
నాకష్టములుదీర్ప । వీకమై సంద్రంబు
క్షణములో దాఁటిన । ఘనుఁడవీవె
జానకిఁ గనుఁగొని । సత్వరమే దెల్పి
నను బ్రోచినట్టి యా । ఘనుఁడవీవె
సంజీవి వెసదెచ్చి । సౌమిత్రి ప్రాణముల్
గరుణతో నిల్పిన । ఘనుఁడవీవె
నీవొనర్చిన యుపకృతుల్ । జీవముండ
మరువగలనొక్కొ— మరచిన । మాఁకుఁగలవె
పుట్టగతులు- శుభముగా మిక । నెట్లుదీర్తు
సంజనీదేవి వరపుత్ర । యాంజనేయ.

హను—తండ్రీ! మీయనుగ్రహ పాత్రుండ నగుటయే నాకు శుభము

రాము—ఆర్యులగు నోకపిపుంగవులారా! మనము గుడారములకు బోదము రండు.

అందరు—చిత్తము.

(అని నిష్క్రమింతురు.)



## పంచమ రంగము.

### రావణుని పాతాళహోమము.

రావ—(దీక్షతో హోమముఁ జేయుచుండును)

[అప్పుడొక రాక్షస భటుఁడు శీఘ్రముగాఁ బ్రవేశించును.]

భటు—ఓ నక్తంచర సార్వభౌమా! తమ్మెదుర్కొను వారెవ్వరును లేరను మహాధైర్యంబున వానరులెల్లరును పురప్రవేశ మొనరించి ఘూర్ణమానార్ణవోద్దీర్ణులై గర్జిత్పర్జన్యసమూర్జితులై సింహనాదంబుల దిక్కులు పిక్కటిల్ల నార్చుచు "ఏడీ రావణాధముఁ డెచ్చట! ఎవ్వనికిఁ జెప్పరేమి యని కనంబడిన వారి నెల్ల స్త్రీబాల వృద్ధాదులను వివక్షత లేకుండ వధించుచుండిరి. వృషశాలలో ప్రవేశించి రథంబులను విఱచుచుండిరి కరిబలంబును గండడఁగించుచుండిరి. అశ్వంబులం జంపుచుండిరి. ఆయుధంబులన్నిటి బాఢోరించుచుండిరి. ధనాగారములు దోచుకొనుచుండిరి. రమ్యహర్మ్యము లన్నియు నేలమట్టము గావించుచున్నారు మహాప్రభూ! వారి దౌర్జన్యమునకు మేర లేకుండఁ బోయినది. నీ వుపేక్ష సహించినచో నింకొక్క దివసములో లంక నేల మట్టంబయిపోవును. ఒక్క ప్రాణియు నీకంటఁ బడదు. రమ్ము. రమ్ము. హోమము మాతరువాత జేయవచ్చును ఆ వానరాధముల నావలకు దోలుము. చావగా మిగిలినవారిని గాపాడుము. (చూచి) అదిగో! అదిగో! ఆ వానరాధములిటే వచ్చుచున్నారు. లెమ్ము. లెమ్ము. వారరుదెంచిరేని నిన్నింక నీ హోమము చేయనిచ్చెదరా? నిన్నే హోమము చేయుదురేమో? (అని పాఱిపోవును.)

(అప్పు డంగదుఁడు మండోదరి నీడ్చి తెచ్చి)

అంగ—ఓరీ రావణా! ఇటు చూడుము.

శా. మాయాకృత్యవిశారదుండయిన యా । మారీచుతోఁ గూడి
యన్యాయప్రక్రియవృత్తివై వనములో । నా రామువంచించి
చౌర్యాయానంబున గోప్యమాంఘతరబా । హాశక్తి యోగాడి దై
న్యాయత్తుండవ పోలెఁ దెచ్చితివి నీ । వాధారుణీ నందనన్.

నేనిదె బాహుసత్వమున । నిక్క నిశాచరు లెల్లఁ జూడఁగాఁ
బూని నిరర్గళక్రమ వి । భూషితవిక్రమసాహసంబుతో
మానితమైన నీ మగువ । మానుగ దెచ్చెద జూడు మిప్పుడో
దానవనాథ చూపు భుజ । దర్పము లెన్నఁటికింక దాఁపఁగన్.

రెమ్ము. లెమ్ము. నీభార్య నీయవమానమునుండి తప్పింపుము
పాడో—(విచారముతో) ప్రాణేశ్వరా!

క. శంక యొకింత లేక త్రిది । శవ్యాఘ్న రావణుస్వామి సుందరిం
గొంకక వానరుండొకఁడు । గొబ్బున ముందల పట్టియీడ్చె నీ
లంకకు నేఁడిదిక్కుగఁగ । యుక్తమై ఘనమైన కార్యశః
పంకము నిన్ను మించె నుద । పానము నేనుగు ముంచు చాడ్పునన్.

౩౦ కెందుల కీపాతాళహోమము పెరవాని భార్యలకై కీర్తాపత్రయ
వెంగులకు? నీభార్యను రక్షింపరాదా? మానాభిమానములు
పోయిన తరువాత హోమమోదులకు? జయమెందులకు? హే
యంబులగు జీవంబు లెందుకు? జీవితేశ్వరా రమ్ము.

చ. కృతమిది కార్యమెల్లఁ బరి । కించిన సిద్ధియు లేకుగావునన్
గతజలసేతుబంధనము । కైవడిఁ జూడ నిరర్థకంబు దీ
నతఁబగవాని చేఁబడిన । నాదెస జూడవు వీని భస్మసా
త్కృతముగఁ జేయనేల తమ । కింపవు రాక్షసలోకనాయకా.

చిచ్చొపడిగట్టి తెచ్చినవిధంబున సీతను దెచ్చితివి. ఒక్కవనితకై నెల్లరఁ
బోఁగొట్టుకొంటివి. నిజభార్యాపరాభవము గండ్లారఁ జూచు
చుంటివి. నీకిది తగదు. వైళంబ రమ్ము. నన్నుఁగాపాడుము.

రావ—(తనలో) ఛీ! హోమవిధ్వంసమైనది. (అని లేచి) ఓరోరి వానరాధములారా! ఏమీ కండకావరము? నాయర్ధాంగి లక్ష్మిని విడచెదరా? లేదా?

అంగ—(మాటాడ కూరకొనును)

రావ—ఇంకను విడువవేమి? (అని బాణములు విసరును అంగదుడు వెడలును.)

రావ—నెచ్చెలీ! విచారింపకుము పూర్వకర్మపరిపాకంబున నీకిట్టి పరాభవము సంప్రాప్తించినది దైవయత్నమట్లున్నది. అది తప్పింప మనతరమా?

తే. గీ. రణముఖంబున శత్రుల । రామలక్ష్మ
ణులను వెసజంపి జయలక్ష్మి । నెలమిగొందు
కాకయుండిన రాముచే । గదనమందు
చచ్చిసంతోషమునబోదు । స్వర్గపురికి.

మండో—జీవితేశ్వరా! రణముఖంబున నీవు శత్రుమర్దనము జేయుటసంభవము. శ్రీరాముని మహిమావిశేషంబు లన్నియు నీకెఱింగించియే యున్నదానను. అట్టిమహానుభావునిఁ జెనకనీతరమగునా? నామాటవినుము.

రావ—ఓసీ! నీవిషయంబు లేమియు నాకింకఁ జెప్పవలదు.

*చ. ఎఱుఁగుదుఁ బద్మబాంధవ కు । లేశుఁడు పంకజనాభుఁ డౌటయే
నెఱుఁగుదు నాన్న యిందిర య । హీనుశ్రయై తనగారుసీతఁగా
నెఱుఁగుదు వాకు రాఘవ ను । హీనుని చేతి వధక్రమంబు ని
క్కెఱిఁగియు ముక్తిఁబొందఁగ న । భీష్టముగల్గుట నింత జేసితిన్.

*చ. ధరణితలేశ దివ్యశర । దత్తసువర్ణభముక్తి కామినీ
పరిణయ మంగళోత్సవము । భాగ్యమునంజనుదెంచెఁ గానయ

త్వరితరమై యీశుభ ము । హూర్తము తప్పకయుండ నేఁగి నే
నిరతిశయానుభావపద । నిశ్చలసుస్థితిఁబొందియుండెదన్
* చ. అమితబలుండు రాఘవుఁడు । యాజకుఁడై నఁ దదస్త్రవహ్ని సా
క్ష్యమున మదీయసాంద్రతర । కాండశతాహుతు లొప్ప తేల్చి మో
దమునను ముక్తికాంత నిర । తంబుఁ మంగళలీలఁ బెండ్లియై
విమల తదీయభోగపద । విస్ఫురితసౌఖ్య నిరూఢి బొందెదన్.

ఇంక నామనోనిశ్చయము మాన్ప నీతరముగాదు. పొమ్ము. పొమ్ము. నాకు మరణ మాసన్నం బౌటచేత నే నాహోమము నిర్విఘ్నంబుగాఁ గొనసాగినది కాదు.

మండో—హా! పరమేశ్వరా! (అని మూర్ఛిల్లును)

రావ—(ఆమెను కంటఁజూడకయె విల్లమ్ములు బట్టుకొని రణభూమికి వెడలుచున్నాఁడు.)

తెర వ్రాలును.



యుద్ధరంగము.

[శ్రీరామవిభీషణులు ప్రవేశించుచున్నారు.]

శ్రీరా—విభీషణా!

* మ. తలలుం జేతులు ద్రుంచి వేసరితి నుగ్రత్వోద్ధిమైపోరి దో
ర్బలముం జేవయుఁ జూపియే నిసిగితిం । బ్రత్యర్థి నే చొప్పునన్
గెలువన్వచ్చును నీ కస్త్రములచేఁ । గీడ్పాటు వాటిల్ల దో
విలయుం బారయ నీసునుందవొకొ భా । వింపంగ నే చందమో?

ఇంకేమిచేయుమందువు?

విభీ—స్వామీ!

* చ. ప్రముదిత మానసుండగున । బ్రహ్మవరంబున నీని నాభియం
దమృతముకుండలాకృతి మహత్వమునం దగనుంటఁజేసి మూ

ర్దములును జేతులుం దెగియు । దత్క్షణమాత్రిన పుట్టుచున్నవీ
క్రిమమున జావు లేకునికి । కారణమై యలగారు రాఘవా !

రావ—(మహాక్రోధముతోఁ బ్రవేశించి)

చ. రణమున నన్నుఁ గెల్చెడి ప । రాక్రమమేమియు లేకపోయినన్
ఘనమగు నాత్మసంస్తుతిని । కావరమంది యొనర్చుకొందు దా
వనచరయూథముం గలసి । వచ్చి యనామకున్ వధించి దా
మనమున బొంగుచుండు నర । మాత్రుఁడు రాముఁడు బాఱిపోయెనే

రామా! పాఱిపోకుము. పాఱిపోకుము. నిలు. నిలు. నీవు పాఱిపోయి
నను నా బాణముమాత్రము నిన్ను బాఱిపోనీయదు.

రాము—ఓరోరి దైత్యకులాధమా!

*మ. తగునే సుక్షేత్రఁ జెక్కుపంతములలోఁ । దర్పంబుతో నాడి యి
ట్లుగడున్ నిర్వాజగందియుండఁగ భుజా । టోపంబు దా నెంచఁబో
యె గుణంబుల్ దలపోయ కాడెదవు నీ । వీ భంగిఁ బోల్చెద నన్
నగరే నీ పరిహార లింపులకు నో । నక్తంచరాధీశ్వరా!

రావ—రామా! నన్ను జూచి నవ్వెదరో నవ్వరో నేనెఱుగను గాని
నిన్ను జూచిమాత్రము నిశ్చయముగా నవ్వెదరు. కారణ మేమం
దువా?

చ. వనముల శాఖశాఖకును । బర్విడుచుండి వికార చేష్టలన్
ఘనముగఁ జేయుచున్ నరుల । గాంచిన యంత నె పాఱిపోవు నీ
వనచరులెల్ల వీరులని । భండనభూమికి దెచ్చినట్టి ని
న్గనుగొని లోకులెల్లరు హ । సింపక నవ్వకయూరకుందురే.

ఓనరాధమా! నీబుద్ధి లేమియే నిన్నింటఁ బడియుండనీయక నిన్నిట్లు బ్రే
రేపించినది గాని—

సీ. అష్టదిక్పాలుర । నట్టి రణోర్విలో
దాసోహ మనిపించి । దనరినట్టి

కైలాసగిరి నెక్కి-|కరముచే బైకెత్తి
భుజసారమున కీర్తి | బొందినట్టి
చంద్రార్కు లిర్వురు | సరిగదా యాజ్ఞలో
వాసిగాఁ దిరుగంగ | జేసినట్టి
ఖేచరామరయక్ష|కిన్నరభుజగుల
నుగుమాడి సత్కీర్తి | నొందినట్టి
ధన్యుఁడగు రావణుఁడన సా|మాన్యుఁడనుచు
బుద్ధిలేమిని దలపోసి | యుద్ధమునకు
మర్కట సహాయమున వచ్చి | మామకీన
తతశరాసనకీల కా | హుతుఁడ వైతి.

దశరథనందనా! నామాట వినుము. నీయాలిని నేనాశించుటచే నీవు నా కాలిపంకచుట్టమవైతివి. నిన్నుఁ జంపినచో జానకి విచారించును. ఆమె మ్లానవదనంబును నేను జూడంజాలను. కావున నీకింతదూరము చెప్పవలసివచ్చినది. నేజెప్పునది యేమందువా?

మ. బవరంబందున నన్నుదాకి గెలువన్ | బ్రాప్తంబు లేకుంట వి
ప్లవముఁ వేగమె గట్టిపెట్టి మఱి నా|పాదంబులన్ వ్రాలి నీ
యువతిన్ గొన్నిదినాలు నాకొసఁగి యా|యుర్వృద్ధినింబొంది నీ
యువతిన్ గైకొని పోవవచ్చు నిఁక నీ|యుద్దేశముల్ దెల్పుమా?

రాము—ఓరీ! రాక్షసాధమా! నీ దుర్గుణము బోనిచ్చుకొంటివి గాదు. దొంగయైనవాఁడు ప్రపంచంబెల్ల దొంగయే యనుకొనును. నీచుఁడైనవాఁడు ప్రపంచంబెల్ల నీచమే యనుకొనును. ధర్మయుతుండైనవాఁడు ప్రపంచంబెల్ల ధర్మమై యుండునను కొనును. ఛీ! ఛీ!! పశుప్రాయుఁడా!

తే. గీ. వాలితోఁగూడి సంతతిన్ | బడసినట్టి
చెలియ మండోదరిని నీవు | సిగ్గులేక

జేరదీసితి వారీతి । జేయుమనుచు
నాకు బోధించుచుంటె యజ్ఞానహృదయ.

నాకు బలము పూర్ణముగా దెలియకపోయినను వాలికి నీవిషయము బూర్తిగా దెలియును. ఏమందువా?

శా. వాలంబందున నిన్ను జుట్టుకొని సప్తాంబోధుల న్ముంచి, నీ
యాలింగూడి కుమారునిన్ బడసి యాహా బాహుమూలంబునన్
జాలాకాలము దాచి, త్రిప్పె నతుర్చ । సందేహము ల్లేక నీ
వాలీలన్ మఱివేడ బ్రోచితని నాడావాలికిన్ దెల్లమా.

ఛీ! నీచాత్మా! దోషంబులన్నియు నీకడ నుంచుకొని పైగ నన్నుఁ గేళి యొనర్చుచుంటివా? చూడు నిమిషంబున నీ తల ద్రెవ్వ నేసెదను.

రావ—ఓరీనీచా!

చ. పలుమరు ప్రేల నేమిటికి । పంతిముతోడింత నెన్నిమాయలో
తలలు కరంబునన్నఱుక । తప్పక వెంకడి యు మొల్చుచుంటచే
ఫల మికసందఁగాఁ దగిన । ప్రాప్తము లేదను బెంగతోడనే
జలజల కంటనీ రొలుక । సాగెగదా మరి యేలనీశ్రమల్.

అదియునుఁగాక నో నరాధమా!

తే. గీ. పముఁడు చేపట్టినటువంటి । పడతిఁ దిరిగి
బడయుఁగోరుట నదియెంతో । పాపమనుచు
నన్ను నిందించితివిగదా? । నాదుచెంత
నిన్నివాళ్ళున్న కాంతకై । యేడ్పువేల?

ఇట్టి నీతులు పరుల కుపదేశించుటకేగాని నీ కుపకరింపవా?

రాము—ఓ నక్తంచరాధమా! నీ యట్టి నీచాతినీచులకు బుద్ధి వచ్చునట్లొనరించుటకే నా ప్రయత్నముగాని మఱియొకందులకు గాదు. ఓరీ దశకంఠా!

తే. గీ. ఇదివరకు నీ చరిత్రి నా । కెరుక లేక
నిన్ను వధియింపజాలక । మిన్నకుంటి
నేఁటి కా రహస్యంబు గ్రి । హించితి నిక
బ్రిహ్మకజాలన్ను క్షణమైన । రణములోన.

ఓరీ రాక్షసాధమా !

తే. గీ. అరసి నీ నాభి యందున్న । యమృతకుండఁ
దొలుత చెడగొట్టి పిమ్మట । తలలు కరము
లెల్ల దెగగొట్టి నిన్ జంపి । మెల్లమెల్ల
చిత్రవధఁ జేయువాఁడ ని । చిత్రగతుల.

నీ ప్రేలాపన మింకఁ గట్టిపెట్టి చావునకు సంసిద్ధుండవై యుండుము.

రావ—రామా ! ఇంతగట్టు లంకయం జేటుసినటుల నా రహస్యంబు లన్నియు నూ విభీషణుఁడు నీ కెఱిఁగించివైచెనా ? ఇఁక లాభము లేదు ఈ దెబ్బతో నీకో నాకో చావు నిక్కము. (అని బాణమును విడుచును)

రామ—(ఒక బాణముచే గర్భమును భేదించును. వెనుక తలలు కరము బాణములచే చెండివైచును. పిమ్మట రావణుఁడు, శివా! శివా ! అని యార్చుచు రణభూమి గూలును. దేవదుందుభులు మ్రోగును. దేవతలు పుష్పవృష్టి గురిపింతురు.)

తెర వ్రాలును.

షష్ఠరంగము.

విభీషణ పట్టాభిషేకము.

[రామ, లక్ష్మణ, హనుమంత, సుషేణ, అంగదులు ప్రవేశింతురు.]

రామ—ఆర్యులారా !

కం. పరమేశు విలాసముచే
శరణను విభీషణుని దగు । సాహాయ్యముచే

మరి వానరయూథముచే
మరణించెను రావణుండు । మా యస్త్రముచేన్.

హనుమంతునకు నా యెడంగల భక్తి యపారమైనది. ఆతఁడు నా కొనరించిన యుపకారము లనంతములు. ఈతని సాహాయ్యము లేకున్నచో నా ప్రియసోదరుఁడు జీవించుటయే ల్ల. ఆతనితోఁబాటు మే మెల్లర మంతరింపవలసినదేగాని మరియొండు సాధనము లేదు. విభీషణుఁడుఁగూడ ధర్మపథగామియై సోదరప్రేమను బోనాడెను గావుననే మనకు జయము లభించినది. ఆతని లంకాపురపట్టాభిషేకం బొనరించి యాతనితోఁగూడ మన మందర మయోధ్యాపురి కేగుదము. వాయుసుతా! నీవు నా కింకొక్క యుపకారము సేయవలయును. అది యేమందువా? నా యరణ్యవాసమైన పదునాల్గేండ్ల సంవత్సరముల నయోధ్యకు వత్తుమని భరతునకు వాగ్దాన మొసంగితిని. కాని సరిగా నా నాఁటికి చేరఁగలుగుటకు మనకు మానవ సాధ్యము లేదు. కావున నీ వేగి భరతునకు మదీయాగమనవిశేష మెఱింగింపుము. విభీషణ పట్టాభిషేకమైన వెంటనే వెడలుదుము. ఈ యుపకృతి నీవు చేయక తప్పదు.

హను—స్వామీ! అనుగ్రహింపఁబడితిని.

[అప్పుడు విభీషణుఁడు సీతతోఁ బ్రవేశించుచున్నాడు.]

సీత—

శా. ప్రాణేశా! భవదీయపాదముల సే । వన్ జేయు భాగ్యంబు నా
కీనాఁడే లభియించె వెండియును నే । నిన్నాళ్ళు నా యాత్మలో
మీ నామంబె జపించుచుండిన ఫలం । బే మేలుచేకూర్చి నా
మానప్రాణముగూడ గాచినవి సు । మ్మన్నింపు ప్రాణేశ్వరా!

తే. గీ. మాయ లేదని జెప్పెడి । మఱది పల్కు-
వీనుల నుబెట్టకయ మిమ్ము । వేగఁ బంపి
యతని నిందించి తత్ఫలం । బందియున్న
నన్నుఁ బ్రోచితిరెంత మీ । మన్ననమునఁ.

మఱదీ! లక్ష్మణా! నిన్ను వేఁటకుఁ దగఁ బుగాని నన్ను క్షమింపుము.

చ. దుడుకుతనంబునన్ మిగుల । తొందరతో నిను నిందఁజేసి యీ
వడువున కష్టముల్ బడితి । వంతను మింగితి ప్రాణవాయువుల్
వడివడి వీడనెంచితిని । వాయుసుపుత్త్రకుఁ డంతవచ్చి నీ
వడలకు మంచు జెప్పి మిము । నాదట నా కిటఁజూపెఁ బ్రేమతోన్.

రాము—భూపుత్రీ! మారయునందుండి మాట్లాడుము.

తే. గీ. మానవతులను బట్టి యి । మ్మాడ్కి-నేచు
క్రూరదనుజాధముని గూల్చి । కోర్కె-తోడ
గుర మొనర్చితినేగాని । తిరిగి నిన్ను
గైకొనెడి కోర్కె-తోడను । గాను సుమ్ము.

నీకు నా భావం బెఱింగించుచుంటిని. నీవిన్నిదినంబులు పరదారాభిమర్శకుండగు రావణునింట నుండుటఁజేసి నిన్నుఁ బరిగ్రహించు బుద్ధి నాకు లేదు. అట్లు పరిగ్రహించుట మిగుల దోషము. నీవార్తింబడి యుండుట నన్ను రక్షించుటయే నాకు కర్తవ్యముగాని నిన్ను బరిగ్రహించుట నాకు విధిగాదు. కావున నేను నిన్నొల్ల. నీయిష్టము వచ్చిన చోటికిం బొమ్ము

సీత—హా! దైవమా! (అనిమూర్ఛిల్లును)

హను—(కన్నీరుతుడుచుకొనుచు) రాఘవేశ్వరా! నీవెఱుంగని ధర్మమీ రేడులోకంబుల యందును లేదు. జనకజ మహాపతివ్రత.

రాము—వాయుపుత్రా! నాకంటె నీ కెక్కు-వ తెలియునా?

హను—కన్నతల్లి విషయమును తెలియని—

రాము— మాటాడకుండ నుండలేవా ?

హను— మాతృప్రేమ నన్ను—

రాము— మాటాడవలదు. నాయాన—

హను— హా!—(అని కూలబడును.)

లక్ష్మ—(రాముని పాదములపై వ్రాలి) సోదరా!... ... ... ...

రాము— అయ్యా! మీ రెవ్వరును నాకీవిషయంబునఁ జెప్పవలదు. మీ కందఱకును నా యానగలదు. ఊరకచూడుఁడంతియేగాని నోరు మెదపినచో మన్నింపను.

సీత—(మూర్ఛదేరి గద్గదస్వరమున) ప్రాణేశ్వరా!

* మ. తగునే నన్నిటులాడ నీకు ననవ । ద్యంబైన సద్వృత్తవా
ది గుణౌఘంబుల శుద్ధనౌ టెఱుఁగవే । తెంపాదయుక్తంబె, సా
రగరిష్ఠుండవు నీవు దుష్కృతివిచా । రవ్యక్తిదూరీకృతం
బగు వాక్యంబుల నొంపనేల యకటా । యన్యాయసంసక్తనే.

ప్రాణేశ్వరా! పలుకవేమి? నీవింక నాతో బలుకవా? నాజీవిత మింత యేనా! అయ్యో! నేనేమికావలసినది. నాప్రాణేశ్వరుని కీ యనుమానం బెట్లుతోఁచెను. నేను విశుద్ధచరిత్రనని యెల్లు నమ్మరు. జీవితేశ్వరా! మీ రవతారపురుషులని మానవు లెల్లరును మిమ్ము స్తుతింతురు. కేవలము తమరు భగవంతులే. అట్టి భగవంతుని యర్ధాంగలక్ష్మినైన నే నపవిత్రచరిత్రనా? మాటాడరేమి? నాతో మాటాడఁ దలఁచుకొనలేదా? అయ్యో! పిల్చుచుండఁగ పెడమొగము బెట్టకరేల? మీవదనపద్మమును జూచుటకైనను నేను నోచుకొనలేదా? ఆఁ ఆఁ ప్రాణేశ్వరా! మీరుకూడ విచారించుచుంటిరేల? వలదు. మీవదనము విన్నదనముదాల్చియుండ నే చూచి ప్రాణములను భరింపఁజాలను. మీరు నాతో మాటాడకున్న మానె నే నొక్కకోర్కె కోరెద

దాని కనుమతింపుము. భర్త్రాజ్ఞ బడయకుండ పతివ్రత లెట్టి కార్యమును జేయరాదు నే నపవిత్రనని లోకులచే నిందబడు ట కోర్వఁజాలను నేను మహాసాధ్వినని నిరూపణ జేసుకొనుము సెలవిండు.

రాము—(అంగీకారసూచకముగాఁ దలత్రిప్పును)

సీత—(లక్ష్మణునివైపు దిరిగి)

ఉ. లక్ష్మణ చూచితే యనఘ । లక్షణ లక్షితనైన నన్ను దు
ర్లక్ష్మచరిత్రఁబోలె నిక । లక్షితిగా భవదగ్రజుండు దా
సూక్ష్మనిశాతమైన మతిఁ । జూడక ఘోరవచోమహాగరు
త్పత్క్ష్మనితేకశాస్త్రముల । పాల్పడఁజేయుచునున్నవాఁ డొగిన్.

లక్ష్మ—(కన్నీటితో దలవ్రాల్చుకొనును)

సీత—హా! మీరెవ్వరును నాతో మాటాడరా! నాజీవితేశ్వరుని యాన యట్లున్నదా? సరే. లక్ష్మణా! నీకు నాయెడ మాతృభావము గలదేని వేవేగ చితిం బేర్పుము. ఆ యగ్నిహోత్రునిచే నే బవిత్రశీలనని చెప్పించెద.

లక్ష్మ—(విచారముతో రామునివైపు జూచును.)

రాము—(చితిపేర్పింపుమని సంజ్ఞజేయును లక్ష్మణుఁడు వెడలును. తెరలేచును. అగ్నిగుండము గాన్పించును)

సీత—(రామునకుఁ బ్రదక్షిణ నమస్కారములాచరించి గుండము చెంత కరిగి చేతులు జోడించి)

చ. స్థిరమతులార! మోనకల । దిక్పతులార! సురేంద్రులార! కి
న్నరవరులార! సర్పకుల । నాయకులార! మునీంద్రులార! ఖే
చరవరులార! యక్షగణ । చారణ గుహ్యకసాధ్యులార! వి
స్ఫురదినచంద్రులార! వర । భూతములార యెఱింగియుండుడీ

* కం. మీరిందఱు దగు గుఱిగా
గోరుచు నే నున్నదాన । గురుహితమతి నా
చారిత్ర్యం బేచందం
బేరూపము దానిమీర । శీర్పుఁడు మీఁకన్.

ఓ హవ్యవాహనా!

* తే. గీ. దుష్టకల్మష బుద్ధినై । దోషమునను
జనకులాధీశునకు దప్పి । సచ్చరిత్ర
మెడలి నడచూటఁగలిగిన । నీక్షణంబ
కాలఁగి నను వేగ భస్మంబు । సేయుమయ్య

(అని యగ్నిగుండములోఁ నుఱుకును. అగ్ని చల్లారును)

(అగ్నిహోత్రుఁడు సీతతో బ్రవేశించును)

(అందఱును హర్ష ప్రఫుల్ల వదనములతోఁ జూతురు)

అగ్ని—రాఘవేశ్వరా!

* శా. పాతివ్రత్యగుణంబు సుస్థిరమతిన్ । బాటించి కళ్యాణస
చ్ఛ్రీశోభావృత్తిఁ దనర్చి లక్షణములం । జెల్వొంది శుద్ధక్రియో
పేతప్రక్రియుమైన జానకి భవ । ద్భ్రూపానురూపంబుగా
బ్రీతిన్ బుట్టిన యాదిలక్ష్మి దలఁపం । బృథ్వీతలాధీశ్వరా!

ఈమెయెడ నెట్టిదోషమును లేదు. ఈమెను స్వీకరింపుము. అదిగో!
ఈమె పాతివ్రత్యమహాత్మ్యమును గొనియాడుటకై బ్రహ్మేం
ద్రాదులిటే వచ్చుచున్నారు.

[అప్పుడు బ్రహ్మేంద్రమహేంద్రదశరథులు ప్రవేశించుచున్నారు.]

బ్రహ్మ—సకలలోకాధీశ్వరా! జయతు జయతు.

రాము—పితామహా! నమస్కారములు.

ఇంద్రు—రాక్షసాంతకా! ప్రణామములు.

రాము—స్వర్గపురాధీశ్వరా! వందనములు.

మహే—అవతారపురుషా! అనంతకల్యాణము లగుఁగాక.

రాము—గిరిజామనోహరా! శుభం బగుఁగాక.

బ్రహ్మ—సర్వలోకరక్షకా! నీవిజయము ముల్లోకంబులకును హర్షపరిపూర్ణమైయున్నది తనకు నరవానరులచే మరణంబుగలదని యెఱిఁగి, యవతారపురుషుండ వగు నీవు కౌసల్యాదశరథుల కుద్భవింతువని నారదునివలన దెలిసికొని యీ రావణుఁడు నీ మాతాపితల వివాహమే గాకుండుటకై విశ్వప్రయత్నము జేసెను. కాని కర్మమునకుం దఱ పురుషయత్న మేమిపనిచేయును? లోకకంటకుఁడును, తన కాజన్మవిరోధియునగు దశకంఠునిఁ బరిమార్చిన నిన్నుజూచి, యాశీర్వదింపవలయునని నీజనకుండగు దశరథుఁ డిదే విచ్చేసియున్నాఁడు.

రాము—(వడివడి దశరథుని చెంతకేగి యాతనపాదములపై వ్రాలి)

తే. గీ. పుత్రశోకంబునను మది । బొక్కి బొక్కి
యొక్క సుతుఁడైన చెంత లే । కున్నతరిని
రామ రామా యటంచు స్వ । ర్గంబు జేరి
న జనక! యిదిగో నావంద । నములు గొనుము.

దశ—పితృవాక్యపరిపాలకా! నీకు శుభంబగుఁగాక. తనయా! నిను బోలు సత్యవాక్పరిపాలకుండగు పుత్రుని బడయుటచే నాజన్మ తరించినది. నాయనా! పదునాల్గేండ్లరణ్యావాసంబును ముగిసినది. మఱల యయోధ్యకేగి పట్టాభిషిక్తుఁడవై రాజ్యపాలనం బొనరింపుము.

రాము—చిత్తము.

లక్ష్మ—జనకా!

తే. గీ. రహిని సుగుణాభిరాముఁడౌ । రామచంద్రు
నడవులకుఁ ద్రోసితని దుఃఖ । పడుచు మిమ్ము

నొడలు దెలియక నిందించి । యున్న సుతుని
తప్పు మన్నించి గొనుము వర । దనము లివిగొ.

దశ—నాయనా ! సుగుణాభిరాముఁడౌ రాముఁ డరణ్యంబులకుఁ బోవుచుండెనను దుఃఖము దలమున్కలగుటచే నన్ను నిందించితివిగాని- నాపైఁ బితృప్రేమ లేకగాదు. అందు దోషము లేదు. చిరంజీవివై రామానుజుండవై గుణగణంబులందు రాముని సోదరుండవేయని యశఃపించుకొనుచు సుఖంబుండుము.

సీత—మామగారూ ! (అని దుఃఖముతో నమస్కరించును)

దశ—లోకమాతా ! లోకోద్ధరులగు పుత్రులంబడయుము. (రాముని దిక్కు) కుమారా ! సర్వలోకప్రపూజ్యయగు నీసతీమతల్లియెడ సంశయించితి వేల నాయనా !

రాము—జనకా! నా భార్యయెడల నాకెన్నటికిని యనుమానము లేదు. అగ్నికి చెదలంటునని తలంచుట వివేకముగాదా? కాని లోకులు కాకులవంటివారు. వారు సత్యాసత్యంబుల రయరు. రావణుఁ డపహరించిన యీమెను-దశకంఠుని బాహుమధ్యంబునం జిక్కిన యీమెను- రాముఁడేలుచుండెనని, నా యెడలను, నీమహాసాధ్వి యెడలను నిందలు వైతురు అట్టి మచ్చపుట్టిన పిమ్మట దాసిన డంచకొంట కష్టము. కావున యీమె పాతివ్రత్యమును గూర్చి నాకు సంశయము లేకున్నను, లోకసంశయనివారణార్థమై యీమెను సంశయించినట్లు నటించి యీమె పాతివ్రత్యమహిమము వేనోళ్ళ స్తుతించునట్లు జేసితిని. నాయర్ధాంగికి రాబోవు నింద తొలంగినది కావున యీమెగూడ నింకులకు హర్షింప వలయును.

సీత—ప్రాణేశ్వరా ! మీయానందమే నాయానందము.

అందఱు—ఆహాహా! సర్వలోకము లానందమయము.

బ్రహ్మ—శ్రీరామా! నిష్కారణముగా సనకసనందులవలన జయవిజయులకుం గల్గిన శాపమును దీర్పుటకై వరాహ, నారసింహ, రామావతారంబులం దాల్చితివి. ఇంకా జయవిజయులు మఱల శిశుపాల దంతవక్త్రులయి జన్మింతురు. వారిని నీవు కృష్ణావతారంబున సంహరింపవలయును.

రాము—చిత్తము.

ఇంద్రు—శ్రీరామచంద్రా! నావలన నేమయినఁ గావలయునా?

రాము—శచీధవా! నాకొఱకయి చాలమందివానరులు మడిసిరి. వారిని సజీవులం జేయుము.

రాము—కుంభకర్ణునిచే మ్రింగఁబడినవారుగాక తక్కిన వానరులు సజీవులయ్యెదరుగాక.

దశ—నాయనా! రామా! నీ ప్రతిజ్ఞాభంగము గాకుండ విభీషణుని లంకాపురి కభిషిక్తునిం జేసి శీఘ్రమే యయోధ్యాపురి కరిగి పట్టాభిషిక్తుండవయి ప్రజలం బరిపాలింపుము.

రాము—చిత్తము.

బ్రహ్మ—లోకరక్షకా! మేము వెడలుదుము. నీవు సకాలమున కయోధ్య కరుగకపోయినచో నేమైన ప్రమాదము వచ్చునేమో? ఇచ్చట కార్యములు శీఘ్రముగా ముగించుకొని వేగబొండు.

(బ్రహ్మ యింద్రోపేంద్రదశరథులును, అగ్నియు నిష్క్రమింతురు.)

రాము—(సీతను దగ్గఱగా దీసికొని) ప్రాణప్రియా!

మ. తరుణీ! నిన్నటు నిందఁ జేసితని చి / త్తంబందు నూహించి నీ
వురకన్ జింతిలఁబోకు మింక మది నా / యుద్దేశ మేరీతిదో

యెఱుగన్ జెప్పగ వింటిగాన, చెలియా ! యింకీ మహాకష్టముల్
దరిగెన్ గావున వేగ జేయుద మయో ! ధ్యాపట్టణంబున్ వెసన్.

జాన—చిత్తము.

రాము—వాయుపుత్రా ! విభీషణునకు పట్టాభిషేకం బొనరింపవలసి యున్నది. కావున సర్వసన్నాహం బొనరింపుము.

భటు—(ప్రవేశించి) స్వామీ ! సర్వసిద్ధముగా నున్నది.

రాము—మంచిది (అందఱు నిష్క్రమింతురు)

తెర లేచును.



పట్టాభిషేకమహోత్సవము.

రాము—(విభీషణుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి) విభీషణా !

చ. పరసతులెల్లఁ దల్లులని ! భావనజేయుము, నెమ్మనంబునన్
పరధనమెల్ల లోష్టమటు ! భావ్యుఁడవయ్యు ప్రజాళిసౌఖ్యమే
నరపతిసేమమంచు, నదె ! న్యాయముగా బలమంచు నెంచుచున్
స్థిరమతి న్యాయబుద్ధిమెయి ! నేచ్చెర నేలుము లంక నెల్లయున్.

ఆ. వె. ద్రోహబుద్ధి యింత ! దొడరిన నరపతి
మూలమట్ట మగుచు ! గూలిపోవు
న్యాయబుద్ధిగలుగు ! నరపతి నిజముగా
దినదినాభివృద్ధి ! గనును జుమ్ము.

(అగ్ని కిరీటము శిరముపైనుంచును. దుందుభులు మ్రోగును.)

రాము—వాయుపుత్రా! విభీషణపట్టాభిషేకమైనది. నీవతిరయంబున నందిగ్రామమునన కేగి భరతునకు నారాక నెఱింగింపుము.

హను—చిత్తము. (నిష్క్రమించును)

మాతలి—(ప్రవేశించి) శ్రీరామభద్రా! మిమ్మెల్లర నయోధ్యాపురికి దోడ్కొనిపొమ్మని మహేంద్రుండు పుష్పకవిమానంబును బంపి యున్నాఁడు. ఏమియాజ్ఞ?

రాము—మంచిది. ఆర్యులారా! అందఱ మయోధ్యాపురికి బోవుదము రండు

(అందఱును నిష్క్రమింతురు)

తెర వ్రాలును

సప్తమరంగము.

అయోధ్యాపురంబున పట్టాభిషేకమంటపము.

[సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులును, వసిష్ఠవిశ్వామిత్రాది ఋషీశ్వరులును, సుగ్రీవహనుమదంగద వానరులును, విభీషణుండును, కొందఱు పురజనులును నుండఁగాఁ తెర లేచును.]

రాము—(భరతుని కౌఁగిలించుకొని) భరతా! సుగుణచరితా! నీకెంతటి సాహసము కూడునా? సమయమునకు హనుమంతుఁడు రాక యున్నచో మనవంశ మేమి కావలసినది?

భర—అగ్రజా! నన్నేమి చేయుమనెదరు?

మ. పదునాల్గేండ్లును మీదు నాజ్ఞ । మెయి నే బాలించితిన్ రాజ్యముం
ముదితోత్సాహముతోడ పాదుకలనే । బూజించుచున్ భక్తితో
బదునాల్గేండ్లును జెల్లిపోయినను । మీపల్కుప్రకారంబుగా
సదయాత్మా తమరింక రాకునికి । నే జాగోరితిన్ దోషమే.

సోదరా!

సీ. తమయాజ్ఞ నాకెందు । దప్పనిదాటచే
వదునాలుగేండ్లును । బ్రదికియుంటి

నాపైన మీదివ్య । రూపంబు జూడక
యొక్కనిమిషంబైన । నుండగలనె
యనిననాటికి మీర । లరుదేరకున్న నో
మరణింప నదెగదే । వరము మిమ్ము
అనిననాటికి తమ । రరుదేఱకుటచే
మరణించుయత్నముల్ । జరుపుచుంటి
చితిదరికి జేరుచుండంగ । శీఘ్రగతిని
వాయుపుత్రకుఁ డరుదెంచి । ధన్యకృపను
తమరువచ్చెడివార్త చి । త్రంబులలర
నన్నుఁ జాకుఁడఁజేసె నో । సన్నుతాంగ.

రాము—వాయుపుత్రా! నీవు నాకొనర్చిన యుపకారము లనంతములు. నీకేమి కావలయునో గోరుకొమ్ము.

వాయు—రామభద్రా! మీదివ్యనామంబు నే నెవ్వేళ భజించుకొను నట్లు వరమొసంగుఁడు.

రాము—మారుతీ! అట్లే యగుఁగాక. అదియుఁగాక నిన్ను బిండారు భక్తిశ్రోగొల్చు మానవులకు సర్వసుఖంబులును గల్గుగాక.

వసి—సభ్యులారా! సుమహూర్తము మించిపోవుచున్నది. శ్రీరామునకు పట్టాభిషేకమహోత్సవము నెఱపుదమ్రాను. (అని రాముని సింహాసనముపైఁ గూర్చుండబెట్టి) రామభద్రా! రఘుదిలీపయజ దశరథమహారాజులవోలె సిధరఁ బరిపాలించుచు స్థిరయశో లక్ష్మిఁ బడయుము.

ఆ వె॥ సుష్టమతులఁ జంపి । శిష్టుల వెసఁబోంచి
యవని గావబుట్టి । పట్టిహరివి
నీవు గాన మేము । నీ వెఱుఁగనినీతి
బోధ సేయగలమె । పుణ్యపురుష.

రాము—(లేచి) సభాస్తారులారా!

తే. గీ. నెలకు ముమ్మాఱు వర్షముల్ । గలుగుగాత
నిజసతీత్వంబు సతులకు । నిలుచుగాత
ప్రజలు రాజభక్తిని నొంద । వరలుగాత
హర్షమున భూమి ప్రజలెల్ల । నలరుగాత.

మునులు—తథాస్తు తథాస్తు. తథాస్తు.

ఇది శ్రీసత్యవతీకృపాపాత్ర భారద్వాజసగోత్ర పవిత్రాయినాపురపు
వంశలతాంకూర సత్యమాంబాబాపనామాత్య మిథున గర్భశుక్తి
ముక్తాఫల మృదుమధుర కవితా విశేష్మ్యాశేశ్వర సుబ్రహ్మణ్య
శాస్త్రి మలకపల్లి చినశేషగిరిరాయ కవిద్వయ ప్రియ
శిష్య విబుధసజ్జనవిధేయ సోమేశ్వరరాయ కవి
ప్రణీతమైన సంపూర్ణ రామాయణమునందు
సర్వమును షష్ఠాంకము
సమాప్తము



# అనుబంధములు.



## 1 వ అనుబంధము.

వసి— కళ్యాణిరాగము—ఆదితాళము.

ప॥ దశరథా! నందియ నందకుమా!

అ॥ ప॥ విశదముగఁ దెల్పితి నీసుతుంజరిత మో॥ దశ॥

చ॥ 1. శ్రీరాముని మానవుఁగా - జెప్పఁదగదు, భూ

భారముమాన్ప నరుఁడయ్యె - పద్మదళాక్షుఁ డాహరి॥ దశ॥

2. సౌమిత్రియె శేషశాయి - భరతశత్రుఘ్ను లె

శంఖుచక్రములు - సత్యం బిది నమ్మమో॥ దశ॥

3. లోకకంటకులను ద్రుంచి

లోకంబుల నేలుకొఱకు

సాకటము శ్రీహరియే

యిట్లవతారం బెత్తె నమ్మమో॥ దశ॥

## 2 వ అనుబంధము.

వసి— శంకరాభరణరాగము—అటతాళము

ప॥ నాదే - భాగ్యము

అ॥ ప॥ ప్రత్యక్షంబుగ భగవంతునిఁ గొల్చెడి॥ నాదే॥

చ॥ 1. ఆతనినే ధ్యానించుచు

ఆతనినే భజియించుచు

ఆతనినే సేవించుచు

ఆతనినే గొలుచుచునుండెడి॥ నాదే॥

2. ముల్లోకారాధ్యునకున్

సల్లలితాకారునకున్

చల్లని శ్రీరామునకు
మెల్లఁగ గురు డఁగాఁ గలిగెన॥ నాదే॥

3 వ అనుబంధము.

దశ— ఆనందభైరవి రాగము—ఏకతాళము

ప॥ క్షమియింపు మో - తాపసేంద్రా!
అ॥ ప॥ నీపదములపై వ్రాలి - ప్రార్థించుచున్న నను॥ క్షమి॥
చ॥ 1. శ్రీరాముఁ డెంతయో - చిన్నవాఁడాటచే
నీరీతిఁ గోరితిని - నేరమెంచక నన్ను॥ క్షమి॥
2. పలలాశనులబట్టి - పల్లార్చి యాగంబు
చెలఁగి జేయుంతును - శిక్షించ నేవచ్చి॥ క్షమి॥
3. బాలుని బంపంగ - ప్రాణమోర్వను గాన
జాలము చేయక - జయ్యన నేవత్తు॥ క్షమి॥

4 వ అనుబంధము.

అహల్య— పరజు రాగము—త్రిపుట తాళము.

ప॥ రామా! నినునే ప్రార్థించెదనో॥ రామా॥
అ॥ ప॥ రామామణి నను బ్రోవుము శ్రీరామా॥ రామా॥
చ॥ 1. పతితురాలనయి - పాపం బొనరించితి
గతినీవని నీపద - కమలము లంటితి॥ రామా॥
2. పావనచరితా! నీ - పాదధూళిచే
పావనినైతిని గా - పాడుము నన్నుఁక॥ రామా॥

5 వ అనుబంధము.

మునులు— శ్యామరాగము—ఏకతాళము.

ప॥ జయ, జయ, జయ, రామా!
అ॥ ప॥ జయ, జయ, జయ, జయ, శ్రీరామా!॥ జయ॥

చ॥ 1. దశరథ రామా! - దైత్యవిమర్దన భీమా!
సకల సద్గుణోద్ధామా - జానకీమనః కామా!॥ జయ॥
2. ఈశా! సర్వలోకేశా - శాపవినాశా
శాశ్వతానందరూపా - స్వప్రకాశా! యీశా॥ జయ॥
3. పతితపావనా - భక్తపోషణా
గతినీవేగద లో - కంబులకన్నిటికిని॥ జయ॥

6 వ అనుబంధము.

మంథ— హిం॥ కాఫీరాగము—ఏకతాళము.

ప॥ ఈయురుకులేమి? - యీపరుగులేమి?
ఈయుత్సవమేమి? - ఈభజనలేమి?
చ॥ 1. ఎట్టిపండుగయును గాదే - నేడెట్టి సుదినముగాద
ఇట్టియుత్సవము నుజేయ - నెట్టిహేతువో యెఱుకపడదే॥ ఈయు॥
2. కైకదాసినైన నాకె - కారణమే యెఱుకపడదె
యింకెవ్వారికి దెలియునీ - యుత్సవ మిట్టిదనుచు॥ ఈయు॥

7 వ అనుబంధము.

ముఖారిరాగము—ఏకతాళము.

కైక—
ప॥ మంథరా! - నామాటవినవే॥ మంథరా॥
అ॥ ప॥ రాముఁడే - సుగుణాభిరాముఁడే
యినవంశాబ్ధి సోముఁడే॥ మంథ॥
చ॥ 1. కన్నతల్లికంటె మిన్నఁగ
నన్నుఁజూచెడి ధన్యుఁడే
మన్ననంబున నేనుఁగూడా
కన్నసుతువలె జూతునే॥ మంథ॥

2. భరతుడెంతయొ నాకు గుణ
భరితుఁడో రఘురాము డంతియొ
యెఱుఁగవే - అటువంటివాని
యెట్లు మోసముజేతునే॥ మంధ॥

8 వ అనుబంధము

దశ— ఫీల్వా రాగము—అటతాళము.

ప॥ హా! హా! హా! హా! తనయా!

అ॥ ప॥ సుగుణవినయా! నిను నెటు బాయుదురా॥ హా హా॥

చ॥ 1. ఏమి సేతు కైక పట్టు - విడువ దయ్యె
సవతిపుత్రుఁ డనెడి నా - త్సరమే హెచ్చుచుండె॥ హా॥

2. ధర్మపరుఁడవయి నీవే - ధరణి నేలుచుండఁగ
గాంచుకోర్కె భస్మ - మాయె కైకవలన నాకు॥ నాహా॥

3. ముందువెనక లరయక - మందయాన కిడినవరములు
సందేహము లేకుండఁగ - చావుదెచ్చెనా కకటా॥ హా॥

4. పలుమారులు బ్రతిమాలిన - బ్రార్థించిన నీ
పలుగాకిని పట్టువిడదు - ప్రాప్తము లేదింక॥ నాహా॥

9 వ అనుబంధము.

కౌస— పున్నాగరాగము— ఏకతాళము.

ప॥ వనముల కెటు బంపుదాన - నిన్ను॥ వన॥

అ॥ ప॥ పెంచినప్రేమెల్ల - త్రెంచి వైచుక నిన్ను॥ వన॥

చ॥ 1. సతతంబు నీవేనా - గతియంచు మదినమ్మి
బ్రతుకుచుండెడి బ్రతుకు - భస్మంబు జేసుక॥ వన॥

2. కొడుకుఁ గోడలు నింట - నడయాడు చుండంగ
గాంచజాలక కనులఁ - గారము గొట్టుక॥ వన॥

3. తల్లిరూపము దాల్చు - తతదెయ్యము నె కాని
తల్లిని గానయ్య - తలపకు మీఁకనన్ను॥ వన॥

## 10 వ అనుబంధము.

కౌస— హిం॥ తోడిరాగము—అటతాళము.

ప॥ వనముల ప్రోచుగాత - ఆ
అ॥ ప॥ వనదేవతలే ముదమున మిమ్మెప్డు॥ వన॥
చ॥ 1. గరుఁడు డమృతమును దే - నరిగిన యప్పుడు
కరుణించి దీవించు - వినత దీవనలె॥ వన॥
2. సతతసత్యవ్రత - సాక్షులుండ వగునిన్ను
సతతంబు ధర్మసంస్థాప దేవతలు॥ వన॥
3. పితృవిధేయుండవై - వెలయు నిన్నెప్పుడు
మతిమంతులౌశుభ - దేవత లెలమిని॥ వన॥

## 11 వ అనుబంధము.

దశ— విచారలహరి.

ఫిల్హారాగము—ఏకతాళము.

ప॥ రామా, రామా, రామా! నను వీడిపోదువే
అ॥ ప॥ నినుబాసి, యెటులనేను - నిలువ నేర్తురా॥ రామా॥
చ॥ 1. గుణఖనివని జనులచేత - గొప్పకీర్తిఁ గనినన్ను
వనములబ్రదుకంగ బంప - బ్రదుకు టెటుల నేను॥ రామా॥
2. బ్రదుకజాల, బ్రదుకజాల - బ్రదుకజాల రామా!
3. మదిరాక్షి కిడినవరము - మానెద మరి నిలువుమయ్య॥ రామా॥
4. పాపరూపమునను - బడియైనను నుండఁగలనే
పాపంబెటుగని నిను - బాసి బ్రదుకజాల॥ రామా॥

12 వ అనుబంధము.

దళ— కేదారగౌళ రాగము—జంపెతాళము.

ప॥ లేదే - నిను( జూచు భాగ్యమిక నాకు॥ లేదే॥

అ॥ ప॥ ఏలలేదు నేనిపుడె - నీవెంటవత్తు నిలుపుమయ్యా॥ లేదే॥

సాకీ॥ పితృవాక్య పరిపాలకా!
సత్యమార్గానువర్తీ!
సూర్యవంశాంబునిధిసోమా!
సర్వలోకైక పాలకా!

మిత్రి॥ నిను బాయలేక - నేనుగూడ - వచ్చుచుంటి నిలుపుమయ్యా॥ లే

13 వ అనుబంధము.

భర— పూరీకల్యాణి రాగము—ఏకతాళము.

ప॥ ముందు కార్య మేమిగలదమ్మా॥ ముందు॥

చ॥ 1. నను( జేరి ముండి - గనెడి తండ్రి
జనె దివి కని - విని బ్రదికితి॥ ముందు॥

2. పరమపావను( డన - బరగి జగముల
చిరకీర్తి గడించెను - చేరెను స్వర్గపురికి॥ ముందు॥

14 వ అనుబంధము.

కౌస— జంఝూటిరాగము—అటతాళము.

ప॥ ఎట్టులుంటివో ముద్దుతనయా!

అ॥ ప॥ క్రూరమృగములున్న - ఘోరాటవిలోన॥ నెట్టు

చ॥ 1. ఏనాడు కష్టంబు లేమో - యెఱుగవు
యీనాటి కీగతి - యిట్టివచ్చుట కాన॥ నెట్టు॥

2. పట్టంబులోపల - బడియుండెడి నీవు
నట్టడవిలో నీవు - నవయుచు నవయుచు॥ నెట్టు॥

3. పంచభక్ష్యాన్నములు - భక్షించువాఁడవు
ఆకలముల దిని - నడవుల నడలుచు॥ నెటు॥

15 వ అనుబంధము

రాము— నీలాంబరి రాగము—ఏకతాళము.

ప॥ జనకా! మముబాసిపోతివా!

చ॥ 1. క్షణమైన మముబాయు - జాలనివాఁడవే
శాశ్వతముగ మముబాసి - స్వర్గముజేరితే॥ జన॥
2. కొమరుల నలువుర - బడసియుదుదకొక
కొడుకు చెంత లేనప్పుడే - విడచితివే మేను॥ జన॥

16 వ అనుబంధము.

సీత— ధన్యాసి రాగము—ఏకతాళము.

ప॥ ఆహాహా! వింతమృగమదె గనుఁడు

అ॥ ప॥ దానిసోయగ మద్భుతము॥ ఆహా॥

చ॥ 1. బంగారుపోతఁబోసి - ప్రాణంబులనొసఁగి
రంగారగ సృష్టించెను - బ్రహ్మచతురుఁడై॥ యాహా॥
2. చెలులు లేనిలోపము - చిన్నమృగము నాకుఁదీర
ప్రాణముతో దొరిబట్టి - నా కిమ్మని వేఁడుచుంటి॥ నాహా॥

17 వ అనుబంధము.

లక్ష్మ— కల్యాణి రాగము—అటతాళము.

ప॥ నిజమైన లేడిగా దగ్రజా! అది॥ నిజ॥

చ॥ 1. నిజమైన లేడి కిట్టి - నెమ్మిరూప ముండనే
మాయలేడి యనుచు నా - మనమున దలఁచెద॥ ని॥
2. మిమ్ము మోసము జేయు - నెమ్మనంబున నెంచి
శూర్పణఖ యీలేడి - రూపమెత్తెఁగఁబోలు॥ నిజ॥

18 వ అనుబంధము.

రాము— హంసధ్వని రాగము—అట తాళము.

ప॥ ఇటుచేయదగునా! ఓ సోదరా!

చ॥ 1. కడతుక నుక్కఱైను - పర్ణశాలలోనిడి
యడవులకు రాదగునే - నాబల మీాఱె తెఱిగియు॥ ఇటు॥

2 నీవని నట్లది - నిక్కముగా మాయలేడి
యేకీడౌను మాడ - నున్నదో యేమో॥ ఇటు॥

19 వ అనుబంధము.

హను— భైరవి రాగము—త్రిపుటతాళము.

ప॥ నాజన్మ ధన్యమైనది ఆహా॥ నా॥

అ॥ ప॥ ఈనాటికి శ్రీరాముని గొలుచుటచే॥ నాజ॥

చ॥ 1. తాతిని నాతిగ జేసిన - శ్రీరాముని
పదసేవ లొనర్చెడి - భాగ్యము గలుగుటచే॥ నాజ॥
దుష్టుల శిక్షించుచు - శిష్టుల రక్షించుచు
కష్టములో గాచెడి - రాముని సేవించుటచే॥ నాజ॥

20 వ అనుబంధము.

అంగ— బారువా రాగము—ఏకతాళము.

ప॥ ఇక నేమి సేతునక్కటా!

చ॥ 1 సుగ్రీవునానతిని - చూచితిమి విడువక
యుగ్రాటవులలోన - యువిదగానగ రాదె॥ ఇక॥

2. పాలతిగాన్పింపదవు - బోయిచెప్పుట మేట్లు
యేలుగడ పినతండ్రి - అక్కటయేమి?॥ ఇక॥

21 వ అనుబంధము.

హను— అరభి రాగము—ఏక తాళము.

ప॥ లంకకు నేబోదును

అ॥ ప॥ నిశ్శంకతోడుతను - నిముషంబులోన నే॥ లంక॥

చ॥ 1. శ్రీరాము కార్యంబు జేసి - యీ జగమున
ధన్యుఁడనయ్యెద - తాతా దీవించుము॥ లంకి॥

2. రామనామమె నన్ను - లంకకు జేర్పించు
క్షేమంబుగాఁ బోయి - సీతజాడలు దెత్తు॥ లంకి॥

22 వ అనుబంధము. (డైలాగు)

జంఝూటిరాగము—అటతాళము.

లంకిణి—కోతిగా కోతిగా పోకయున్న
పొగరడంతు- కాసుకో- కాసుకో॥ కోతి॥

హను—లంకిణీ! శంకిణీ! పొగరు బోతు
మాటలనక మార్గమీయవే॥ లంకిణీ॥

లంకి—కోతిగా మార్గమిడనుగాని
నిన్ను చంపుదాన- కాసుకో- కాసుకో॥ కోతి॥

హను—లంకిణీ! శంకిణీ! ఎంతదానవే
నన్నుఁజంపనీకు శక్తియున్నదే॥ లంకి॥

23 వ అనుబంధము.

హను— ఆనందభైరవి రాగము—ఏకతాళము.

ప॥ రామ రామ సీతారామ- రామ

చ॥ 1. పతితపావన - భక్తపోషణ
పాపవిమోచన - నా - పాపము బాపుము॥ రామ॥
పాపదృశ్యమును - పరికించితినయ్యా
పాపమంటకుండ - పాలింపుమో దేవ॥ రామ॥



# అనసూయ

ఇది శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే రచియిం పబడి యిప్పుడే ముద్రితమై వెలకు సిద్ధముగానున్నది. అనసూయ సుమతుల పాతివ్రత్య మహాత్మ్యము అనసూయ బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బాలురగా జేయుట మాండవ్యుని శాపము సుమతి సూర్యోదయము గాకుండ శపించుట సుమతి పాతివ్రత్యమహిమవల్ల సుమతి భర్త మరల జీవించుట మొదలగు సంగతులు నిపుణముగా వ్రాయబడి యున్నది. ఒకసారి చదివి చూడుడు.

వెల రు 1—0—0

# విచిత్రచిత్రమాల

నవరసభరితమైన యైదంకముల నూతన నాటకము.

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే" రచియింపబడి యిప్పుడే ముద్రితమై వెలకు సిద్ధముగా నున్నది. అత్యద్భుతమగు కథ చదివినకొలది యింక జవు లూరుచుండును. చిత్రమాలా రాజసింహులకు పరస్పర వైషమ్యము గలుగవలెనని తలంచి చిత్రమాల తండ్రియగు ప్రభాకరుడొనరించిన దురాగతము జదివిన గర్భనిర్భేధ మగును. స్త్రీవిద్యను గూర్చియు, కన్యా వివాహమును గూర్చియు, ప్రభాకరునకును, వాని మంత్రులకు నడచిన వాదప్రతివాదములు శాస్త్రసమ్మతములై యుండును. ఇట్టి పుస్తక మిదివరకు వెలువడి యుండలేదు. త్వరపడుడు.

వె 0—12—0

---

సుబ్బుశెట్టి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు. ఇన్నీసుపేట, రాజమండ్రి.

సంగీత

# శ్రీకృష్ణరాయబారము

"శ్రీకృష్ణరాయబార" మనుటతోడనే ప్రతి యాంధ్రునకును ఇంతకథ జ్ఞప్తికి వచ్చి తీరును. ఈ రాయబారమును బ్రహ్మశ్రీ చక్రావధానుల మాణిక్యశర్మగారిచే నూతనముగా వ్రాయబడినది. పాత్రపోషణమునందేమి, పాత్రౌచిత్యమునందేమి ? దీనికిదియే సాటి. ధర్మజుని యోర్పు, భీముని రౌద్రము, శ్రీకృష్ణుని యుక్తి ప్రయుక్తులు, కర్ణాశ్వత్థామల తగవులాట, ధృతరాష్ట్రుని కృత్రిమాలోచన చదివి విని యానందింపవలయునే కాని యూరక వర్ణించుటవలన లాభము గానరాదు. ఒక్కమారు చదివి చూడుడు. కర్ణుని జన్మరహస్యము శ్రీకృష్ణుడు, కుంతియు గూడ వాని కెఱింగించి పాండవులలోనికి రమ్మనమని బోధింప కర్ణుడు తెల్పిన ధర్మములు విని తీరవలయును చక్కని పార్సి కర్ణాటక మట్లులో సహా వెల రు 0—12—0

# విభీషణపట్టాభిషేకము

ఇది మ॥ రా॥ శ్రీ అవసరాల శేషగిరిరావుగారిచే నూతనముగా వ్రాయబడిన నాటకరాజము. ఇదివఱకిట్టి నాటకము బయలువెడలియుండలేదని ధైర్యముతో చెప్పగలము. విభీషణుని నీతి, రావణుని మౌఢ్యము, విపరీతముగా జూపబడినది. తృతీయస్థానములో వాయుపుత్రుడు జూపించి ధైర్యస్థైర్య గాంభీర్యము లత్యద్భుతములు. కథాసందర్భంబున వచ్చెడి పాత్రయుచితము జెప్పునట్లు రచింపబడినది. పాట లత్యంత రసయుక్తములై చదివినకొలది చవులూరజేయునట్టివి యిరువదినాల్గు కలవు. పద్యము లాణిముత్యములు. చదివినకొలది చదువవలయునని యుత్సాహము జనింపజేయు గొప్పనాటకమిదియే. చదివి చూడుడు. వెల రు 0—12—0 మాత్రమే.

---